21193

మా పాఠకులకు, అభిమానులకు



# శుభవార్త

మరిన్ని అందాలతో అలంకరించి మిమ్మల్ని అలరింపజేయాలనే ఉద్దేశ్యంతో

## మే 1 నుంచి మద్రాసుకు మార్పు

మద్రాసులోని మా ఆఫీసు చిరునామా తొందరలోనే తెలియ జేస్తాం.

“జూన్” సంచిక మద్రాసునుండి వెలువడుతుంది.

ఈ సంచికలో తొలిమాట మరొక్కసారి చదవండి.

కొత్తది

అతి కొత్తది! ఉల్లాస రకం!!

పరిమళవిరాజితం!!!

రెమీ ®







శాండల్
టాల్క్

Sarath RST 1

# తొలిమాట

మద్రాసునుండి కాగితం సకాలంలో అందకపోవటం వల్లనూ, అట్టమీద బొమ్మ అచ్చు ఆలస్యం అవుతున్నందువల్లనూ ఎంత ప్రయత్నించినా పత్రికను సకాలంలో అందించలేక పోతున్నాం పాఠకులకు అందువల్ల ఖర్చు ఎక్కువయినా అను కున్నటయిముకు పత్రికను అందించాలనే పట్టుదలతో పత్రికను మద్రాసు నుంచి వెలువరించడానికి ప్రయత్నిస్తున్నాం

తొందరలోనే మా ప్రయత్నాలు పూర్తిచేసి జూన్ సంచిక మద్రాసునుంచి వెలువరించాలని మా ఆశయం.

మద్రాసులోని మా కార్యాలయం చిరునామా వగైరా ఇతర వివరాలకు "మే" సంచిక చూడండి

అందాలు మావి

చందాలు మీవి

అని ఎప్పుడో అన్నాం

అన్నమాట నిలబెట్టుకోవాలని ఇప్పుడు మా తాపత్రయం అందుకు మీ సహకారం కూడా లభించాలని మా కోరిక

వేమా రామలింగేశ్వర్

# ఎక్కువ సువాసన ఎక్కువ మెత్తదనము




మెత్తనిధి పూవువలె తాజాయైనది
సువాసనగలది
సాటిలేని క్రిమి సంహారి జి 11 గల
సింథాల్ టాయిలెట్ పౌడరు చాల సేపు నిలిచే
సువాసన మరియు పట్టువంటి మెత్తదనముతో
మీ చర్మమునకు అంటుకొని ఉండి
మీకు రోజంతా రక్షణ కలిగిస్తుంది

జి-11 గల
సింథాల్ మీకు
రక్షణ యిచ్చినట్లు
వేరే ఏ
పౌడరూ
యివ్వలేదు

INTERPUB/GP 17A TEL




సచిత్ర మాసపత్రిక

మాచవరం

విజయవాడ -4

విడిప్రతి వెల

1 రూపాయి

ఏడాది చందా

పన్నెండు రూపాయలు

సంపుటి 8

ఏప్రిల్ 1970

సంచిక 4

మేనేజింగ్ ఎడిటర్

వి వి రాఘవయ్య

Edited and Published by V. V. Raghavaiah and Printed by him at Jyoti Printers, Machavaram Vijayawada-4




ముఖచిత్రం

చక్రవర్తి చిత్ర

"మరో ప్రపంచం"

చిత్రంలో దృశ్యాలు



ఫిబ్రవరి జ్యోతి చూశాను. కథలన్నీ చాలా స్టాండర్డులో ఉన్నాయి. ప్రతి కథలో ఏదో ఒక ప్రత్యేకత కనబడుతోంది.

"ఎనలేనిమమకారంతో పెంచి, పెద్ద చేసి, సర్వహక్కులతో అమెను వేరొకరి చేతిలో పెట్టవలసి వస్తూంది. నిన్నటి వరకూ అమ్మాయి గురించిన జాగ్రత్తలు బాధ్యతలు నావి. అలాంటి నేను రేపటినుంచి ఆ పాపను నా ఇంటికి తెచ్చుకోవాలంటే వేరొకరి అనుమతి కావాలి."

"మనసు కుదిరితే భర్త ఆప్యాయంగా దగ్గరకు తీసుకోవచ్చు! లేకపోతే చీదరించి దూరం చేయవచ్చు. అదంతా ఆడపిల్ల అదృష్టాన్నిబట్టి ఉంటుంది." ఆడపిల్లను పెళ్ళిచేసి, అత్తగారింటికి పంపేటప్పుడు, తలిదండ్రులుపడే ఆవేదన.

"కాటేసిన చీకటి." ఈ దేశంలో లక్షలాది ఆడపిల్లల జీవితాల్ని కాటేస్తూంది. ఇందుకు కారణం ఏమిటి? భద్రయ్యలాంటి స్వార్థపరులా? రంగనాయకులులాంటి మగజాతా? గౌరిలాంటి అమాయకురాలైన ఆడపిల్లలుండటమా? అసహాయతా? దారిద్ర్యమా? ఏమిటి? ఏమిటి? ఏం చేయాలి ఈ పరిస్థితి పోవాలంటే?

ఈ దేశంలోని ఆడపిల్లల జీవితాలు ఇలా కన్నీళ్ళతో అంతం కావలసిందేనా? వాళ్ళ ఆవేదనను అర్థం చేసుకునే నాథుడేలేడా? ఏమిటి దీనికి పరిష్కారం!!

విద్యశ్రీ
హైదరాబాదు-36

సంపాదకులకు
ఆర్యా,

ఫిబ్రవరి జ్యోతి చదివాం చాలా బాగుంది. యన్. యస్. మణ్యంగారు రాసిన "ప్రగతికి సోపానాలు" కథ చాలా బాగుంది. ముఖ్యంగా యన్. వి. యస్. యమ్. శాస్త్రిగారు రాసిన జోకులు జ్యోతికే ఒక హైలైట్. మీ (మా) జ్యోతిలో ఇక నుంచి జోకులకు ఎక్కువ స్థలము వినియోగించ ప్రార్థన. ఇట్లు,

జె. మురళీధర్,
విశాఖపట్నం



CONCRETE THRASHING FLOORS



GRAIN STORAGE BINS OR SILOS



LOW COST HOUSING




In all these and many more

# K. C. P. BRAND



# DURGA BRAND

# PORTLAND CEMENT

-RENOWNED FOR STRENGTH & STABILITY-

play a constructive role

*PLEASE WRITE TO US FOR FREE TECHNICAL ADVICE*

MANUFACTURED BY :

**THE K. C. P. LTD.**

(RAMAKRISHNA CEMENTS)

MACHERLA.

**THE ANDHRA CEMENT Co., LTD.,**

VIJAYAWADA.

ఫిబ్రవరి నెల జ్యోతిలో సుమన్ వ్రాసిన "ట్విస్టు కథ చదివాను. మలుపు అనే పేరుతో సరస్వతి పాత్రను అగాధంలోకి తోసేశాయి రచయిత, సాయంత్రం అయేసరికి తెల్ల చీర కట్టుకుని వీధినపోయే ప్రతీ మగాణ్ణి రారమ్మని పిలిచే వేశ్యకూ ఈ సరస్వతికీ తేడా కనిపించదు. ఒకందుకు ఆ వేశ్యే నయం. ఆమె తప్పుచేస్తే చెయ్యవచ్చుగాని ఎవరినీ మోసగించడంలేదు.

తన భర్తకు విడాకులిచ్చి సరస్వతి హాయిగా భార్గవను పెళ్ళి చేసుకున్నా సమంజసంగా వుండేదికాని ఈ చాటు మాటు వ్యవహారం ఏమిటి?

శాంతమూర్తి,
హైదరాబాదు-4

'స్మైల్' (శ్రీ నాదెళ్ళ వెంకట సుబ్బారావు) చనిపోయాడంటే నిజంగా ఆశ్చర్యంకన్నా బాధ ఎక్కువ వేస్తుంది. 'స్మైల్' ఇప్పుడిప్పుడే పైకి వస్తున్నవాడు

'బాబు' (కార్టూనిస్టు) అన్నట్లు .. "అతని కార్టూన్లు, బొమ్మలు ప్రారంభ దశలోనే ఉన్నా. కాలం కదిలేకొద్ది గొప్పవాడవుతాడన్నది సందేహంలేని విషయం-బొమ్మలు వెయడం కుండా చిత్రకారులుగా పేరు తెచ్చుకున్నవాళ్ళ కంటే 'స్మైల్' ఎన్నోరెట్లు నయం" ....ఎంత చక్కగా చెప్పాడు పాపం తన 22 వ యేటనే నూరేండ్లు నిండిన స్మైల్ ఆత్మకు (జ్యోతి తరపున) శాంతి కలుగజేయమని భగవంతుని కోరుతున్నాను. వారి కుటుంబానికి నా సానుభూతిని, సంతాపాన్ని తెలియజేస్తున్నాను

—సి. సాయిబాబు
హైదరాబాదు-4 (ఎ పి.)

డియర్ ఎడిటర్

నమస్కారములు. మార్చి నెల "జ్యోతి" లో మీరు ప్రచురించిన వార్త నా ప్రియమైన మిత్రుడు శ్రీ ఎన్. వి సుబ్బారావు (స్మైల్) ఇక లేడన్న వార్త నన్నూ మా కుటుంబములోని వారందర్నీ దుఃఖభరితులను చేసింది. అతను నాకు చిరకాల మిత్రుడు అంతేకాదు అతను శ్రీ బాపుగారి ఏకలవ్య శిష్యుడుకూడాను ఆయన బొమ్మలలోని అందాన్ని తన బొమ్మల్లోనూ ప్రతిబింబింప చేయడానికి శాయశక్తులా కృషి చేసేవాడు ఈ మధ్య అతను రచించిన 'కాటేసిన చీకటి" అన్న కథ మమ్మల్నందర్నీ అలరించింది. ప్రఖ్యాత కార్టూనిస్టు శ్రీబాబు అన్నట్టు అతను ఇప్పట్లో వచ్చే ఆర్టిస్టులకంటే చాలా గొప్ప ప్రతిభ కనబరిచాడు మంచి అభివృద్ధిలోకి వస్తూన్న ఈ సమయంలో భగవంతుడతనిని చిన్న చూపు చూశాడు. ఈ సంతాప సమయంలో వారి కుటుంబానికి ప్రగాఢ సానుభూతిని తెలియజేస్తారని తలుస్తాను.

అతని ఆత్మకు శాంతి చేకూర్చునట్లు భగవంతుని ప్రార్థించుచున్నాను

వింజమూరి రామకుమార్
విజయపురిసౌత్

# చెరకు సముద్రం ఎచ్చట ఉందో చూశారా ?




FANTA IS A REGISTERED TRADE MARK OF THE COCA-COLA COMPANY

ఫాంటా ఆరంజి
రుచినేమందును?
మరిమరీ దాహం
కావాలని పించును!

ఫాంటా కోకా-కోలా కంపెనీవారి ఉత్పత్తి

CMCF-2-152 TEL

మార్చి "జ్యోతి" గటప చాలా బాగుంది. చిత్రకారుడు 'స్మైల్' మరణ వార్త మాకు చాలా విచారం కలిగించింది. అతని ఆత్మకు శాంతి చేకూర్చ మని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాము.

"రాక్షసీ! నీ పేరు రాజకీయమా! వర్ధిల్లు" సీరియల్ చాలాబాగుంటోంది.

ఇంత బాగా తీర్చిదిద్దుకొంటోన్న "జ్యోతి" కొన్ని తప్పులు వ్రాస్తోంది. 'వారధి' నవల ఆంధ్రపత్రికలో ప్రచురితమైందని వ్రాసింది. కాని, ఆ నవల 'ఆంధ్రప్రభ' లో చదివినట్టు గుర్తు. అచ్చు తప్పులుకూడ అక్కడక్కడ ఉంటున్నాయి. ఇటువంటివి లేకుండా ముస్తాబై వస్తే దిష్టి తగుల్తుందని భయమా ?

—ఎస్వీయస్. ఎం. రామారావ్
(బరంపురం)

మీరు ప్రచురించిన "గమనశ్రమ" అనే కథ నాకు చాలా బాగా నచ్చింది. ఆదివిష్ణుగారి "రాక్షసీ, నీ పేరు రాజకీయమా ! వర్ధిల్లు !" సీరియల్ చాలా చక్కగా నడుస్తూ, పాఠకులను సంతృప్తిపరుస్తున్నది. పోతే కె. శివారెడ్డిగారి "పారడాక్స్" గేయం నాకేమీ నచ్చలేదు. యద్దనపూడి సులోచనారాణి గారి "అశల శిఖరాలు" సీరియల్ సస్పెన్స్‌తో నడుస్తోంది.

—బి. బాబూరావు
సికింద్రాబాద్-25

మార్చి "జ్యోతి" లో ప్రచురింప బడిన "మనుషులు మారరు" కథ చదివాను. జయపురం ప్రజల జీవితాన్ని ప్రతిబింబించ ఈ చక్కని కథను రచయిత సుమారు 15 సంవత్సరాల క్రితమే రచించారు. అప్పట్లో జయపురం నుంచి వెలువడుతుండే "వెన్నెల" అనే లిఖిత పత్రికలో ఈ కథ మొదటిసారిగా ప్రచురింప బడింది. ఇన్నాళ్ళ తర్వాత అది అచ్చు రూపంలో మీ పత్రికలో రావటం చాలా సంతోషింపదగిన విషయం. అయితే రచయిత శ్రీ పులిపాక సూర్యప్రకాశ రావుగారి పేరు విషయసూచికలో తప్ప కథలో ఎక్కడా ప్రచురింప బడలేదు. ఇది చాలా శోచనీయం. ఏదయినా 15 సంవత్సరాల నుంచీ వెలుగు చూడని ఈ మంచి కథను మీరు ప్రచురించి నందుకు నా ధన్యవాదాలు.

—న్యాయపతి బాలకృష్ణారావు
ఖరగ్‌పూర్

ఈ మధ్య "జ్యోతి" చాలా ఇంట రెస్టింగ్‌గా ఉంటోంది. మార్చి నెల జ్యోతిలో భమిడిపాటి రామగోపాలం గారి "గమనశ్రమ", శ్రీ గిరిరాజుగారి "ప్రేమలూ—పెళ్ళిళ్ళూ", రాముగారి "సీడ" చాలా బాగున్నాయ్. రెండు సీరియల్స్ పోటీగా నడుస్తున్నాయ్ ! ఇది ఇలా ఉన్నా ఇంకేదో కొత్తదనం కావాలి అనిపిస్తోంది.

ఆ! -జోక్స్ పూర్తిగా తగ్గించేశా రేమిటి ?

స్మైల్ మరణం చాలా విచారాన్ని కల్గచేసింది ! వారి కుటుంబానికి మా సానుభూతిని, సంతాపాన్ని అందచేయండి. —సుధాకర్
కేరాఫ్ 563 ఎ. పి. ఓ.

# ఆకలి శిఖరాలు

(గతసంచిక తరువాయి)

## 5

వ్యాను ఎక్కినకారు, హవుసింగ్ బోర్డువారు ఏర్పరిచిన ఒక కాలనీలో చిన్న యింటి ముందు వచ్చి ఆగింది.

ఇల్లు చిన్నదే! కానీ గేటుముందు పెంచిన మొక్కల వల్ల ఒక విధమైన అందం వచ్చింది. లోపల వరండా దగ్గర మాలతి తీగ దట్టంగా అల్లుకుని వుంది. కారులోంచి యిద్దరం దిగి లోపలికు వెళ్లాం.

డ్రాయింగ్ రూమ్‌లో అడుగు పెట్టగానే ఆయన నన్ను కూర్చోమని చెప్పి లోపలకు వెళ్లారు. లోపల 'ఇదుగో ఏమోయ్? ఎక్కడున్నావ్' అంటూ భార్యని కాబోలు పిలవడం వినిపించింది. నేను యిల్లు గమనిస్తూ కూర్చున్నాను. ఫ్రేమ్ కుర్చీలు వేసి యున్న ఆ గది చాలా నిరాడంబరంగా, హాయిగా వుంది. గదిలో ఓమూల చిన్న అద్దాల బీరువా, దాని మీద రేడియో వున్నాయి. బీరువా నిండా, రకరకాలువి, బహుమతి వచ్చిన కప్పులున్నాయి. గదికి మరో మూల చేపలు వేసిన గాజుతొట్టి వుంది. బంగారు రంగులో మిలమిలలాడుతున్న నాలుగైదు చేపలు, నీళ్లలో అర్జెంట్ పనితో హడావుడి పడిపోతున్నట్టు క్రిందకి, పైకి వేగంగా దూసుకుపోతున్నాయి. నా కళ్లుగది అంతా కలియ తిరిగి, రేడియో పైన గోడమీద, ధ్యాన ముద్రలో వున్నట్టున్న బుద్ధభగవానుని నిర్మల్ పెయింటింగ్ మీద నిల్చిపోయినాయి. ఇంతలో ఆయన లోపలనుంచి యిటువైపు వస్తున్న శబ్దం వినిపించటంతో గుమ్మం వైపు చూసాను. ఆయనతో పాటు ఆవిడ కూడా వచ్చింది. నేను లేచి నిలబడి నమస్కరించాను. ఆవిడ ప్రతి నమస్కారంచేసి, కూర్చోమన్నట్టు చూపించింది.

---

సిరియస్

---

ఈ ప్రపంచంలో కొంత మంది స్త్రీలు వున్నారు. వాళ్ళని చూడగానే చెప్పలేనంత గౌరవాభిమానాలు కలుగుతాయి. బహుశా యీ సృష్టిలో ఎంతో మధురమైన మాతృత్వపు మమత వారి కన్నుల్లో గోచరమవటమే కారణం అనుకుంటాను. రూపాలు ఎలా వున్నా, కట్టు, బొట్టు, నడవడిపీటితో ఎక్కడలేని ప్రత్యేకతను పొందే చాలా కొద్దిమందిలో యీమె ఒకరు అనిపించింది.

"నీ జోస్యం యింత బాగా నిజమౌతుందని అనుకోలేదోయ్." భార్యవైపు చూస్తూ చిరునవ్వుతో అన్నారాయన.

ఆవిడ నావైపు చూసి నవ్వింది. ఆయన అన్నారు నాతో.

"ఇంటర్వ్యూకి తీసుకుని చాలారోజులైంది. అతనికి యింకేదయినా వుద్యోగం దొరికి వుండచ్చు అని నేనెంత వాదించినా ఆవిడ వినలేదు. పుత్తరం వ్రాయమని పోరు పెట్టింది. ఆవిడ పతాయింపు వృధాకాలేదు."

అంత మందిలో ఆవిడకి ప్రత్యేకంగా నేనే ఎందుకు గుర్తున్నానో, నేనే కావాలని కోరటానికి కారణం ఏమిటో తెలుసుకోవాలని నాకు కుతూహలంగా అనిపించింది. "మీరు కూర్చుని మాట్లాడుతూ వుండండి. నేనిప్పుడే వస్తాను." అంటూ చేతిలో పనేదో సగంలో ఆపేసి వచ్చినట్టుగా వెంటనే వెళ్ళిపోయింది. నేను మళ్ళీ గదంతా కలియ చూస్తూ కూర్చున్నాను. ఆయన రేడియో పెట్టిన బీరువా తలుపు తెరిచి అందులోంచి ఆల్బం ఒకటి తీసి నా చేతికి యిచ్చాడు. నేను అది చూడగానే వాళ్ళబ్బాయిది అయివుంటుందనుకున్నాను. నా వూహ నిజమే అయింది! తెరవగానే మొదటి పేజీలో, దాదాపు నావయసే గల ఒకతని ఫోటో ఫుల్ సైజులో వుంది. టెన్నిస్ రాకెట్ విలాసంగా చేతిలో పట్టుకుని ఫోటో కోసం మంచి పోజు యిస్తున్నట్టుగా నిలబడి వున్నాడతను. ముఖం నిండైన నుగ్గులతో, ఆడపిల్లలా గుండ్రంగా వుంది! జుట్టు యిప్పటి కాలానికి అనుగుణ్యంగా నుదురుని సగం కలిపేస్తూ ముందుకు పడి వుంది.

పేజీలు తిప్పాను.

ఎప్పుడెప్పటివో గ్రూప్ ఫొటోలు, యిద్దరిద్దరినీ, అతని బాల్యానికి సంబంధించినవి, ఆవిడ, ఆయన కొడుకుతో కలిపి తీయించుకున్నవి ఎన్నెన్నో వున్నాయి. పీళ్ళ ఫొటోలో దాదాపు

# జరిగిన కథ

ఫస్టుక్లాసులో బి. ఏ. పాసయి. బాబాయి దగ్గర డబ్బు తీసుకుని ఎం. ఏ. చదివాను. వడ్డీతో సహా బాబాయికి మూడు వేలు బాకీపడ్డాను. పెళ్ళయిందని అబద్ధమాడి మేడమీద ఓ చిన్న గది కుదుర్చుకున్నాను. అనాథశరణాలయంలో వచ్చిన ఉద్యోగంలో యెంతోకాలం నిలువలేకపోయాను. ఇంటర్వ్యూకి వెళ్ళిన నాకు గోపాలంతో పరిచయమైంది. ఉన్నట్టుండి గోపాలానికి సు స్టీ చేయడంవల్ల అతని డ్యూటీ నేను చేపట్టి ఆ విధి నిర్వహణలో సమాజంచే దొంగగా ఊహింపబడ్డాను.

బాబాయి ఏదో సంబంధం ఉన్నదని, ఆరువేలు కట్నం ఇస్తారనీ దాంతో తన బాకీ తీర్చవచ్చని ఉత్తరం రాశాడు. నేను ఆ సంబంధం చేసుకోను. నీ బాకీ తీర్చలేని అసమర్థుడనే అని ఉత్తరం రాశాను. గోపాలం ఆరోగ్యం కొంత కుదుట పడింది. గోపాలం బలవంతంమీద సినిమాహాలు గేటు కీపరుగా చేరటానికి ఒప్పుకున్నాను.

అక్కడ తలవని తలంపుగా పాత పరిచయస్థురాలు కాంతి తటస్థపడింది. సిగ్గుతో కుంచించుక పోయాను. గతమంతా స్మృతిపథంలో తిరగడం మొదలైంది.

తరువాత 'జ్వాలాముఖి' పత్రికనుండి ఇంటర్వ్యూ వచ్చింది. ఎడిటర్ ఆదరంతో ఆ ఉద్యోగం నాకే యిచ్చారు.

.... ఇక చదవండి

ప్రతిదాంట్లో, కొన్ని ఇంట్లో ప్రాకుతో కొన్నింటిలో లంగా, జాకెట్‌తో ఒక మ్మాయికూడా ఉంది.

ఆల్బం పేజీలు వరసగా, ఎంతో శ్రద్ధగా, ఆసక్తిగా చూస్తున్నట్టు చూడసాగాను.

ఆయన నిట్టూర్పు విడుస్తూ అన్నారు.

'అసాధారణులకి ఆయుష్షు తక్కువ అంటారు. చదువులో. ఆటల్లో అన్నింటిలో ఫస్టున ఉండేవాడు. ఏమిటో ! బలవంతంగా బతకటం తప్పితే మా కంటి దీపమే ఆరిపోయినట్టుంది."

నేను సానుభూతి చూపాను.

పాపం ! ఒకే ఒక కొడుకు అని చెబుతున్నారు.

అతని భవిష్యత్ గురించి వాళ్ళు కన్న కలలు హఠాత్తుగా ఎండమావులు అయిపోవడం అనేది భరించరాని వ్యధే మరి.

ఆల్బంనిండా అతని ఫొటోలే: రకరకాలుగ, అనేక రకాల స్థలాల్లో తీసినట్టున్నాయి.

అతను వేసుకున్న ఆ బట్టలు ఆ గళ్ళు. ఒక్కొక్కచోట మెడలో స్కార్ఫ్. కుడిచేతికి గొలుసు. మోచెంపలవరకూ పెంచుకున్న జుట్టు యివన్నీ చూస్తే బాగా ఫాషన్స్ అంటే యిష్టపడే వ్యక్తిలా వున్నాడు. ఒక్కోచోట అతని ముఖంలో తల్లి పోలికలు స్పష్టంగా కన్పిస్తోన్నాయి.

ఆల్బం చూడడం అయిపోయింది.

చివరి పేజీ తిప్పేసి, మూయబోతున్న నేను హఠాతుగా ఆగిపోయాను. అందులో 18-20 సంవత్సరాల మధ్య వయసుగల ఒకమ్మాయి ఫొటో వుంది.

రెండు జడలు వేసుకుని రిబ్బన్లు పువ్వుల్లా వచ్చేలా మడిచి పైకి కట్టుకుంది. కళ్ళు వస్తుతః పెద్దవే వుండాలి.

కాటుక బాగా దిద్దుకోవడంతో బాగా వెడల్పుగా కన్పిస్తున్నాయి.

క్షణంసేపు తదేకంగా, ఆ ఫొటో వైపు చూస్తే. మనం చూస్తున్నది ఫొటో కాక, నిజంగా మనిషేమో అనే భ్రాంతి కలిగిస్తుంది.

అంత సజీవంగా వుంది ఆ ఫొటో!

నేను తదేకంగా గమనించడం చూసారు కాబోలు.

ఆయన వంగి నేను చూసిన పేజీ వైపు చూసి అన్నారు.

"ఈ అమ్మాయి నాభార్య తమ్ముడి కూతురు. ప్రస్తుతం హవుస్‌సర్జెన్ చేస్తోంది. ప్చ! ముందేం జరుగుతుందో తెలియకుండా, వెర్రిగా ఎన్ని గాలిమేడలు కడతాం! అన్నీ వూహాలే: ఒట్టి అభూత కల్పనలై వూరుకుంటాయి. సత్య పుట్టగానే మా కోడి భార్య అనుకున్నాం. మాకు ఆడపిల్లలు లేకపోవడంతో చిన్నప్పటి నుంచీ చీటికీ మాటికీ ఏదో ఒంకమీద మా యింటికి తెచ్చి అట్టిపెట్టుకునే వాళ్ళం. దాదాపు ఆ అమ్మాయి మాదగ్గిరే పెరిగిందని చెప్పాలి. యిప్పుడు ఆ అమ్మాయిని చూస్తేనే మాకు చెప్పలేనంత బాధగా వుంటుంది. పోయిన ప్రసాదు ఎలాగూ తిరిగి రాడు. వేరే సంబంధం చూసి చేయాలని వాళ్ళ సంకల్పం. ఈ అమ్మాయి వినటంలేదు. తనసలు పెళ్ళే చేసుకోనంటోంది. ప్రసాద్ లేపోతేనేం? ఈ యింటికి నేను కోడలినే అంటుంది. తను పెళ్ళి చేసుకుని వెళ్ళిపోతే మేం మరీ ఒంటరివాళ్ళం అయిపోతామని తన భయం. మాకేం ఫర్వాలేదని మేం ఎంత నచ్చచెప్పినా వినిపించుకోదు. డాక్టర్ పాసయి బాపేరు క్లినిక్ ఓపెన్‌చేసి, దీన, సాదకి తోచినంత వరకూ సాయం చేస్తాను అంటుంది.

ఏమిటో! మాకంటే పిచ్చిదై పోయిందది." దీర్ఘంగా నిట్టూరుస్తూ అన్నారాయన.

"ఎవరి సంగతి మీరు చెప్పేది? అంటూ వచ్చారావిడ.

"మన సత్య గురించే."

"సత్యా!" ఆ పేరు వుచ్ఛరించ డంలో ఆవిడకి ఆ అమ్మాయి అంటే ఎంత ఆదరం, ఆత్మీయతా వుందో నాకిప్పుడు తెలిసింది. ట్రేతో తెచ్చిన వుప్మా ప్లేట్లు మాముందు పెడుతూ అంది ఆవిడ.

"సత్య మధ్యాహ్నం వచ్చింది. నేను మీరు చెప్పమన్నట్టు గట్టిగా చెప్పేసాను. వాళ్ళ నాన్న కుదర్చాలని చూస్తున్న ఆ విశాఖపట్నం సంబంధం ఒప్పుకోకపోతే నాతో మాట్లాడాల్సిన అవసరం లేదన్నాను. మేం చచ్చి పోయినట్లు అనుకోమన్నాను కళ్ళం బడి నీళ్ళు పెట్టుకుని, కాసేపుకూర్చుని వెళ్ళిపోయింది. సత్య వెళ్ళింతర్వాత సుందరానికి ఫోన్ చేసి తాంబూలాలు పుచ్చుకోండి సత్యని ఒప్పించే బాధ్యత నాది అని చెప్పాను. చివరి మాటలు అంటుంటే ఆవిడ కంఠం వణకటం, గద్గదికం అవటం నేను గమనించక పోలేదు.

"మరీ అంత గట్టిగా ఎందుకు చెప్పావు? యింటికివెళ్ళి బాధపడుతూ కూర్చుంటుందేమో!" ఆర్ద్రా ప్రతి ధ్వనిస్తున్న కంఠంతో అన్నారాయన.

"దాని మొహం. చేతులారాజీవితం పాడుచేసుకుంటూంటే చూస్తూ ఎలా వూరుకుంటాం? సుందరం చెప్పాడు, ఆ సంబంధం చాలా మంచిది. కుర్రాడు ఇంజనీరింగ్ పాసయ్యాడుట. బాగా డబ్బు అదీ వుంది. పెళ్ళిచేసు కుని, భార్యని కూడా తీసుకుని పై చదువులకి విదేశాలు వెళ్ళాలని అను కుంటున్నాడుట."

"నిజమే! కానీ సత్య మనసు మొదట పెళ్ళివైపు మళ్ళాలికదా!"

క్షణంసేపు వాళ్ళిద్దరూ నా వునికినే మర్చిపోయినట్టు ఆ విషయం గురించి మాట్లాడుకున్నారు.



నేను విశ్శబ్దంగా శ్రోతలా వుండి పోయాను.

ఆవిడ ప్లేట్ నా చేతికిస్తూ 'తీసుకోండి. చల్లారిపోతోంది' అంది. నేను ఆల్బం మూసేసేముందు మరో సారి ఆ ఫొటోకేసి తదేకంగా చూసి మూసేసి పక్కన పెట్టాను.

ఆవిడ ఆల్బం తీసుకుని తనోసారి ఆ ఫొటోలన్నీ మొదటి నుంచీ చివరివరకూ చూసింది.

తర్వాత తీసుకెళ్ళి బీరువాలో పెట్టి వచ్చి కూర్చుంది.

"మీరెక్కడుంటున్నారు?" అంది నన్ను.

చెప్పాను.

"ఈ వూళ్లో బంధువులుగాని, స్నేహితులుగానీ ఎవరైనా వున్నారా?'

"బంధువులు లేరు. స్నేహితుడు ఒకతను ఉన్నాడు." గోపాలం పేరు చెప్పాను.

ఆవిడ కాఫీ తేవడానికి కాబోలు మళ్ళీ లేచి లోపలికి వెళ్ళింది.

మేంటిఫిన్ తింటూండగా ఇంతలో బిలబిలలాడుతూ ఐదారుగురు ఆడవాళ్లు 'సుభద్రమ్మగారూ' అని పిలుస్తూ లోపలకి వచ్చారు.

'లోపలుంది వెళ్ళండి' - అన్నా రాయన.

అంతా లోపలకు వెళ్ళారు.

వాళ్ళ పట్టుచీరలు, నగలు, తలలో పూలు చూస్తే పేరంటం పిలవటానికి వచ్చారేమో అనుకొన్నాను.

వాళ్ళు లోపలకి వెళ్ళిన వైపే చూస్తూ ఆలోచనగా అన్నారాయన.

"ఈ రోజు శుక్రవారం కాబోలు. క్లబ్‌లో పూజ ఉంటుంది."

"క్లబ్‌లోనా? పూజా?" అన్నాను.

"అవును. ఈ ప్రాంతాల్లో దగ్గరగా ఎక్కడా గుడిలేదు. క్లబ్‌లోనే వీళ్ళు

---

● ఒక రాజకీయవాది యింకొక రాజకీయవాదిని ఆకాశానికి ఎత్తివేస్తూ ఉపన్యసిస్తున్నాడు : " ..అతను తన లక్ష్యానికి నేరుగా పోగలిగాడు. తన మార్గానికి కుడి, ఎడమలను చూడకుండా, ఒక విర్ణీతమైన, ఉన్నతమైన లక్ష్యంవేపు చొరవతో నెట్టుకపోయాడు. మిత్రులుకాని, శత్రువులుకాని అతనిని ఆపలేకపోయారు. అతని మార్గాన్నుంచి పక్కదారుల పట్టించలేకపోయారు. అతని మార్గానికి అడ్డము వచ్చిన వారంతా, వారి వినాశాన్ని వరించారు. అటువంటి వ్యక్తిని మనం ఏమని పిలవాలి ? ? ?"

"లారీ డ్రైవరు" ప్రేక్షకుల్లో వెనుకనుంచి కేక.

అప్పుడప్పుడూ హరికథా, భాగవతం కాలక్షేపం చేస్తుంటారు. ఏదయినా ప్రోగ్రాం పెట్టి, డబ్బు వసూలుచేసి యీ చుట్టుపక్కల ఎక్కడైనా చిన్న గుడి కట్టించాలని వీళ్ళ ఆలోచన. కానీ చాలా రోజులనుంచీ అది తాపత్రయంగానే మిగిలిపోతోంది. ఆచరణ లోకి రావటంలేదు. అసలే మాఆవిడకి కాస్తదైవ చింతన దీన జనోద్ధరణ అంటే ఎక్కువ ఆసక్తి. దాంతో మా అబ్బాయి పోవటంతో యిప్పుడు మరీ అదే లోకం అయిపోయింది."

నాకు అది సహజంగానే కనిపించింది.

మనిషి మెదడుని వేధిస్తున్న ఆలోచనని వదిలించుకోవాలంటే ఒక్క క్షణం కూడా వూపిరి ఆడని పనులుండాలి.

మా కాఫీ ఫలహారాలు పూర్తి అయినాయి

"ఇక వెళ్దామా అంటూ లేచారాయన.

తల వూపేను నేను.

లోపలనుంచి ఆవిడ వచ్చింది.

వీడ్కోలు తీసుకుంటున్నట్టుగా నమస్కారం చేసాను.

ఆవిడ ప్రతి నమస్కారం చేస్తూ అంది.

"మా దగ్గర పనిచేయటానికి ఒప్పుకున్నట్టేగా! మనసు మార్చుకోవద్దు మళ్ళీ....

నాకు నవ్వు వచ్చింది.

నేను ఎలాటి పరిస్థితుల్లో వున్నానో అర్థికమైన యిబ్బంది నా మెదడని ఎలా వంచేస్తుందో ఆవిడ ఏ మాత్రం తెలిసినా యిలా అనదుకదా అనిపించింది.

ఇద్దరం బైటికి వచ్చాం.

కారు వరకూ వచ్చి సాగనంపింది ఆవిడ.

మేం ఎక్కిన కారు తర్వాత సరాసరి మురికిగా, యిరుకుగా వున్న ఒక కార్మికవాడలో వచ్చి ఆగింది.

అక్కడ పిల్లలు ఆడుకునే స్థలం వూడ్చి శుభ్రంచేసి, నీళ్ళు చల్లి వుంది. నాలుగైదు చాపలు పరిచి వున్నాయి.

వాటి కెదురుగా ఐదారు కుర్చీలు వేసి వున్నాయి.

మైకులు, తోరణాలు యిలాటి హడావుడి ఏమీలేదు.

మా కారు ఆగగానే యిద్దరు మధ్య వయస్కులు వచ్చారు.

వాళ్ళు ఎంతో వినయ విధేయతతో ఆయనకి నమస్కారం చేసారు.

"ఇతను రవికుమార్. నా పేపర్‌లో సబ్ ఎడిటర్‌గా జాయినయారు."

ఆయన పరిచయం చేసారు.

నాకొకాంచం సంతృప్తిగానే అనిపించింది.

వాళ్ళెంత పని అయినా చేయించుకోసి!

# ఏజంట్లు కావాలి

ఈ దిగువ ప్రాంతాలలో ధరావతు కట్టి తమ స్వంత బాధ్యతపై జ్యోతి మాసపత్రికను విక్రయించుటకు ఏజంట్లు కావాలి.

1. కృష్ణాజిల్లా
   - కొడాలి
   - నందిగామ
   - నూజివీడు
   - జగ్గయ్యపేట
   - పామర్రు
   - పెనమలూరు
   - ఆకుగొలను
   - కొండపల్లి
   - మానికొండ
   - గుడివాడ
2. చిత్తూరుజిల్లా
   - కాళహస్తి
   - పాకాల
   - బి. కొత్తకోట
   - పలమనేరు
   - కలికిరి
   - నీలేరు
   - పుంగనూరు
   - సత్తివేడు
3. కడపజిల్లా
   - పులివెందల
4. తూర్పు గోదావరిజిల్లా
   - అనపర్తి
   - రాజోలు
   - సామర్లకోట
   - మోరి
5. పశ్చిమ గోదావరిజిల్లా
   - ఆకివీడు
   - కొవ్వూరు
   - నిడదవోలు
   - ఆరవల్లి
   - పోలవరం
   - పెనుగొండ
6. గుంటూరుజిల్లా
   - చీరాల
   - చిలకలూరిపేట
   - పొన్నూరు
   - మాచర్ల
   - పెదనందిపాడు
   - మేదరమెట్ల
   - చిలువూరు
   - చేబ్రోలు
   - ఈమని
   - ఇంకొల్లు
   - కొల్లూరు
   - పెదకూరపాడు
   - టంగుటూరు

7. ఖమ్మంజిల్లా

భద్రాచలం

కొత్తగూడెం

చర్ల

మధిర

సత్తుపల్లి

8. కర్నూలుజిల్లా

ఆదోని

ఆళ్ళగడ్డ

బంగనపల్లి

డోన్

నందికొట్కూరు

9. కరీంనగర్ జిల్లా

జగిత్యాల

పెదపల్లి

10. మెదక్

సిద్దిపేట

11. నల్గొండజిల్లా

కోదాడ

మిర్యాలగూడ

నల్గొండ

భోనగిరి

దేవరకొండ

12. నెల్లూరుజిల్లా

బిట్రగుంట

కావలి

పొదలకూరు

బుచ్చిరెడ్డిపాలెం

కోట

నాయుడుపేట

13. నిజామాబాదు

షక్కర్ నగర్

ఆర్మూరు

భాన్స్వాడ

కామారెడ్డి

వివరాలకు :

సర్క్యులేషన్ మేనేజరు,

జ్యోతి

మాచవరం

విజయవాడ-4

ఎంత జీతం అయినా యివ్వనీ!

ఉద్యోగం చెప్పుకునేందుకు హుందాగా వుంది.

ఆయనకి వాళ్లు పూలమాలలు తెచ్చి వేసారు.

వాటిలో ఒకటి నాకు వేయబోయారు.

నామెడవరకూ ఆ మాల రాకుండానే తిరస్కరించాను.

ఆయన కుర్చీలో కూర్చునే వుపన్యాసం ప్రారంభించాడు.

అనాగరికంగా, నిరక్షరకుక్షుల్లా కనిపిస్తున్న వీళ్ళకి యీయన ఏం చెబుతున్నాడా అని కుతూహలంగా వింటానికి కూర్చున్న నేను ప్రసంగం మొదలైన కొద్ది సేపటికే నన్ను నేను మరిచి ఆయన మాటల్లో లీనమైనాను. భావావేశంతో, రసస్ఫూర్తిని ప్రతిధ్వనింపచేసే ఆయన కంఠంలో చిత్రమైన ఆకర్షణ వుంది.

"ఈ ప్రపంచంలో మనుష్యులందరూ సమానం! ఎవరికంటే ఎవరూ తక్కువగారు." అంటూ మొదలైన ఆయన వుపన్యాసం అసలు వ్యక్తిగతంగా మొదట మనిషి తనకి తాను ఎలాటి విలువ యిచ్చుకోవాలో వివరించారు.

నేను తక్కువవాడిని! నేను అనాగరికుడిని! నేను పేదవాడిని! ఇలాటి భావాలు మనిషిలో వుండే ఆత్మవిశ్వాసానికి... ంయమనశక్తికి గొడ్డలి పెట్లులాంటివి.

బైట ప్రపంచంలో మనకి ప్రత్యేకత కావాలని కోరుతున్నప్పుడు, ఆ ప్రత్యేకత ఏదో, మనింట్లో మన కుటుంబ సభ్యుల మధ్య, మన యిరుగూ, పొరుగూ మధ్య, మన వీధిలో మనం పొందేలా మెలగాలి." అంటూ సాగిపోయిన ఆ వుపన్యాసం, ఈ రోజుల్లో ప్రతిమనిషి తన తన పరిధుల్లో జీవితంతో ఎలా పెనుగులాడుతున్నాడో సోదాహరణంగా వినిపించారు.

ఈ విధంగా అనర్గళంగా అనేక సంఘటనలు కట్టుకథల్లా వాళ్ళకి తెలియచేస్తూ వాళ్ల యింకా సుఖంగా ఆనందంగా, సంస్కారంగా బ్రతకటానికి ఎలాటి మార్గాలు వున్నాయో ఆయన వివరించసాగారు.

అక్కడ వచ్చి కూర్చున్నవాళ్ళలో ఆడవాళ్లు కూడా వున్నారు. ఆయన చెప్పిన మాటలు వారంతా ఎంతవరకూ గ్రాహ్యం చేసుకోగలిగారో, దేవుడికే తెలియాలి. కానీ వాళ్ళు కూర్చోవటం ఎలాంటి చిన్న శబ్దంకూడా కాకుండా శ్రద్ధగా. చెవులు నిక్కబొడుచుకుంటున్నట్టుగా నాకు విచిత్రంగా అనిపించింది.

ఆయన మాటల్లో నూటికి నూరుపాళ్లూ వాళ్ళకి సంబంధించినవే వున్నాయి. ఆయన వాగ్ధోరణి చూస్తే యీ రకమైన వాళ్ళతో చాలా రోజులు నుంచి కలిసి మెలిసి తిరిగి, వారి అభిప్రాయాలు, ఆవేదనలు క్షుణ్ణంగా తెలిసినట్టుగా వుంది.

అక్కడనుంచి లేచియింటి ముఖం

పట్టేసరికి రాత్రి 8 గం. కావస్తోంది.

ఆయన నన్ను బస్‌స్టాప్ దగ్గర దింపారు.

"రేపు కలుసుకుందాం" అన్నాడు చేయి చాస్తూ.

"తప్పకుండా" అన్నాను, కర చాలనం చేస్తూ. నా కది మర్యాద కోసం చేయి కలిపినట్టుకాదు. చేతిలో చేయివేసి వాగ్దానం చేస్తున్నట్టుగా వుంది.

నేను చూస్తుండగానే కారు కను మరుగైంది.

బస్ స్టాప్ దగ్గర నిలబడ్డ నేను బస్‌కోసం వెయిట్ చేయకుండా నడక సాగించాను. రాత్రివేళ పేవ్‌మెంట్ల మీద ఆలోచిస్తూ షికారుగా నడవడం

నా కెంతో యిష్టం!

ఇక్కడికి గోపాలం యిల్లు ఎంతో దూరం లేదు.

వాళ్ళని చూసి యీ కబురు చెప్పి వెళ్ళాలని అనుకున్నాను.

ఎందుకోగానీ చాలారోజుల తర్వాత నా మనసు కాస్త వుల్లాసంగా అనిపించింది.

ఇప్పుడు ఆలోచిస్తే నేను యింటర్వ్యూకి వెళ్ళినట్టుగానీ, కొత్త వాళ్ళదగ్గర గడిపినట్టుగాని లేనేలేదు.

ఎవరో తెలిసిన వాళ్ళింటికి కొద్దిసేపు కాలక్షేపంగా గడిపి వుల్లాసంగా తిరిగి వచ్చినట్టుంది.

మా మధ్య పరిచయం చాలా స్వల్పం. అయినా నాకు ఒక విషయం సుస్పష్టంగా అర్థమైంది.

వాళ్ళకి నమ్మకమైన ఒక మనిషి కావాలి!

నాకు నమ్మకంగా జీతం యిచ్చే సంస్థ కావాలి!

ఒక విధంగా చూస్తే యిద్దరిదీ అవసరమే!

ఆ పత్రిక కోసం నా శాయశక్తులా పని చేస్తాను!

జర్నలిజం గురించి నాకు ఏమీ తెలియని మాట నిజమే.

కానీ ప్రయత్నిస్తే ఈ ప్రపంచంలో తెలుసుకోలేనిది అంటూ ఏదీలేదు.

నునే వేయబోయే ప్రతి అడుగులో మంచి చెడులని చూపటానికి, నన్ను హెచ్చరించటానికి ఆయన అండ నాకు వుండనే వుంటుంది.

పరధ్యానంగా నడుస్తున్న నేను ఎప్పుడు గోపాలం యింటిని సమీపించానో గుర్తించనేలేదు.

ఆలోచిస్తూ గబగబా నడిచేసినట్టున్నాను. త్వరగా యిల్లు చేరుకున్నాను.

నేను గుమ్మంలో అడుగు పెట్టగానే బాబు, పాప 'అదుగో మామయ్యవచ్చేసాడు' అన్నారు.

వాళ్ళిద్దరి చేతుల్లో కొత్తవి బిస్కెట్ పొట్లాలు ఉన్నాయి.

"ఏమిటి? నా కోసం ఎదురు చూస్తున్నారా? అమ్మ కొత్త టిఫిన్ ఏమైనా చేసిందా?" అన్నాను.

ఇంతలో గోపాలమే బైటికి వచ్చాడు.

"రవీ! రా! రా! యింత ఆలస్యమైందేం? నీ కోసం ఎవరు వచ్చారో చూడు!' అన్నాడు, నాచేయి పట్టుకుని వుత్సాహంగా లోపటికి లాగుతూ.

"ఎవరూ!" గోపాలం ఆసంబానికి ఆశ్చర్యపోతూ లోపలికి అడుగు పెట్టాను

అడుగు పెట్టిన వెంటనే చకితుడినైనట్టు చూసాను.

లోపల కుర్చీలో శాంతి కూర్చుని వుంది!

"శాంత!" నా పెదవులు అస్పష్టంగా పలికేయి.

నన్ను చూడగానే శాంతి లేచి నిలబడింది.

క్షణంసేపు యిద్దరం ఒకరిని ఒకరు రెప్పవాల్చకుండా చూసుకున్నాం.

గోపాలం అన్నాడు.

"పాపం! వీరు నీ అడ్రస్ కోసం ఎంతో వెతికారుట. మన మేనేజరు నేనూ, నువ్వూ స్నేహితులం అని చెబితే సరాసరి నా దగ్గరకి వచ్చారు. ఇద్దరం కలిపి నీ గదికి వెళితే నువ్వు రాలేదన్నారు. ఆమె అక్కడే వెయిట్ చేస్తానంటే ఇక్కడికి రమ్మని తీసుకు వచ్చాను. మీ యింటివాళ్ళతో నువ్వు రాగానే యిక్కడికి రమ్మనమని చెప్పాను. యింటికి వెళ్ళావా?

వెళ్ళలేదు అన్నట్టు తల తిప్పాను.

"గుడ్! మంచిపని చేశావు" గోపాలం వంట యింట్లోకి వెళుతూ,

"సీతా! రవి వచ్చాడు." అన్నాడు.

నేను, శాంతి ముఖాముఖి నిలబడ్డాం.

"గుర్తున్నానా నేను?" శాంతి అలకగా, తీక్షణంగా అడిగింది.

"ఎందుకు గుర్తుండవు?"

శాంతి తమాషాగా తల తిప్పింది.

"ఏమోలే! యిప్పు చాలా పెద్దవాడివి అయావుగా!"

ఆ మాటల్లో శ్లేషకి నా మనసు చివుక్కుమంది.

"కూర్చో" అన్నాను.

శాంతి కూర్చుంది.

నేను అలవాటు చొప్పున కిటికీకి చేరగిలబడి నిలబడ్డాను.

గోపాలం వస్తూ అన్నాడు.

"నీ స్నేహితురాలు నీకో మంచి వార్త తెచ్చిందోయ్" అన్నాడు.

నేను శాంతి వైపు చూసాను.

శాంతి నావైపు చూస్తూ అంది.

"రవీ! మాకు స్టీలు సామాను తయారు చేసే ఫాక్టరీ వుంది. దాని మేనేజరు ఏదో గొడవ వచ్చి వెళ్ళిపోయాడు. మాకు నమ్మకమైన మనిషి చాలా అవసరం. అందుకే నేను నిన్ను వెతుక్కుంటూ వచ్చాను." ఆరోజు నా కళ్ళముందు శాంతి భర్తకి నన్ను పరిచయం చేసినప్పుడు కరచాలనం కోసం నేను చేయి జాస్తే అతను చేయి అందుకోపోవటం గుర్తు వచ్చింది.

ఈరోజు శాంతి వెంట, వాళ్ళ కంపెనీలో వుద్యోగానికి నేను వెడితే, అతను నన్నెలా చూసాడో నేను వూహించలేనంత మూర్ఖుణ్ణేమీ కాదు.

గోపాలం నా అభిప్రాయం వినటం కోసం అన్నట్టు నా వైపు ఆతురంగా చూస్తున్నాడు.

నేను తల తిప్పి కిటికీలో నుంచి బైటికి చూడసాగాను.

శాంతి ధోరణి నాకు చాలా విచిత్రంగా కన్పిస్తోంది.

ఆ మాట్లాడే తీరు చూస్తే గతంలో మా యిద్దరిమధ్యా వచ్చిన భేదాభిప్రాయం పూర్తిగా మర్చిపోయినట్టు వుంది.

"మాట్లాడు. మాట్లాడవేం ?" అన్నాడు గోపాలం.

"నాకు వుద్యోగం దొరికింది గోపాలం" అన్నాను. సాధ్యమైనంత సహజంగా మాట్లాడటానికి ప్రయత్నిస్తున్నాను నేను.

"ఎక్కడ ?" శాంతి అనుమానంగా అడిగింది.

"ఒక పత్రికాఫీసులో సబ్ ఎడిటర్గా"

"ఎంత యిస్తారు జీతం ?"

మళ్ళీ మాటల్లో అదే శ్లేష !

నేను సమాధానం చెప్పలేదు.

గోపాలం నావైపు. శాంతి వైపు మార్చి మార్చి చూసాడు.

శాంతి యిలాటి సమాధానం ఏదో ముందే వూహించిన దానిలా చూసి నిట్టూర్పు విడిచింది.

"సరే. నీ ఇష్టం. ఈ రెండింటిలో నీకేది లాభదాయకంగా వుంటుందో బాగా ఆలోచించుకో. నువ్వు కావాలను కుంటే నీకు దొరికిన ఆ వుద్యోగం వదిలేయటం అంత సులభమేమీకాదు. నేను చెప్పిన ఆ మేనేజర్ పోస్టు మంచిది. చేతిలో మంచి అధికారం వుంటుంది. అన్ని వసతులూ కల్పించి, నెలకు నాలుగు వందలు యిస్తారు. యింతమంచి అవకాశం యింకెవరికో పోవడం యిష్టంలేక, నిన్ను వెతు

---

● యిద్దరు తీరంకరులు హడావిడిగా హోటల్ రిసెప్షనిస్టు దగ్గరికి వెళ్ళారు, యిద్దరిలో ఒకడు ఎలాగో తమకు కావలసిన దానిని అడగగలిగాడు:- మాకు రెండు రూమ్లు వుండే ఒక బెడ్డు కావాలి.

రిసెప్షనిస్టు:-రెండు బెడ్లు వుండే రూమ్ కావాలి కదూ

"కరక్టు !!" అన్నారిద్దరు.

రూమ్లోకి పోయి యిద్దరూ ఒకే మంచంపైన పడ్డారు. కాసేపటికి :

"గురూ ! నా బెడ్మీద ఎవరో పడుకున్నాడురా !"

"అరేయ్, నీ బెడ్మీదే కాదు నా పక్కలోకూడా ఎవడో వున్నాడురా!!"

"ర్ర్రరేయ్ బద్మాష్లని తన్ని తరుందామురా" వెంటనే గదంతా గంద్రగోళం అయి కాసేపటికి ఆగిపోయింది.

"గురో ! మా వాడిని తన్ని కిందికి నెట్టాను రా."

"భేష్ ! కాని మావాడు గట్టివాడు, నన్నే కిందికి తోసేశాడు."

"మరేం ఫర్వాలేదు, నా పక్కలోకిరా బజ్జుందాం !"

క్కుంటూ వచ్చాను. ఆరోజు సినిమా హాల్లో నిన్ను చూసినప్పటి నుంచీ నా గుండెల్లో మంటగా వుంది."

నేను మాట్లాడలేదు.

ఏం మాట్లాడాలో, ఎలా సమాధానం చెప్పాలో నాకు తోచలేదు.

గోపాలం ఏదో అనటానికి నోరు తెరిచి మళ్ళీ మానేసాడు.

నేను మళ్ళీ కిటికీలోనుంచి బైటకు చూడసాగాను.

అరగంట క్రితం నాలో కలిగిన వుల్లాసం నామరూపాలు లేకుండా పోయింది. గుండెలమీద పెద్ద బరువు మోస్తున్నట్టు భారంగా అనిపించింది.

'నేను వెళ్తాను. యిక్కడెక్కడైనా టాక్సీ దొరుకుతుందా ?' అంది.

టాక్సీకోసం నేను వెళ్ళబోతుంటే గోపాలం, 'ఆగు. నువ్వుండు నేను వెళ్ళి తీసుకువస్తాను.' అని వెళ్ళి పోయాడు.

సీత బాబుకీ పాపకీ వంట యింట్లో అన్నం పెడుతోంది. గోపాలం వెళ్ళాడు.

శాంతి, నేను ముఖాముఖీ నిలబడ్డాం.

ఎందుకోగానీ, శాంతివైపు చూడటానికి నాకు మనస్కరించలేదు.

శాంతి మాట్లాడుతుందని నేను, నేను మాట్లాడుతానని శాంతి ఎదురు చూడటంతో ఐదు నిముషాలు గడిచి పోయాయి.

శాంత వున్నట్టుంది అంది.

'నువ్వు రాయివి! ఏం మారలేదు! నీ అహంకారం, నీ పొగరు పీసమెత్తు కూడా తగ్గలేదని యిప్పుడు తెలుస్తోంది.

అన్యాయమైన యీ ఆరోపణలని నిశ్శబ్దంగా భరించి వూరుకున్నాను.

ఇంతలో టాక్సీ వచ్చి ఆగింది.

శాంతి నాతో వెళ్తున్నానని నా చెప్పలేదు.

గిరుక్కున వెనక్కి తిరిగి వంట యింటివైపు వెళ్ళి సీతతో ఎంతో మర్యాద వుట్టిపడుతున్న స్వరంతో, చిరునవ్వుతో, 'మీరు మా యింటికి తప్పక రావాలి. నేను వెళ్తాను, అని చెప్పి, వెళ్ళింది.

గోపాలం, సీత బైట టాక్సీ వరకూ వెళ్ళి సాగనంపారు,

శాంత టాక్సీలో కూర్చుని తలుపు వేసేసుకునే ముందు ఏదో అనటం, గోపాలం వంగి శ్రద్ధగా విని, తల వూపటం కిటికీలోనుంచి నాకు కనిపించింది.

కానీ వాళ్ళు అనుకున్నదేదో స్పష్టంగా తెలియలేదు.

టాక్సీ వెళ్ళిపోయింది.

సీత, గోపాలం లోపలకు వచ్చారు.

సీత పిల్లలకి ఏం కావాలో చూడటానికి వంట యింట్లోకి వెళ్ళింది.

గోపాలం సరాసరి నాదగ్గిరకి వచ్చాడు.

వస్తూనే, రవీ! నువ్వింత మూర్ఖుడవని, యింత బుద్ధిలేనివాడివి అని నేను కలలో కూడా అనుకోలేదు సుమా?' అన్నాడు కోపంగా.

'యిప్పుడేమైంది?' తాపీగా అడిగాను.

'ఏమైందా! ఆ అమ్మాయి అంత అభిమానంగా, నిన్ను యింత వెతుక్కుంటూ వస్తే-నువ్వు మాట్లాడే తీరు అదేనా?'

'నేను చేయాల్సిన మర్యాదలేవో నువ్వూ, సీతా చేసారుగా.'

"అంతేనన్నమాట! ఇదుగో అబ్బాయి చెబుతున్నాను. ఈ విషయంలో మాత్రం నీ ధోరణి నాకేం నచ్చలేదు."

"సారీ గోపాలం!"

"నాక్కాదోయ్ క్షమార్పణ చెప్పుకోవాల్సింది ఆ అమ్మాయికి. ఇంతకీ ఏమిటి? ఎక్కడో వుద్యోగం దొరికిందంటున్నావు."

"జ్వాలాముఖి ఆఫీసుకెళ్లాను. ఎడిటర్‌ని కలుసుకున్నాను."

"నాన్సెన్స్. అదంతా మర్చిపో. ఆ పత్రిక గురించి నేను వాకబు చేసాను. అంతా అప్పుల్లో వుందిట. ఈ అమ్మాయి చెప్పింది బంగారం లాటి వుద్యోగం. తక్షణం వెళ్లి వాళ్ల వాళ్లని కలుసుకో."

"నావల్ల కాదు."

"నీవల్ల కాదూ? ఎందుకని?"

"నీకు తెలియదు గోపాలం. నేను చెప్పలేను కూడా." ఆ క్షణంలో మనసువిప్పి, నాకు, శాంతికీ మధ్య జరిగిన గ్రంథం గురించి గోపాలానికి చెప్పేసేవాడినేమో!

కానీ సీత యింతలో బాబుని తీసుకుని అక్కడ పడుకోబెట్టుకోటానికి రావడంతో, నా నాలిక దాట బోతున్న మాటలు నోట్లోనే ఆగిపోయాయి.

"నిన్ను ఆ వుద్యోగానికి వప్పించే బాధ్యత నాది అని ఆ అమ్మాయికి వాగ్దానం చేసాను." సీరియస్‌గా అన్నాడు గోపాలం, నా సమాధానం అవసరం లేనివాడిలా సీతవైపు తిరిగి" సీతా! రవి యీపూట యిక్కడే భోంచేస్తాడు. త్వరగా వడ్డించు మళ్లీ ఆట మొదలయ్యే వేళయింది. నేను వెళ్లాలి." అన్నాడు.

సీత తల వూపి వంట యింటిలోకి వెళ్ళింది.

గోపాలానికి, సీతకి జ్వాలాముఖి ఎడిటర్ గురించి, ఆయన భార్య గురించి నేను చెప్పాలనుకున్నది చెప్పలేకపోయాను. హఠాత్తుగా శాంతి వచ్చి కాస్త తేరుకొంటున్న నా మనస్సరోవరంలో యిలా రాయి విసిరి వెళ్ళడంతో, అంతా అల్లకల్లోలం అయినట్టు అయింది.

ఆ ఆలోచనల అలల తాకిడి తగ్గటానికి కొంత వ్యవధి కావాలనిపించింది.

(సశేషం)

వేయి
గులాబీల
సారం...

# బంటీ గోద్రెజ్ నం.1లో చేయబడింది

గోద్రెజ్ నం. 1 యొక్క— మృదు పధురమైన గులాబీ పరిమళం. స్నానంచేసిన తరువాత, చాలా సేపు మీ వెనువెంట తారాడుతూ ఉంటుంది. మీ గడ వంటి దాని పుష్కలమైన నురుగు మీ చర్మాన్ని లాలిస్తుంది: దానిని అధిక సౌందర్యవంతం చేస్తుంది.




గోద్రెజ్ నం.1 విస్తారమైన
మన్నిక గల సౌందర్యపు సబ్బు.

Inter Pub. G. S No. 1/1A




శ్రీదేవికి పెళ్ళని తెలిసి చాలా ఆనందించిన మాట వాస్తవమే కాని ఆమెకు కాబోయే భర్త ఒక ఉపాధ్యాయుడు. అంటే కేవలం ఒక బడి పంతులు మాత్రమే అని తెలిసేసరికి నిజంగానే క్రుంగిపోయాను. నాలో అంతర్గతంగా, నాకుతెలియకుండానే, ఆమెపై ఒకచిన్నసైజుసింపతీ

లాంటిది, ఇదివరలో నే నామెపై చూపించే జాలివంటి దానికి సమానమైనదేదో బయల్దేరింది. అనక ఆ సింపతీ కాస్తా ఒక విధమైన అసూయగా మారిపోయింది।

అసలు శ్రీదేవి ఆ యింట్లో పుట్టవలసిందికాదు; కాని ఆమె దౌర్భాగ్య వశాత్తూ పుట్టింది. టు బి ప్రాక్టికల్, దేముడనేవాడే నిజంగా ఉండి ఉన్నట్టయితే వాడు చేసే వెధవపనుల్లో మొదటిది శ్రీదేవిని రామ్మూర్తి మాష్టారింట్లో మూడో కుమార్తెగా పుట్టించడం. ఒకటవగాని రెండవగాని కుమార్తెగా పుట్టి ఉన్నట్టయితే ఆమె అదృష్టశాలియా అనేది వేరే విషయం. కుమార్తెలలో మూడవదే అయినా, ఆయనగారి సంతానపు వరుసక్రమంలో ఆమె అయిదవదీ, ఆఖరుదీను। మొదటి ఇద్దరు ఆడపిల్లలు, ఆ తర్వాత ఇద్దరు మగపిల్లలు ఆఖరున శ్రీదేవి ఆయన సంతానం. సహజంగా మొదటి సంతానాన్నీ ఆఖరు సంతానాన్నీ చాలా గారాబంగా పెంచటానికి ప్రయత్నిస్తారు తల్లిదండ్రులు. మొదటి 'ఇష్యూ' నాటికి ఆర్థికంగా, శారీరకంగా, మానసికంగా అన్నివిధాలా బాగుంటారు కనుక అనుకున్నవన్నీ అనుకున్నట్టే చేయగలరు. ఆఖరు సంతానం నాటికి ఆ తల్లిదండ్రులు అన్ని విధాలా సడలిపోవటంతో ఏమీ చేయలేరు, కోర్కెలున్నా కూడా. గారాబం, ప్రేమ వగైరాలు మాటలలో చూపగలరే తప్పించి వేరు విధంగా చూపించలేరు. ఇది రామ్మూర్తి మాష్టారిలాంటి వారింట్లో సర్వసామాన్యమైనదే. కారణం ఆయనొక జనతా క్లాసు కంపార్టుమెంట్‌వంటి సంసారం నడిపిస్తున్నవాడు కావటం। పైగా ఆయన ఇద్దరు కొడుకులు ప్రకాశం మధుమూర్తులు అప్రయోజకు లవ్వటం, ఐమీన్, పెద్దగా ప్రయోజకులు కాలేకపోవటం శ్రీదేవి దురదృష్టపు జాతకానికి మరో అదనపు అర్హత।

నేను బి. ఏ. ఆఖరు సంవత్సరం చదివే రోజుల్లో అనుకుంటాను. ఒక రోజున శాస్త్రి చాలా అర్జంటుగా పరుగెట్టుకొచ్చాడు నా రూమ్‌కి. అతను నా క్లాస్‌మేట్. అన్నింట్లోను నాకు శిష్యపరమాణువు. అత్యంత భక్తి శ్రద్ధలు, వినయ విధేయతలు గలిగిన ఒక అమాయకపు పక్షి. అలాగని అతనేమీ స్వతంత్ర వ్యక్తిత్వం స్వంత భావాలూ లేనివాడనికాదు. సరిగా చెప్పాలంటే ఏ పాత్రలో పోస్తే ఆ పాత్ర ఆకారం దాల్చే ద్రవపదార్థం వంటి స్వభావం నాదైతే, దానికిపక్కా వ్యతిరేకమైన వ్యక్తిత్వం అతనిది. ఏదైనా నిక్కచ్చిగా, నిర్భయంగా చెప్పే స్వభావం అతనిది. కాని నేనంటే మొదట్నుంచీ అదోవిధమైన గురు భావాన్ని పెంచుకున్నాడు. ఎంత వ్యక్తిత్వం ఉన్నా కాని నన్ను సలహా అడగనిదే ఏ పనీ చెయ్యడు.

అతను హాస్టల్లోనే ఉంటుండేవాడు.

నేను బయట ఒక రూమ్‌లో ఉంటూండేవాణ్ని. నాకు హాస్టల్లో ఎకామిడేషన్ దొరకలేదు. శాస్త్రి కూడా డేస్కాలర్‌గానే ఉండి నా రూమ్‌లో ఉండిపోవాలనుకున్నాడు. కాని ఈ సంగతి తెలిసి, వాడిమీదే అన్ని ఆశలూ పెట్టుకుని (తనకూతురు నిచ్చి పెళ్ళి చేయటానికి) కంటికి రెప్పలాగా వాడిని, వాడి చదువునీ కాపాడుతున్న వాడి మామ మాత్రం డొక్కచించి డోలుకడ్తా నన్నాడు. 'బడుద్దాయ్. నోర్మూసుకుని హాస్టల్లో పడుండు. వెధవ్వేషా లేశావంటే మాత్రం వీపు రెండుగా చీల్చేస్తాను జాగ్రత్త" అన్నాడాయన. ఐనా కార్యశూరుడు గనుక పట్టిన పట్టును మధ్యలో విడిచే అలవాయితీ లేని వాడు గనుక శాస్త్రి ఓ మంచి ముహూర్తం చూచుకుని వాళ్ళ మామ య్యను మళ్ళీ అడిగాడు, 'మామయ్యా నాకు హాస్టల్లో బోర్ కొట్టేస్తుంది, మీ ఇంటి కొచ్చేస్తాను ..." అని.

ఈసారి ఆయనేమీ మాట్లాడలేదు. కానీ ఎర్రగా చూచారు. అంతే.

"అదికాదు మామయ్యా మిగిలిన కుర్రాళ్ళు నన్ను సరిగ్గా చదువుకో నియ్యటంలేదు...." అంటూ నీళ్ళు నమిలాడు.

"మీ హాస్టల్ క్రమశిక్షణ గురించి నాకు బాగా తెల్సుగాని నువ్వేం నాటకా లెయ్యకు. మీ ప్రిన్సిపాల్ తోటీ, మీ వార్డెన్‌తోటి సాయంకాలం క్లబ్బులో నేను చెప్తానులే, నిన్ను జాగ్రత్తగా ఒక కంట కనిపెట్టమని" అంటూ హడావుడిగా ఆయన కోర్టు కెళ్ళిపోయారు.

ఆయన పేరు సీతారామయ్యగారు. ఆయనదేవూళ్ళో మున్సిఫ్ మేజి స్ట్రేట్‌గా పనిచేస్తున్నారు. పొరుగు పల్లెనుంచి ఆ వూరు పై చదువుల నిమిత్తం వచ్చిన మేనల్లుడిని ఆయన మొదట తన యింట్లోనే ఉంచాలను కొన్నారు. కాని మనవాడు తన కాబోయే భార్యతో, అంటే సీతా రామయ్యగారి కుమార్తె శారదతో, ఎటువంటి చనువు తీసుకుంటాడో, చదువు ఎలా వెలగబెడ్తాడో అనే భయంతో వాడిని హాస్టల్లోనే ఉంచి తగిన కట్టుదిట్టాలు ఏర్పాటు చేశా రాయన తన మిత్రుడైన కాలేజి ప్రిన్సి పాల్‌తో చెప్పి. అలాగని టూమచ్ కట్టుదిట్టాలు పెట్టి బొత్తిగా పుస్తక

---

● తాజమహలు చూచిన ఒక విదేశీయుడు ఇంత గొప్ప కట్టడాన్ని నిర్మించడానికి ఇండియాకి ఎవరు సహాయం (ఋణం) చేశారో నని సందేహం వెలిబుచ్చారు.

పురుగును చేస్తే ఒక బుద్ధావతారం మాదిరి తయారవుతాడనీ, ప్రేయసీ ప్రియులు కాకపోయినా, కాబో యే భార్యాభర్తల్ని ఒక ఫూర్లో వుంచి కఠినమైన నియమాల్తో ఎడబాటు కల్పిస్తే చదువుమాట దేము డెరుగు మొదట మనస్సులు ఆ తర్వాత జీవితాలూ పాడుచేసుకుంటారనే మానసిక శాస్త్ర సంబంధమైన సగ్నసత్యాన్ని గ్రహించక పోలేదాయన. అందుకనే అప్పుడప్పుడు ఆదివారాలువంటి పవిత్ర దినాలలో మనశాస్త్రీ హ యా ని కి కళ్ళాలు విడిచిపెట్టి శారదా సన్నిధానానికి రానిస్తా రాయన. శాస్త్రిని ఎలెల్బీ చేయించి పెద్ద ఏడ్వకేట్ నిచేసి తన వారసత్వాన్నీ, సర్వస్వాన్ని అంటే ఆస్తినీ, ఏకైక పుత్రికా రత్నాన్నీ అతని కర్పణచేసి తన జీవిత చరమాంకంలో విశ్రాంతి తీసుకోవాలనే సత్సంకల్పం ఆయనది. మనవాడికి ఆస్తిలేదనే బెంగలేదాయనకు. ధనవంతుడు కాదే కూతుర్నెలా ఇచ్చి పెళ్ళి చేయటం అనే చింతలేదాయనకు. నదులలోని నీరూ సముద్రంలోనే కలసి, సముద్రంలోని నీరూ సముద్రంలోనే ఉంటే ఇంక నీరులేని ప్రదేశాల గతేమిటనే వాస్తవికవాది ఆయన। అందుకనేవాడు, "నాకీ బోడి బియ్యే వద్దు బాబోయ్" అంటున్నా విన్పించుకోకుండా 'నో ర్నా య్య రా కుంకా, నీకేం తెల్సు' అంటూనే ఆయన తన మేనల్లుడిచేత కళాబ్రహ్మ చర్యవ్రతం పట్టించేశారు। తద్వారా వాడు నాకు సహపాఠి అంటే 'క్లాస్ మేట్' అయ్యాడు. నాకు కూడా మొదట్లో పెద్దగా ఆశయాలేమీ లేక పోయినా (అఫ్‌కోర్స్ ఆనక పెద్ద ఆశయం ఏర్పడిందనుకోండి) బియ్యే అంటే ఏమిటో ఒక విధమైన ఫ్యాన్సీ ఏర్పడి అందులో చేరాను. ఆ విధంగా వాడికి నేను సహపాఠి నయ్యాను. మేజిస్ట్రేట్‌గారి దండచండ శాసనం వల్లనై తేనేమి, నాకు హాస్టల్లో ఎకామిడేషన్ దొరక్కపోవడం వల్లనై తేనేమి మే మిద్దరం లాడ్జ్‌మేట్స్‌మ్ మాత్రం కాలేకబోయాం. ఆనక నా యోగ్యతా యోగ్యతలను జాగ్రత్తగా క్షుణ్ణంగా పరిశీలించిన పిమ్మట తన మేనల్లుణ్ని నాతో స్నేహం మాత్రం చేయటానికి అంగీకరించేరు మేజిస్ట్రేట్‌గారు. వారి యిల్లు, నే నుంటూన్న రూమ్ తాలూకు యిల్లు ఒకే వీధిలో ఉన్నాయి. అందు చేత మేనమామగారింటి కెప్పుడొచ్చినా నా రూమ్‌కొచ్చి తనా రోజు శారదతో ఎలా గడిపిందీ. తా మిద్దరూ కలసి భవిష్యత్‌ను ఎలా బంగారు కలలా రూపొందించుకో వలసిందీ ఆలోచించిన విధానాలూ నాతో చెప్తూ నా సలహాలను తీ సు కొం టూ నాకు బైమ్‌పాస్ యిస్తుండేవాడు.

తన చుట్టూ ఒక బ్రహ్మాండమైన వల ఉన్నదని ఇతరు లెవ్వరికి తెలియకుండా, అత్యంత దుర్భేద్యమైన దుర్గం లాంటి ఒక క్రమశిక్షణలో పెరుగు

తూన్న శాస్త్రి ఇతర ఆడపిల్లలవంక కన్నెత్తి చూచే అర్హత, పన్నెత్తి మాట్లాడే అర్హత (కనీసం పెదవివిప్పి విమర్శించే అవకాశం) ఏనాడో, అంటే ఎప్పుడో పదిహేను సంవత్సరాలక్రితం సీతారామయ్యగారింట్లో శారద అనబడే ఒక ఆడకూతురు పుట్టిననాడే, కోల్పోయాడనే నగ్నసత్యం వాడికీ తెల్సు నాకూ తెల్సును. అటువంటివాడు ఆ రోజున, పైగా ఆ రోజు ఏదో వర్కింగ్ డే కూడాను, లాస్టు అవర్ లేదని ముందేవచ్చి రూమ్‌లో కూర్చొని చదువుకొంటుంటే హడావుడిగా యమార్జంటుగా పరుగేట్టుకుని వచ్చేసి 'అత్యంత ముఖ్య విషయం విడుదల చేయాలి' అంటూ నాకా వార్త చెప్పేటప్పటికి నిండా ఆశ్చర్యపోయాను. వాడి బదులుగా నేను భయపడిపోయి రెండు గ్లాసుల మంచినీళ్ళు త్రాగేశాను గడగడా.

"ఒరే, శాస్త్రీ నువ్వు ఆ అమ్మాయి వైపు చూచినట్లు తెల్సిందంటే శారద ని ముఖంమీద ఉమ్మేస్తుంది. ఆమె మాట ఎలాగున్నా మీ మామకు తెల్సిందంటే ముందర నన్నూ ఆ వెనక నిన్నూ పచ్చడి చేస్తారు" అన్నాను మందలింపు ధోరణిలో. బుంగమూతి పెట్టాడు వాడు. ఆ పోజులో వాణ్ని చూస్తే జాలే వేసింది.

"ఒరే శర్మా, ఒక్కటడుగుతాను చెప్తావా?"

"యస్!"

"ఈ దేశంలో, అత్యంత పవిత్ర మని శ్లాఘించబడే ఈ పుణ్యభూమిలో ఎంతమంది పెళ్ళయిన మగాళ్ళు వేరొక స్త్రీతో స్నేహం చేయాలని తాపత్రయ పడటం లేదో చెప్పు చిట్టీ!"

అబ్బా, చాలా గట్టి సమస్యే తెచ్చి పెట్టాడు. విషయం మారుస్తే కాని లాభంలేదు. అందుకని "సర్లె పెళ్ళయిన వాళ్ళ సంగతి వదిలిపెట్టి నీ సంగతీ మీ మావ సంగతీ మాట్లాడు" అన్నాను.

"యూ, రాస్కెల్, నే నడిగిన దానికి సమాధానం చెప్పరా అంటూంటే!"

"నీ కా అనుమానం ఎందు కొచ్చింది?"

"పోనీ స్నేహంకోసం తాపత్రయం అలా వుంచు. అందమైన ఒక అమ్మాయి. పోనీ అందంగా కూడా లేదనుకుందాం, అలా వెళ్తుంటే; ఏదో సర్కస్ కంపెనీలోకి ఒక వింత జంతువు వెళ్ళినప్పుడు ఎగబడిచూస్తూ, వీలైతే రాళ్ళు విసరే చిన్నపిల్లల్లాగ, ఎంతమంది మగరాయుళ్ళు ఇర్రెస్పెక్టివ్ ఆఫ్ మారీడ్ అన్డ్ అన్మారీడ్, ఆమె వైపు వెర్రిగా చూస్తూ, వీలైతే విమర్శలు విసుర్తూ, పళ్ళికిలించటం లేదు!?"

"ఏం, నీ కీ రోజా ఇలాంటి పిచ్చి పట్టింది?"

"నే నడిగిందానికి సమాధానం







చెప్పరా ఫూల్!"

"అన్‌ఫార్చునేట్లీ మన కింకా పూర్తిగా నాగరికత అలవడలేదు. స్త్రీ కూడా మనలాగే, మనలోనే ఒక మనిషనీ. ఆమెకూ మనకూ వ్యక్తిత్వంలోగానీ, మరే విధంగాగానీ తేడా లేదనీ, ఆమేమీ వింత జంతువుకాదనీ ఆమె ఒంటరిగా రోడ్డుమీద వెళ్తుంటే కుతూహలమైన కళ్ళతో, దురాలోచన చేసే మనస్సుతో అలా ఆమెవైపు చూడక్కర్లేదనీ, 'రియలైజ్' చేసే స్థాయికి మన 'కల్చర్' ఇంకా ఎదగలేదు బ్రదర్!" నిట్టూర్చాను.

"వెధవ కవిత్వం చెప్పకు."

"ఇది పచ్చి నిజం!"

"నువ్వు చెప్పినది బొమ్మ మాత్రమే. దీనికి బొరుసు కూడా వుంది!"

"ఏమో, నాకేం అర్థం కావటం లేదు."

"ఐతే చెప్పమంటావా?"

"చంపేస్తాను. వెధవ సస్పెన్సు నువ్వూను. త్వరగా చెప్పు!"

"శ్రీదేవి అందమైనది. ఆమె సౌందర్యలహరి."

"ఐతే?"

"భగవంతుని సృష్టిలో అత్యంత అపురూపమైనది స్త్రీ. తన లీజర్

సైమ్ నంతటినీ ఒకచోట 'కాన్సన్ ట్రేట్'చేసి ఒక మహాద్భుతమైన సృష్టిచేసి దానికి స్త్రీ అని పేరుపెట్టి భూలోకంలో విడచి పెట్టాడా విధాత. ఆ అందాన్ని అనుభవించడానికి సృష్టిం చాడు మగవాణ్ని!"

"పిచ్చి కుదిరింది, తలకు రోకలి చుట్టమన్నాడట వెనకటికి నీ లాంటి రోగ్ ఒకడు!"

"అనరా అను! నేను నీకు అలానే కన్పిస్తానిప్పుడు. కాని ఆ నక ఆ శ్రీదేవిని చూచావంటే మాత్రం ఆమె వెనకాల బాడీగార్డులాగ ఆమె ఇంటివరకూ వెళ్ళి వెర్రిమొహం వేలా దేస్తావ్. బ్రదర్ నీలాంటి వాళ్ళందరూ వట్టి ఫూల్స్రా. అందుకనే మీలోకంలో మీరు బ్రతుకుతున్నారు. ఆశయం! ఆశయం అంటూ దుర్భేద్యమైన కోటను నిర్మించుకొని అందులో జీవచ్ఛవాల్లాగా బ్రతుకులు వెళ్ళదీస్తున్నారు. బయటి ప్రపంచం ఏమిటో తెలియదు మీకు. ఒరేయ్, ఒక్కసారి, ఒక్కసారి కళ్ళు తెరచి బయటకు చూడరా. ఎంతో సౌందర్య ముందిరా ఇక్కడ. ఇవతలకు రారా, ఎన్నో సుందర సీమలను చూపిస్తాను. చవి చూచి స్వంతం చేసుకుని అనుభవించరా!....ప్చ్....నా కా యోగ్యత లేదురా. నా కా అవకాశం లేదురా, అయామ్ అన్ఫార్చునేట్రా. కాని, రేయ్, యూ కల్చర్డ్ ఇడియట్! పోయింది కదూని, మరో అమ్మాయి అందాన్ని ప్రశంసించే అర్హత లేదను కొనే నీ లాంటి వాళ్ళ 'సోకాల్డ్ కల్చర్'ని గురించి ఏ విధంగా అర్థం చేసుకోవాలో ఊహించలేకుండా ఉన్నానురా శర్మా: నువ్వూహించే దుశ్చింతలేమీ లేవురా నాలో....!"

అనుమానంగా చూచాను వాడివైపు. వాడి గురించి, వాడి సచ్ఛీలత గురించీ నాకు క్షుణ్ణంగా తెలుసు. ఐనాఏమిటో ఒక్కొక్క పాడు క్షణంలో ఈ దౌర్బల్యం.

"...ప్లీజ్, నన్నర్థం చేసుకోరా. వసంతకాలంలో లేత మామిడి చిగుళ్ళనుమేసి వసంతరాగం పలికే గండు కోయిల కంఠం విన్నా. శిశిరంలో నగ్నమైన తమ శరీరాలను వసంతాగమనంతో లేచివుళ్ళనే రంగురంగుల పత్రాల వస్త్రాలతో అలంకరించుకొనే తరుతతినికన్నా. శరచ్చంద్రుని చల్లదనంలోని హాయిని అనుభవించినా. కాశ్మీర్ లోయలనూ, కేరళ కొబ్బరి తోటలను, రామేశ్వరం ఇసుక దిబ్బ



జ్యోతి

లను, అందమైన ఆడదాన్ని చూచినా ఎంతటి పాషాణ హృదయుడికైనా హృదయం పులకరించక మానదు. పైగా శ్రీదేవి అందానికి ఎంతటి వాడైనా దాసానుదాసుడు కావలసినదే. అందునా నేను సామాన్య మానవుడినిరా బ్రదర్ !"

"రేయ్, రేయ్—నీకు శారద అనే ఒకమ్మాయి కాబోయే "

" భార్యరా ! భార్య ! ఆసంగతి నాకూ తెల్సును. అందుకే ఈ ఏడు పంతాను. నా కెలాగూ శ్రీదేవిని వివాహం చేసుకునే అవకాశంలేదు, యోగ్యతాలేదు. కనీసం నా మిత్రుడవైన నువ్వైనా ఆమెను వివాహం చేసుకుంటే చూచి ఆనందించాలని ఇందాకట్నుంచీ ఊ ఇదై పోతున్నాను. అసలా బంగారబొమ్మకి నవమన్మధాకారుడవైన నువ్వే సరియైన ఈడూజోడీని. ఏరా నా మాట లేమైనా వింటున్నావా?"

"ఒరే నా ఆశయం వేరే ఉందని నీకు తెల్సునుకదా."

"అర్థంలేని ఆశయంతో జీవితంలో ఒక మధుభాండాన్ని కాలదన్నుతున్నావ్. నేనే నీ పొజిషన్‌లో ఉంటేనా "

"అదేరా శాస్త్రి సృష్టి విచిత్రం. అవకాశంఉన్నవాడికి ఆదర్శాలుండవు. సరే. పూల్‌లాగ కబుర్లు చెప్పక పోయి చదువుకో. మన చదువులయిపోయిన తర్వాత మనం జీవితంతో స్థిరపడిన తర్వాత శ్రీదేవిని గురించి, నీ దేవిని గురించి తీరిగ్గా ఆలోచిద్దాంలే. అంత వరకూ మనం మనమే. ప్రస్తుతానికి మనం భారత భావి నిర్మాతలం. మన ఆశయం బాధ్యత విస్మరించక పోవటం.పో. బి ఎ గుడ్ సిటిజన్ "

"అప్పటికి శ్రీదేవి వేరొకరి దేవి కావచ్చు !"

"పో నీ లే ఇప్పుడొచ్చిన నష్టమేముంది కనుక, పైగా నేనింకా ఆ అమ్మాయి ఎలాగుంటుందో చూడనైనాలేదు. ఆమె గురించి ఇప్పట్నుంచీ మనస్సు పాడు చేసుకోవట మెందుకు?"

ఆనాడు అలాఅన్నానేగని, ఈనాడు శాస్త్రి వద్దనుంచి ఈ ఉత్తరం రాగానే నిజంగానే ఆమె గురించిన ఆలోచనలతో నా కు మనస్సంతా పాడైపోయింది. ఒకానొక మహాద్భుత సౌందర్యరాశి ఏ స్థానంలో పడకూడదో ఆ స్థానంలో పడుతోంది; సానపెట్టబడిన వజ్రం, కిరీటాన్నలంకరించి కిరీటానికి, తనకూ సార్థకత తేవలసినదిపోయి, తిన్నగా బురదలోకి పోతోంది. మరి ఆమె పరిస్థితులు అలాంటివి. ఆమెకు కలుగబోయే కష్టాన్ని ఊహించుకొంటే గుండె ఝల్లుమంటోంది. అంతేకాదు. ఎవరో నన్ను అపహాస్యం చేస్తున్నట్లనిపించింది కూడాను .."మీరంతా ఎద్యు

సౌందర్యము మరియు తాజాదనపు భావన...సింథాల్ సబ్బుతో






మీ కోసము...అపూర్వమైన సౌందర్యము,
రోజంతా తాజాదనము...
రెండు విధములుగా పనిచేసే సింథాల్ సబ్బుతో
సింథాల్ లో ప్రపంచములో
కెల్ల ఎంతో బాగుగా పనిచేసే క్రిమినాశిని జి-11
(హెక్సాక్లోరోఫీన్) ఉంది.
జి-11 గల సింథాల్ మాత్రమే
మిమ్మల్ని అందముగా
తాజాగా ఉంచగలదు

**సింథాల్ నిజంగా దుర్గంధ నివారిణి సబ్బు**

**Interpub/ GS/20A TL**

కేచెడ్ ఫూల్స్‌రా. జీవితం సెటిల్ కావాలి అంటూ బ్రతుకుల్ని అమ్ముకున్న దర్టీ క్రీచర్స్ మీరు. ఏదైనా ఒక మంచి పని చేయటానికి ముందుకు వచ్చే ధైర్యం, స్వతంత్రంగా ఆలోచించే మనసూ లేవర్రా మీకు యువకులూ! మీ కెంతసేపూ లైఫ్ కావాలి. థ్రిల్ కావాలి. డబ్బు కావాలి. హోదా కావాలి. కార్లూ, మేడలూ కావాలి. సొసైటీ లైఫ్ కావాలి! అంతే! జీవితాన్ని జీవితంగా, మనిషిని మనిషిగా చూచే మనస్సు, అందాన్ని అందంగా బ్రతుకనిచ్చే హృదయం అఖ్ఖర్లేదురా మీకు!" చాలు. ఇంక చాలు.

ఛ! నన్ను తల్చుకుంటే నాకే అసహ్యం వేసింది. బియ్యేలో క్లాసొచ్చింది. పెద్ద ఆశయం పెట్టుకున్నాను. కొంతవరకు విజయం సాధించాను. యమ్మేలో చేరాలి. వెనకాల బోలెడు ఆస్థి. ఒక్కణ్ణే కొడుకుని కావటం మూలాన కా అంటే కా, కి అంటే కీ'గా అన్నీ అమర్చే తల్లి దండ్రులు, లక్ష్మీకటాక్షం, సరస్వతీ కటాక్షం కూడా ప్రసన్న మయాయి అంటూ ఆవేశంతో ఆనందంతో హృదయాన్ని మనస్సునీ రంజింపచేసే పరిసరాలూ, ప్రజలూ! వహ్వా! యమ్మేలో జేరాను. జీవితాన్ని హాయిగా అందంగా అనుభవించాను. యమ్మేలో క్లాసొచ్చింది. ఐనా సరిపోలేదు, నా ఆకలి తీరలేదు. నా దృక్పథం హోదావైపు మళ్ళింది. కీర్తి కాంక్షవైపు తిరిగింది. సొసైటీ లైఫ్‌పైన ఆశ చిగురించింది

కాంపెటిషన్ పరీక్షలకు వెళ్ళాను సెలక్షనొచ్చింది. ఈనాడు ముస్సోరీలో అయ్యేయస్ ట్రయినింగవుతున్నాను, లక్ష్మీకటాక్షమేగాని సరస్వతీ కటాక్షం లేదని ఒకానొకప్పుడు పరిహసించేవారు హైస్కూలు రోజుల్లో నా సహచరులూ ఉపాధ్యాయులూను. ఆనాడే మనస్సులో చిన్నం బీజం బయల్దేరింది. కాని అప్పట్లో దానికొక రూపంలేదు. బియ్యేలో చేరిన తర్వాత సంవత్సరానికొక రూపం యేర్పడింది దానికి. దాని ఫలితమే ఎమ్మే ఫస్టుక్లాస్! యూనివర్సిటీ ఫస్టు! నా ఆశయం తీరింది! ఆ తర్వాత అయ్యేయస్! ఒరేయ్ చిన్నప్పుడు నన్ను పరిహసించిన కుర్రకుంకలూ రండిరా. నన్ను చూడండిరా. బాగా ఎత్తుకు ఎదిగిపోయాన్రా. మీరెవరూ నన్నీనాడు అందుకోలేరు. ఈ బంగారు భవిష్యత్తును కష్టపడి నిర్మించుకున్నాన్రా నా చేతులతో!

కాని కాని.. ఇంత గర్వంతోనూ, ఇంత సెల్ఫ్‌కాన్ఫిడెన్స్‌తోనూ ఎంతో ఎత్తుకు ఎదిగిపోయాననుకుంటూన్న నన్ను క్రుంగదీసింది శాస్త్రి ఉత్తరం. అది నన్ను పరిహసిస్తోంది.

"బ్రదర్, ఆనాడే నా సలహాను పాటించి నువ్వా అందాల రాశిని వివా

హం చేసుకునుంటే ఆమె కీనాడీ దుర వస్థ పట్టేదా, ఆలోచించు? ఆమెను పువ్వుల్లో పెట్టి పూజించే వాడివికదా! ఆ అద్భుత సౌందర్య తేజోమూర్తి ఒక స్కూలు టీచర్ బ్రతుకు బాటలో పడి నలిగిపోతుందనే ఊహే చాలా హింసాత్మకంగా లేదూ? నువ్వేమో లైఫ్‌లో సెటిల్‌మెంట్ కోసం పూర్తిగా అమ్ముడు పోయావప్పట్లో. ఈనాడు లైఫ్‌లో ఎంతో ఎత్తుకు ఎదిగావ్. కంగ్రాట్స్! కాని ఎవరి కోసం ఎదిగావ్? జీవితంలో ఈ రోజుకాకపోతే రేపైనా సెటిల్ కావటం అనేది ఖాయం. దానికోసం ఊ తెగ కంగారు పడిపోయి ఇప్పుడెంత నష్టపోయావో ఆలోచించుకో!" అంటూ ఏదేదో వ్రాశాడు.

నేను నష్టపోయాను-అనే ఆలోచన కన్నా మరో ఆలోచనే నన్ను ఎక్కువగా బాధిస్తోంది, శాస్త్రి వ్రాసినది నిజమేనేమో ననిపిస్తుంది అప్పుడప్పుడు. కాని ఒక్కొక్కప్పుడు మాత్రం సిల్లీ అనిపిస్తుంది మరి. ప్రేమన్నా, సౌందర్యమన్నా, అన్వేషణన్నా నాకేం మహా ఘట్టి అభిప్రాయాలేమీ లేవు. అలాగని తేలికభావమూ లేదు. అసలవన్నీ అర్థం, సార్థకం లేని పదాలు. అవన్నీ రచయితలకు పనికివచ్చే మంచి కథావస్తువులు మాత్రమే. నా ధ్యేయం వేరు. నా ఆశయం ఎంతసేపు ఇండస్ట్రీ. ప్రతీ వ్యక్తి తనకు తాను "పుష్" ఇచ్చుకుంటూ తోటివారికి "పుష్" ఇస్తూ డైనమిక్‌గా ముందుకు పోవాలి. ఇది నిరంతర ప్రయాణం. దానికి గమ్యం గాని "స్టాప్" గాని లేవు. సాధ్యమైనంతవరకూ కష్టపడాలి. శరీరానికి "ఐడిల్‌నెస్" ని అలవాటు చేయకూడదు. దేహాన్ని ఉద్ధరించటానికి

---

● కొట్టలఒట్టు యజమాని:—కొత్తగా వచ్చిన గుడ్డ. చూడండి. ఎంత బాగుందో?

కష్టమర్:—ఇది రెండు మూడు వుతుకులకే కుంగిపోతుంది. మాకు అక్కరలేదు.

యజమాని:—మీరు పొరబడ్డారు.
గుడ్డ కుంచటం అంటూ ఉండదు. కానీ చిరిగిపోతుంది - రెండు వుతుకుల్లో.

ప్రతీ ఒక్కరూ శాయశక్తులా పాటు పడాలి. అందుకని ప్రతీ ఒక్కరూ రాజకీయ నాయకుడే కానవసరంలేదు. ఎవరే వృత్తిలో వున్నా అలసత్వానికి చోటీయకుండా, చిత్తశుద్ధితో కష్టపడి పని చేయాలి. అప్పుడే మన పెద్దలు అత్యంత శ్రమల కోర్చి సంపాదించి మన చేతులలో ఉంచిన ఈ స్వాతంత్ర్యానికీ, ఈ దేశానికీ, ఒక లక్ష్యం. ఒక స్థిరత్వం ఏర్పడుతాయి. అదే నా ఊహ ఎప్పుడూ; అయామె ప్రాక్టికల్ మాన్! ఐడోన్ట్ హావెనీ టైమ్ టు థింకెబౌట్ సమ్ సిల్లీ థింగ్స్ లైక్ లవ్వెండెఫెక్షన్! ఇన్ఫాక్ట్ ఐ డోంట్లైకిట్!

'కాని జీవితంలో మరో విషయం మరచిపోకు' అంటూ నా మనస్సుని గతంలోకి లాక్కు వెళ్ళింది శాస్త్రి ఆలోచన. ఆ రోజున శాస్త్రి నాతో అలా మాట్లాడుతూంటే వీధిలో స్త్రీ కంఠాల కిలా కిలా రావాలు విన్పించాయి.

అదుగో, రారా. బయటకు రారా శర్మా" అంటూ నన్ను రూమ్‌లో నుంచి అరుగుమీదకు లాక్కుపోయాడు శాస్త్రి.

అప్పుడే స్కూలు విడిచిపెట్టినట్లున్నారు. కొందరమ్మాయిలు, నలుగురైదుగురుండ వచ్చును; ఇంటికి తిరిగి వెళ్తూ హుషారుగా ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకుంటున్నారు. మమ్మల్ని చూచి నవ్వులాపేసి మావైపు అదోలా చూసి, వేగంగా పాస్ అయిపోయారు.

ఆ చెలికత్తెలలో ఒక రాజకుమార్తెను చూచి నోరు తెరచుకొని అలా నిల్చుండి పోయాను. ఆశ్చర్యంతో. అఅద్భుత సౌందర్యానికి మూర్ఛపోయాను. కేరళ కొబ్బరితోటలు, కాశ్మీరు లోయలు, వెలమేళ్ల సూర్యకాంతిలోపడి, తెల్లని మంచు కిరీటాలను ధరించి ధగధగా మెరిసిపోయే ఉన్నత హిమాలయ పర్వత పంక్తులూ నా కళ్ళముందు కూడా కనిపించటం మొదలెట్టాయి. శాస్త్రి చెప్పినది నిజం! అప్పుడే అనుకున్నాను ఆమె ఈ లోకంలో, పాపపంకిలమైన ఈ భూలోకంలో పుట్ట కూడదని. అమాటే అన్నాను శాస్త్రితో!

"య్యెస్. యూ ఆర్ పర్ఫెక్ట్లీ కరెక్టు! ముఖ్యంగా ఆమె రామమూర్తి మాష్టారింట్లో మాత్రం పుట్టకుండా ఉండాల్సింది. భగవంతుడు అంత మంచి పనీ చేసి అఖరున ఆ కాస్త వెధవ పనీ చేశాడు. చంటి పిల్లలు అందమైన పిచ్చిగూళ్లు కట్టి ఆఖరున కాళ్ళతో త్రొక్కివేసినట్లు! ఆమె శాపవశాన్న ఈ లోకంలో పుట్టిన గంధర్వకాంత. అరాజకుమార్తె

నేను చెప్తున్న శ్రీదేవి, నేను చెప్పినట్టు ఏంటే కాబోయే నీ దేవి।"

మళ్ళీ ఇంకో గ్లాసు మంచినీళ్ళ కోసం లోపలికి పరుగెత్తాను.

ఆ తర్వాత తర్వాత శ్రీదేవిగురించి "అన్‌వాంటెడ్" గానే చాలా సంగతులు తెలుసుకున్నాను శాస్త్రిద్వారా.

శాస్త్రి మేనమామ అంటే మున్సిఫ్ మేజిస్ట్రేట్‌గారైన సీతారామయ్యగారు నేనుంటున్న వీధికి ఆ చివర నున్న ఒక పెద్ద భవంతిలో ఉంటున్నాడు. ఆ ప్రక్కనే వున్న ఒక పెంకుటింట్లో ఖాళీగా ఉన్న రెండో వాటాలో అద్దెకు దిగాడు రామ్మూర్తి మాష్టారు. నేను బి. ఏ. ఫైనలియర్ చదివే రోజుల్లో ఆయనకి ఊరు బదిలీ అయింది. ఆయన మునసబు కోర్టులో గుమాస్తాగా పనిచేస్తున్నారు. ఇదివర కెప్పుడో ఆయన ఒక ఎయిడెడ్ పాఠశాలలో ఉపాధ్యాయుడిగా పనిచేశారట. అప్పట్నుంచీ ఆయన కా పేరు స్థిరపడిపోయింది. ఆ యనా వూ రు బదిలీ అయేటప్పటికి శ్రీదేవి ఆరవ ఫారం చదువుతూండేది. వెంటనే టీసి తీసుకు వచ్చి ఆ వూర్లో చేరింది. ఆ విధంగా శారద అంటే మన శాస్త్రి కాబోయే భార్య, శ్రీదేవి మిత్రురాండ్రయారు. పైగా ప్రక్క ప్రక్క యిళ్లు కావటం వలన ఆమె గురించి శారదద్వారా శాస్త్రికి తద్వారా నాకూ చాలా విషయాలు తెలుస్తుండేవి. అతను ప్రతి ఆదివారం మేనమామను చూడటం నెపం పెట్టుకుని వచ్చి శారదను కవ్వించిపోతూ, తిరుగు టపాలో నన్నుకూడా చూచుకుంటూండేవాడు. అప్పుడు మేము ఎన్నో విషయాలు మాట్లాడుకొనేవాళ్ళం. వాడంటూండేవాడు.

"ఒరేయ్ శర్మా, శ్రీదేవిని ఎవరు వివాహం చేసుకుంటారోగాని, నిజంగా వాడు అదృష్టవంతుడనుకో. ప్రపంచ సుందరినే తలదన్నే అంత అందంగా ఉన్నదామె. అవునా? ఒప్పుకొంటావా? యస్. కాని ఆమెలో కంచుకాగడా పెట్టి వెతికినా కించిత్తు గర్వంకూడా లేదు. ఆమె చదువుల

---

**రచయితలకు మనవి**

"జ్యోతి" కి రచనలు పంపేవారు అవి నిరాకరింపబడిన పక్షంలో వాటిని త్రిప్పి పంపగోరితె రచనతోపాటు తగినన్ని స్టాంపులను జతచేసి పంపించాలని మనవి. రచనతోపాటు కాక తరువాత స్టాంపులు పంపవద్దని, అట్టివారికి రచనలు త్రిప్పిపంపడం కష్టసాధ్యమని గుర్తించాలని మా విజ్ఞప్తి.

---

సరస్వతి. క్లాసులో అన్నింట్లోనూ ఫస్టుమార్కు. సంగీతలక్ష్మి. ఏమాష్టరు వద్దా ఆమె సంగీతం నేర్చుకోలేదు. కాని చాలా చక్కగా పాడుతుంది. ఇంటి పనులన్నీ తానే స్వయంగా చేస్తుంది. ఎవ్వర్ బిజీ. కాని ఎప్పుడూ అలసట పొందిన దానివలె కను పించదు. ఎవ్వర్ హాపీ. మిసమిసలాడే మేలిమి శరీరం. నిండు యవ్వనంలో ఉన్నది. కాని....ప్చ్....ఆమెకు ఇన్ని క్వాలిఫికేషను లున్నాగాని ఇవన్నీ చిఏటి ముందు దీపం వలె అయి పోయాయి."

"అదేం?"

"ఆమె జీవితంలో దీపం వెలిగించే వారెవరూ లేరు."

"అంటే?"

"రామ్మూర్తిగారు ఆమెకు పెద్ద కట్నం ఇచ్చి పెళ్ళి చేయలేరు. అసలు కట్నమే ఈయలేరేమో?"

"అదీ నిజమే."

"ఇదివరకే పెద్దాడపిల్ల లిద్దరకూ మంచి సంబధాలు చేసి అప్పులుచేసి తీర్చలేక స్వంత ఊళ్ళో ఉన్న రెండెక లాల భూమి అమ్మేసి కుదేలయి పోయారు. కొడుకుల చదువు నిమిత్తం తన జీవితాన్ని, జీతాన్ని ధారపోశారు. కాని వాళ్ళలో ఒకడు ఎలాగో అతి కష్టంమీద మెట్రిక్ అయాననిపించు కుని హైస్కూల్లో అటెండరుగా చేరాడు, రెండోవాడు ఇంటర్ చదివి-దాని అంతు చూడలేక సెకండరీ గేడ్ ట్రయినింగయి ఎక్కడో ఎలిమెంటరీ స్కూలు టీచరుగా చేరాడు. వాళ్ళ కుటుంబాన్నే వాళ్ళు అతికష్టంమీద అంతంత మాత్రంగా గడుపుకుంటు న్నారు. ఇక వాళ్ళ శ్రీదేవి పెళ్ళికి ఎలా సాయం చేయగలరు? అలా ఆశించడంలోకూడా ధర్మంలేదు."

నేనేం సమాధానం చెప్పలేదు,

"ఏమిట్రా శర్మా ఆలోచిస్తు

శ్నావ్ ?"

"ప్చ్.... ఈ రోజుల్లో ఆడపిల్లలు ఎంత అందంగా ఉన్నా, ఎంత చదువుకున్నా కట్నాలు లేనిదే పెళ్ళి జరగటంలేదుకదా? ప్రతి వెధవా నా పెళ్లాం చదువుకున్నదై ఉండాలి, అందంగా ఉండాలి.... అంటాడే తప్ప కట్నం గురించి ఏమీ చెప్పడు కదా. హుం! దేశం ఎలా దిగజారిపోయింది. ఒక వ్యక్తి కట్నం 'డిమాండ్' చేస్తున్నప్పుడు తనకు పెండ్లికుమార్తెయొక్క చదువు గురించిగాని, అందం గురించిగాని, 'ఒబీడియన్స్' గురించిగాని మాటాడే హక్కులేదు. ఇది కనీస పౌర ధర్మం!"

"కరెక్టు!"

"ఈ శ్రీదేవికిప్పుడు మంచి సంబంధం చేయాలంటే కనీసం అయిదారు వేలైనా ఉండాలాయనవద్ద. లేదా తక్కువలో చెదామంటే తనను తాను పోషించుకోవటానిక్కూడా స్తోమతులేని చిన్న ఉద్యోగికిచ్చి పెళ్లి చేయాలి. అది మాత్రం ఖాయం. ఎందుకంటే ఈ రోజుల్లో బజార్లో సరుకుల ధరల్లాగా అప్రయోజకుల ధరలుకూడా పెరిగిపోయాయి కదా మరి. కాని ఈ తక్కువ ధరలో వచ్చిన వ్యక్తి శ్రీదేవిని సరిగా చూచుకోగలడా? అని అనుమానంగా ఉంది. ఆమె బ్రతుకేమౌతుందా, ఆమె వివాహ జీవితం ఎంత దయనీయంగా ఉంటుందా అని తల్చుకుంటూంటే జాలి వెయ్యటం లేదు?"

"అలా ఊఁ. అనవసరపు దయ ఒలకబోసే బదులు ఆమెను నువ్వే పెళ్ళి చేసుకో కూడదూ? మీ శాఖే కూడాను వాళ్ళది!"

"నేనా?"

"అవును నువ్వే. నీకు కట్నం బాధ లేదనుకుంటాను. బాగా ఆస్థిపరుడవుగదా?"

"ఒరేయ్ నీ పిచ్చిగాని పైమ్‌వస్తే ఆస్తులుండిపోతాయా? కళ్ళ ముందు సంస్థానాలు సంస్థానాలు దేశంలో కలిసిపోయి, జమీందార్లీ నాటికి చిప్ప పుచ్చుకుని వీధులవెంట బయల్దేరారు. అటువంటిది నాకీ ఆస్థిమీద నమ్మకం లేదురా. నేనింకా పైకి చదవాలి. పైగా నా ఆశయమేమిటో నీకు తెలుసు గదా. అది సిద్ధిస్తుందిగూడా. ఆతర్వాత మాత్రమే నా పెళ్ళి విషయమై ఆలోచిస్తాను. అదీగాక మనకు శ్రీదేవి ఒకరై 'ఎగ్జాంపుల్' గా కనిపిస్తుందిగాని నేడు మన సంఘంలో ఆమెలాంటి వాళ్లు ఎందరో ఉన్నారు. వాళ్ళందరి మాటా ఏమిటి? ప్రతీ వాళ్ళనూ ఎలాగ పెళ్ళి చేసుకోవటం?"

"ఫూల్స్!! అలాంటివాళ్ళ నుద్ధరించటానికి నీలాగ అర్థంతలుస్న వెధవాయిలు ముందుకు రావాలోయ్. ఒరేయ్ ఫూల్, నీ ఆశయమేమిటో




నాకు తెల్సులే. నువ్వు యమ్మే అవు తావు. అయ్యేయస్ అవుతావ్. ఇంకేం! బ్రహ్మాండమైన పెళ్ళికొడుకువు. ఇరవయ్యెకరాల భూమికీ, యాభై లు ఖరీదు చేసే మేడకీ ఏకైక వారసుడవు. బోలెడు కట్నం వస్తుందప్పుడైతే. ఇప్పుడైతే ఏముందిరా? నీ ఆశయం నాకు తెల్సురా!

"యూ షటప్!"

"నా మాట కడ్డంరాకు. ఒరేయ్ అసలు ఏ పనైనా చేస్తే డబ్బున్న కొళ్ళు చెయ్యాల్రా. మాలాంటి వాళ్ళని ఉద్ధరించండ్రా మీరు. కనీసం మా దారికి అడ్డం రాకండిరా. నీ కెందుకురా అయ్యే యస్. నువ్వు హాయిగా సంసారం చేసుకుంటుంటే, ఆ అయ్యేయస్ పదవే అవకాశం మరో నాలాంటి మధ్య తరగతి కుటుంబీకుడికి రావచ్చు. ఆ విధంగా మాకు సేవ చేసిన వాడి వవుతావు.

ఈనాడు దేశంలో వ్యవసాయ రంగం చాలా మందకొడిగా ఉంది. కారణ మేమంటావ్? అది ఇంకా దద్ర నాయకుల చేతిలో ఉంది. డబ్బు విరజిమ్మి గద్దెకెక్కాలని పెద్ద లనే అలక్ష్యం చేయదగిన దిగ్గజుల చేతిలో ఉందిరా వ్యవసాయ రంగం. అదే మరో పారిశ్రామిక రంగంగాని,

రాజకీయపు రంగంగాని తీసుకో. ఈనాడు మన దేశంలో పారిశ్రామిక రంగం ఎంతో పురోభివృద్ధి చెంది ఎందుకు సుస్థిరంగా ఉండగలిగింది? టాటాలు బిర్లాలు వంటి పెద్ద పెద్దవాళ్లు వాటిని పోషిస్తున్నారు. ఇక రాజకీయపు రంగం — మన దేశంతో బాటు స్వాతంత్ర్యం వచ్చిన కొన్ని ఇతర దేశాలు చూడు; వాటిల్లో చాలావరకూ ప్రజా ప్రభుత్వాలు పతనమైపోయి మిలటరీ ప్రభుత్వాలు పైకి వచ్చాయి. కాని మన దేశం మాటేమిటి? అప్పటి పెద్దలు కొందరు చనిపోయారుకానీ, అదే ప్రభుత్వం ఇంకా నడుస్తోంది. కారణం? ఏమి తెలుసా? తెలియదు. నేను చెప్తా విను! మన ప్రభుత్వంలో ఉన్న వాళ్ళందరూ డబ్బున్న వాళ్ళురా బ్రదర్. అందుకే మన ప్రభుత్వం చాలా జాగ్రత్తగా, సుస్థిరంగా ఉన్నది. సో ఓ ధనవంతులైన వ్యక్తులారా, మీరు వ్యవసాయ రంగంలో కూడా ప్రముఖ పాత్రను వహించి, ఆ రంగంలో కూడా అభివృద్ధిని సుస్థిరత్వాన్నీ సాధించి తద్వారా దేశసేవ చేస్తూ, మా వంటి మధ్యతరగతి వాళ్ళకు ఉద్యోగావకాశాలు కల్పిస్తూ, డబ్బులేని కన్నెపిల్లలు కట్నం లేకుండా వివాహం చేసుకొనేందుకు ముందుకు రమ్మని ప్రార్థిస్తున్నాను!"

"ఏమో నాకేం అర్థం గావటం లేదు. ఇప్పట్నుంచీ మన కెందుకీ ఆలోచనలు? ఫస్ట్. మనం జీవితంలో గట్టి పునాదులు వేసుకోవాలి. ఆ తర్వాతే పెళ్ళి గురించి ఆలోచన!"

"సరె నీ ఖర్మ. చెవిటివాడి ముందు శంఖారావంలాగ నీముందు ఇలాంటి 'డిస్కషన్' తేవటం నాదే పొరబాటు వస్తా."

"యస్. గుడ్ నైట్!"

అప్పట్నుంచీ నాక్కూడా ఎక్కడో అంతరాంతరాళాల్లో శ్రీదేవి గురించిన ఆలోచనలు బయల్దేరేవి. ఆమె అందాన్ని గురించి ఆలోచించేవాడిని. ఆమెను అదేపనిగా చూడాలనీ, ఆమెతో మాట్లాడాలనీ, ఆమెతో స్నేహం చేయాలనీ కాంక్ష రోజు రోజుకీ అధికం కాసాగింది. కాని వేరొక ప్రక్క నా విషయం నేను అనవసరంగా ఈ రొంపిలోనికి దిగి ఆమెను కూడా ఈ రొంపిలోకి దింపటం నాకిష్టం లేదు. వివాహ విషయంలో నా తల్లి దండ్రులకు ఎదురు చెప్పటం కూడా నాకే మాత్రం ఇష్టంలేదు వాళ్లు తీసుకొచ్చిన, వాళ్ళకు నచ్చిన అమ్మాయినే పెండ్లి చేసుకోవాలనే ఉద్దేశం నాది ఇది 'నేరో మైండెడ్ నెస్' తో వ్యక్తిత్వంలేని దని చేసే ఆలోచనె కావచ్చు. కానీ ఆనక అత్తా కోడళ్ళ మధ్య సామరస్యం ఉండాలంటే మా వాళ్ళు తమకు నచ్చిన అమ్మాయినే నా భార్యగా తీసుకొస్తే ఎవరికీ ఏ గొడవలూ ఉండవు. (శ్రీదేవి వాళ్ళకు

తప్పదు అని అనుకోను. కాని వాళ్ళ ఉద్దేశ్యాలు ఎలా ఉంటాయో మరి!) పైగా పుత్రునికిగా వాళ్ళకు సంతోష పెట్టటానికి నాకున్న ఒకే ఒక్క మార్గం. అవకాశం నా వివాహం విషయంలో వారికి పూర్తి అధికారా లివ్వటం. ఇందులో నా 'ఇండివిడ్యు వాలిటీ', వ్యక్తిత్వంవంటి అర్థరహిత మైన పదాలకు స్థానంలేదు. ఇది నే నెనాడో నిర్ణయించుకున్న సూత్రం. పైగా 'ఏజుకేషన్ ఫస్ట్'. సో నేను శ్రీదేవిని మాత్రమే వివాహం చేసు కోవటం అనే ప్రసక్తేలేదు.

కాగా పుష్ప లాంటి ఆ సుకుమారి ఏ ఎడారి జీవితంలోపడి వాడిపోతుందో అనే బెంగ. జాలీ ఒక ప్రక్క. అపాటి కట్నం లేకుండా పెళ్ళి చేసు కోక పోతారా అనే ధీమా ఒక ప్రక్క నన్ను మత్య పెట్టేవి. ఎనీహౌ, రోజు రోజుకీ ఆమె అన్నా, రామ్మూర్తి మాష్టారన్నా జాలీ, దేముడంటే కోపం, కసీ, అసహ్యం పెరిగిపోయేవి.

తర్వాత పరీక్షలు దగ్గర కావటంతో ఆమెను గురించి ఆలోచనలు తగ్గించు కుని చదు లపైకి మళ్ళించాను మన స్సుని ఫలితాలొచ్చిన తర్వాత వాల్టేర్ వెళ్ళిపోయాను యమ్మే చద టానికి. అదయిన తర్వాత అయ్యేయస్‌లో సెలక్షనొచ్చి ముస్సోరీ వెళ్ళిపోయాను ట్రయినింగుకి. ఆ మూడు నాలుగు సంవత్సరాలలోనూ శ్రీదేవిని పూర్తిగా మరచిపోయాననే చెప్ప వచ్చును ఎప్పుడైనా తెల్లగాగానీ, పచ్చగాగానీ ఉన్న అందమైన ఆడపిల్ల లెవరైనా కనిపిస్తే మాత్రం వెంటనే శ్రీదేవి గుర్తు కొస్తూండేది. ఆ వెనువెంటనే ఆమెపై జాలి కలుగుతూండేది.

ఆ తర్వాత శాస్త్రి వద్దనుంచి ఉత్త రం వచ్చింది నేను ట్రైనింగ్‌లో ఉండగా. నేననుకున్నంత ఘోరం జరిగిపోయింది. ఆమెకు ఏది జరుగ కూడదనుకున్నానో ఆదే జరిగి పోయింది. ఆమె ఒక స్కూల్ టీచర్‌కు భార్య అయిపోయింది. క్షమించాలి. స్కూల్ మాష్టర్లకు అంద మైన భార్య లుండకూడదని నా ఉద్దే శ్యం ఏ మాత్రంకాదు కాని శ్రీదేవి వంటి అపురూప సౌందర్యరాశి అంటే నాకో ప్రత్యేకమైన అభిప్రాయం. అభి మానం ఉండటంవలన నాకా విధంగా అనిపించింది రామ్మూర్తి మాష్టారు ఎన్నో సంబంధాలు తెచ్చారట. అంద రికూ అమ్మాయి నచ్చిందట. కానీ కట్నం లేకుండా ఆమెను వివాహం చేసుకునేందుకు, కనీసం తక్కువ కట్న మైనా సరే, ఎవరూ ముందుకు రాలేదట! 'మన వాళ్ళట్టి వెధ వాయిలోయ్' అన్నాడట గిరీశం. అలాగ ఈ దేశంలో ఉన్న వాళ్ళందరూ నాలాంటి వెధవలేమరి! అఖరుకు ఈ ఉపాధ్యాయుడు మాత్రం ముందంజ వేశాడట. కట్నం లేకుండా ఆమెను వివాహం చేసుకొనేందుకు. గుడ్!

కానీ, వాసె వంద్రపుల్ మాన్ యూ ఆర్, మెడియర్ టీచర్! అంత అందమైన పెళ్లాన్ని నువ్వేం చేసుకుంటావోయ్ మాష్టారూ! ఆమెను కార్లలో, కనీసం స్కూటర్ మీద షికారు తిప్పగలవా, పెద్ద పెద్ద భవంతులలో కాపురం చేయించగలవా, షిఫాన్, బెర్లిన్ చీరలు చుట్టబెట్టగలవా, ఏమీ చేయలేవే. మరేం చేద్దామని ఆమెను పెళ్ళి చేసుకున్నావ్? ఆమెను వంట యింటిలో అణగద్రొక్కి, బొగ్గుల కుంపటి మసితో ఆమె అందాన్ని పాడుచేద్దామనే పాడు సంకల్పంతో, దురుద్దేశంతో

"యూ, షటప్!" టీచరు గద్దించాడు.

"ఏం?"

"నువ్వొక రాస్కెల్‌వి!"

"అదేం?"

"కాకపోతే ఏమిటి? నువ్వు చెప్పిన అర్హతలూ, అవకాశాలూ ఉన్నవాళ్ళెవ్వళ్లూ ముందుకు రాలేదు. ఎందుకో తెలుసా? తెలుసారా? ఆమె ఎంత చదువుకున్నా, ఎంత అందంగా ఉన్నా, ఆ అందం వెనుక, ఆ అందంకంటె అందంగా ఉండే అర్థం అంటే డబ్బును ఆమె తీసుకురాలేకపోతోంది. అవునా? ఈ సంగతి ఎవరూ చెప్పరు. పైకనటానికి నామోషి. వెధవ ప్లీలు ఏవో చెప్పటం అలవాటు మీకు. డబ్బులో పుట్టి డబ్బులో పెరిగే మీలాంటి దౌర్భాగ్యులకు అందం సంగతి మాట్లాడటానికి అర్హతలేదు. మావంటివాళ్ళ గురించి జాలి పడటానికి హక్కులేదు. కాగా అందుకు సిగ్గుపడాలి కూడా!" అంటూ అదృశ్య మయారు మాష్టారు.

నా ఆలోచనలు ఆపు చేశాను. అవును, నాకా అర్హతా హక్కులులేవు. నన్ను నాలాంటి సహోదరుల్ని చూచుకుని సిగ్గుపడాలి అంతే! సరె, నా కెందుకొచ్చిన గొడవిదంతా. జాలి పడటం అంటూ మొదలు పెడ్తే దానికి ఒక హద్దంటూ వుండదు. అసలు రామ్మూర్తి మాష్టారు అంతమందికీ మంచి భవిష్యత్‌ని ఇవ్వలేని స్థితిలో తానున్న విషయం తెలిసి ఉండీనాడా ఆనాడు అంతమందిని కనటం ఆయన పొరపాటు శ్రీదేవిని నా భార్యగా చేసుకుని, ఆమెను అన్ని విధాల సుఖపెట్టగలిగే స్తోమతూ అవకాశం ఉన్నా కూడా అదేమీ చేయకుండా, కేవలం ఒట్టి జాలి మాత్రమే పుష్కలంగా ప్రదర్శించటం నా పొరపాటు.

ఆ తర్వాత మరో రెండేళ్ళకు నేను అసిస్టెంట్ కలక్టరుగా కాకినాడలో పని చేస్తున్నప్పుడు ఒకసారి ఆఫీసు పని మీద రాజమండ్రి వెళ్లాను. అక్కడకు కోర్టుపనిమీద వచ్చి శాస్త్రి కలిశాడు. చాలా కాలానికి కల్సుకున్న ఆనందంలో అప్సరాలోకి దారితీశాం. చిన్ననాటి

ముచ్చట్లు, తన వైవాహిక జీవితానుభవాలూ చెప్తూ శ్రీదేవి గురించికూడా చెప్పాడు.

"శ్రీదేవి భర్త ఇప్పుడు ఈవూర్లోనే స్టేట్‌బ్యాంకులో ప్రొబేషనరీ ఆఫీసరుగా పని చేస్తున్నాడట!" నాగుండెల్లో పెద్దరాయి పడింది.

"మరి స్కూల్ టీచరని వ్రాశావప్పుడు ?"

"అవును, అప్పట్లో అతను స్కూల్ టీచరే మరి!"

"ప్రొబేషనరీ ఆఫీసరెలా కాగలిగాడు ?"

"బై ది బై అయామ్ వెరీసారీ. స్కూల్ టీచరంటే ఏ సెకండరీగ్రేడో అనుకున్నావా ? నే నప్పట్లో వివరాలు వ్రాయటానికి అవకాశం లేకపోయింది. అతను ఎమ్మే బియ్యీడీ హయ్యర్ సెకండరీ స్కూల్లో పని చేస్తుండేవాడు. తర్వాత స్టేట్‌బ్యాంకులో సెలక్షనొచ్చింది. అతను చాలా మంచివాడట. శ్రీదేవిని పువ్వుల్లోపెట్టి పూజిస్తున్నాడట. అతనుకూడా చాలా ఫెయిర్‌గా ఉంటాడులే. మొన్న పుష్కరాలకు వచ్చినప్పుడు నేనూ శారద వాళ్ళిద్దర్నీ కలిశాం. రియిలీ శ్రీదేవి ఈజ్ వెరీ లకీ అన్డ్ హాపీ నౌ!"

"పోన్లె. థాంక్ గాడ్. నేనూరికే ఆమె గురించి ఇన్నాళ్లూ అనవసరంగా జాలిపడి పోతున్నాను. వెధవ్వ ఎప్పుడూ ఇలాగే ఉంటావు. మరి ప్రాక్టీసెలా చేస్తున్నావ్ ? ఏదైనా ఒక విషయం వ్రాసేటప్పుడు వివరాలు వ్రాయకపోతె ఎలాగరా ?"

"నువ్వు మాట్లాడున్న దేమిటో నాకేమీ అర్థం కావటంలేదు. అసలు ఇప్పుడేమైందనీ ?"

"ఊఁ ఏమీ లేదులే!"

తర్వాత కాకినాద తిరిగి వస్తుంటే అనిపించింది. దేముడు చాలా మంచివాడని—మంచివాళ్ళ కెప్పుడూ మంచే చేస్తాడనీను శ్రీదేవి హాయిగా ఉంటే అంతేచాలు. ఆమె అదృష్టవంతురాలు. కాదు కాదు ఆమెను పొందటం అనే అదృష్టమేగాక ఆమెను పువ్వులో పెట్టి పూజించటానికి అవకాశం దొరికిన ఆమె భర్తది ఆ అదృష్టం ప్చ్! నేను అప్పట్లో ఆ చిన్న వెంచర్ చేయగలిగి ఉంటే ఆమె నా స్వంతమయి ఉండేది గదా. దుర్మార్గుడు ఆ ఛాన్సు తను కొట్టేశాడు!

ఈ విధమైన ఆలోచనలతో అంతవరకూ శ్రీదేవిపైనున్న జాలి క్రమక్రమంగా ఆమెపైన, ఆమె భర్తపైన అసూయగా మారిపోవటం మొదలు పెట్టింది. ఆ అసూయతో అతనంటే ఒక విధమైన క్రోధం కసీ ఏర్పడ్డాయి నాలో, కానీ, ఏ నో, నేనేమీ చేయలేను. కాగా నా అసహాయతకు నాలో నే నే జాలి పడుతుంటాను. కాని ఈ జాలీ అసూయలు అర్థం లేనివని గ్రహించటానికి మాత్రం చాలా కాలం పట్టింది నాకు.

□□□

# జోక్స్ ఫ్రం

# అమెరికా

* ప్రతివానికీ ప్రభుత్వాన్ని తప్పు పట్టలేం కనుక, ప్రతి మనిషికి ఒక భార్యన్నా వుండాలిసిందే.
* ఈ దేశంలో పాతికేళ్ళలోపు ప్రతి ఆడపిల్లా, తాను సినిమా తారననుకుంటుంది. ప్రతి సినిమాతార తన వయసు పాతికేళ్ళలోపు అనుకుంటుంది.
* పొరుగువాడు చెడ్డవాడైనా ప్రేమించు, వాడి భార్య అందమైనదైనా ప్రేమించకు.
* సంసారంలో విమర్శించడం తన హక్కనుకుంటాడు భర్త, తన కర్తవ్య మనుకుంటుంది భార్య.
* ప్రతి బిడ్డా వాడెత్తు బంగారంతో సమానం, ఇన్‌కమ్‌టాక్సు కట్టేటప్పుడు.
* పెళ్ళికిముందు డైవోర్సు గురించి ఆలోచించేవాడు బ్రహ్మచారి.
* కథల్లో రాజకుమార్తెలకన్నా, యీ కాలపు ఆడపిల్లలు చాలా తెలివైనవాళ్ళు. అబ్బాయిలు సమాధానాలు చెప్పగల ప్రశ్నలను మాత్రమే వీళ్ళు అడుగుతారు.
* డాక్టరుకు జబ్బు అర్థం కాకపోతే కారణం వైరస్, అర్థమయినా నయం కాకపోతే కారణం ఎలర్జీ.
* నేరాలకు కారణం డబ్బుకాదు; డబ్బు లేకపోవడం.
* మగవాళ్ళ క్కావలసింది సౌకర్యం. ఆడవాళ్ళ క్కావలసింది అలంకరణ. యిళ్ళల్లో శాంతి ఎక్కడినుంచి వస్తుంది?

- పీ దగ్గర డబ్బు తీసుకుని, నువ్వు సంపాదించింది నువ్వు సంపాదించనే లేదని నిన్నే నమ్మించగలవాడు అకౌంటెంట్.

- కత్తి ఎప్పుడు అరువియ్యకు, నీ కోడిపిల్లను వాడే దొంగిలించి వుంటాడు.

- వల్లెల అందం తెలుసుకోవాలంటే, బస్తీలో మేడమీద గదిలో కూర్చుని వ్రాసేవాడి పుస్తకాలు చదువు.

- పక్కలో సుఖం చూపెట్టేది అలారం గడియారం.

- అందమైన వస్తువు సంతోషాన్నిస్తుంది, భార్య కొనమని అడిగేవరకూ.

- పొల్లు, గింజా వేరుచేసి, పొల్లు భద్రంగా పొట్లంకట్టేవాడు సంపాదకుడు.

- చాలమంది వాళ్ళ వంశ చరిత్రను వంద సంవత్సరాల వరకు వివరంగా చెప్పగలరు. వాళ్ళకు తెలియనిదల్లా, వాళ్ళ పిల్లలు గడచిన రాత్రి ఎక్కడుందీని !

- పాతికేళ్ళు మాటా మాటా అనుకోకుండా కాపరం చేసారటనా ? గొడ్డు బ్రతుక్కి తోడు గర్వపడ్డం కూడానా ?

- అవివేకినని క్రుంగిపోకు, నీ తెలివిలో నీకు నమ్మకం కలగాలంటే ఏ ఆడపిల్లతోనైనా ఆరు నిముషాలు మాట్లాడు.

- తెల్లవారి నిద్ర లేవగానే ఒక కప్పు మంచి కాఫీ త్రాగడానికి పెద్ద సంపాదనేమి అక్కరలేదు, కావలసిందల్లా భార్య ముందు నిద్ర లేవడం.

- చెడ్డది చూడకు, వినకు, మాట్లాడకు, నువ్వెప్పటికీ గొప్ప పుస్తకం వ్రాయలేవు.

- ఈ దేశంలో నోట్లు తగలబెట్టడానికి చోటులేదు. అందుకే మూటల్ల కోసారి చంద్రుడిమీది కెళ్ళొస్తూ వుంటారు.

సేకరణ : విజయలక్ష్మి




చదువుతోన్న పుస్తకాన్ని దిండుక్రిందికి తోసి టేబిల్ మీదున్న టైంపీస్‌వంక చూచేడు సత్యం. రాత్రి పన్నెండవుతోంది. కిటికీ ప్రక్కగా మడత మంచంపైన పడుకొని నిద్ర పట్టక శ్రీనివాసరావు అటూ ఇటూ దొర్లుతున్నాడు. జగన్నాథం సిగరెట్టు వెలిగించి వరూధినీ ప్రవరాఖ్యం చదువుతోన్నాడు. సత్యం కూడా సిగరెట్టు వెలిగించి శ్రీనివాస రావుని పలకరించేడు.

"ఏం గురూ! నిద్రపట్టడం లేదా?"

శ్రీనివాసరావు జోర్లా పడుకుని స్నేహితునికి సమాధానం చెప్పేడు "లేదు. నిద్రరావడంలేదు."

సత్యం సిగరెట్టుపొగని రైలింజన్లా గాల్లోకి వదిలి "నిద్రపట్టక పోడానికి కారణాలు మూడట." అన్నాడు.

"ఏమో? నాకు తెలీదు ఆ కారణాలేమిటో చెప్పు" అడిగేడు శ్రీనివాస రావుకూడా సిగరెట్టు వెలిగించి.

"దొంగతనం చేద్దామనుకునే

వాడికీ, ఆర్థికంగా దెబ్బతిన్న వాడికీ, సెక్స్ గురించి ఆలోచించేవాడికీను."

సత్యం మాటలకి మెల్లగా నవ్వుతూ లేచి కూర్చున్నాడు శ్రీనివాసరావు. జగన్నాథం పుస్తకాన్ని టేబిల్‌పైన పడేస్తు "గురుడికి సోమశీల గుర్తొచ్చుంటుంది!" అన్నాడు.

"ఏం? అదేనా కారణం?" అడిగేడు సత్యం.

"ఆ పిల్ల గురించి ఆలోచించకూడదా?" తమాషాగా నవ్వేడు శీను.

"శీనూ! పరీక్షలు దగ్గర కొస్తున్నాయ్! గొప్పింటి ఆడపిల్ల పులిలాటిదిరాబాబు! ప్రేమలో పడ్డావా నిన్నార్పేస్తుంది. మరో ప్రక్క చదువు చంకనాకి పోతుంది. ఈ నెల్రోజులూ ఆ చిట్టెమ్మ గురించి ఆలోచించడం ఆరోగ్యానికి అంత మంచిదికాదు." అన్నాడు జగన్నాథం.

శ్రీనివాసరావు మాట్లాడకుండా గది తలుపులు తెరుచుకుని హాస్టల్ వరండాలోకి వెళ్ళి నించున్నాడు. హాస్టల్లో ఇంకా అక్కడక్కడ దీపాలు వెలుగుతున్నాయి. వెన్నెల మత్తుగా కురుస్తోంది. చీకటి వెన్నెల్లో తెల్లగా అందంగా వుంది. మనసుకి పిచ్చి పట్టినట్టుగా వుంది శ్రీనివాసరావుకి. సోమశీల కళ్ళముందు తారట్లాడుతోంది, పాలరాతిబొమ్మలా, సోఫియా లారెన్‌లా, వెన్నెల కురుస్తోన్న ఆ రాత్రిని, వెన్నెల్లో వెన్నెల్లా వుండే సోమశీలనీ సొంతం చేసుకుని ఆ రాత్రిని ఏదో చేసేయాలని వుందతనికి. ఆ రోజు సాయంత్రం బీచిలో కూర్చుని కులాసాగా మాట్లాడుతూ అడిగేడు శ్రీనివాసరావు సోమశీలని.

"నన్ను చూసిన మొదటిసారి నీకెలనిపించింది!" అని.

సోమశీల మెత్తటి ఇసుకలో తన పేరును చెక్కుతూ అన్నది "అరడుగుల మనిషినీ చూడగానే మనసు రెపరెప లాడింది!" అది గుర్తుకొచ్చి సన్నగా నవ్వుకొన్నాడు. మగవాణ్ణి నువ్వు మొనగాడివని ఏ ఆడదన్నా అంటే చాలు సిద్ధంగా వున్నవాడు కూడా మీసాలు దువ్వుతాడు. అదే ఆడదాని ఆడతనం, మగవాడి బలహీనత! శ్రీనివాసరావు లోపలికొచ్చేశాడు అక్కడ్నుంచి. జగన్నాథం ముసుగు పెట్టబోతూ.

"శీనూ! అంత నిద్రరాకపోతే కొంచెం తీర్థం పుచ్చుకో. వెంటనే నిద్ర పడుతుంది" సలహా ఇచ్చేడు.

"నా దగ్గరలేదు. ఉంటే ఇంతసేపెందుకాగుతాను!" అన్నాడు శీను.

"టూ నాట్ వన్ దగ్గరుంది. కాలరీ పేట సరుకు. వెళ్ళదుగు!" అన్నాడు జగన్నాథం.

"వాడిస్తాడా?" అనుమానంగా

అన్నాడు.

"ఎవడికోసం! సరే నేనే వెళ్ళి తెస్తానుండు" అంటూ జగన్నాథం తలుపు తెరుచుకొని వెళ్ళిపోయాడు. అయిదు నిమిషాల్లో ఆయుధంతో సహా తిరిగొచ్చేడు జగన్నాథం.

"ఏరా సత్యం! నువ్వు కూడా ముగ్గులోకి వస్తావా?" అడిగేడు జగన్నాథం.

"పుణ్యం పురుషార్థం తప్పుతుందా?" అన్నాడు నవ్వుతూ సత్యం.

మిత్రులు ముగ్గురూ చాపమీద దగ్గర దగ్గరగా కూర్చున్నారు. మూడు గాజు గ్లాసుల్లోకి సీసాలోవున్న పచ్చటి ఔషధాన్ని వంపి సోడాలు అందుబాటులో లేని కారణంగా కూజలోని మంచి నీళ్ళని కలుపుకున్నారు. గ్లాసులు పైకి లేచాయి.

కాళీ గ్లాసులు కిందపెట్టి సిగరెట్లు వెలిగించారు. "ఇప్పుడు హాయిగా వుంది ప్రాణానికి. నౌ అయాం ఆన్ది బోర్డర్" అన్నాడు శ్రీనివాసరావు కులాసాగా భుజం చరుచుకుంటూ.

"బౌండరీ దాటగ్గురూ! సోమశీల గుర్తుకొస్తుంది!" అన్నాడు జగన్నాథం నవ్వుతూ.

"ఫూల్! సోమశీల నాకెప్పుడూ గుర్తుంటుంది. అసలు మర్చిపోడం అంటూ వుంటే కదా తిరిగి గుర్తు చేసుకోడానికి" సత్యం అనవసరంగా నవ్వేశాడు. నవ్వి అన్నాడు;

"గురుడు చాలా అమాయకుడై పోయాడు జగన్నాథం! సోమశీల గురించి వున్న రూమర్ తెలిసీ ప్రేమిస్తున్నాడు. శీనూ! ఒరేయ్ నా చిట్టితండ్రీ సోమశీలకి కారెక్టర్ లేదట. పిచ్చిలోపడి మోసపోకురా బాబూ!"

సోమశీలని గురించి అలా మాట్లాడిన సత్యాన్ని హత్య చేయాలనిపించింది, శ్రీనివాసరావు కాక్షణంలో.

"ఒరేయ్ గుడ్డోడా! తెలీకుండా ఆడపిల్లమీద నిందవేయకు. రేసత్యం! రాస్కెల్! ఈ క్షణంలో నా చేతిలో తుపాకే వుంటే నిన్ను కాకిని కాల్చినట్టు కాల్చి పారేసేవాడిని. ఫూల్! సోమశీల శీనుగాడి ప్రాణంరా బాబూ! తప్పు. ఇంకెప్పుడు వెధవ మాటలు

---

● జడ్జి:—నువ్వు హోటల్లో కుర్చీలు, బల్లలు విరగ్గొట్టి, తర్వాత యజమానిని, సర్వరును కొట్టి వాళ్ళచేతి ఎముకలని విరగ్గొట్టావు. నువ్వు చెప్పదల్చుకున్న దేమయినావుందా?

ముద్దాయి:—అప్పుడప్పుడూ అలాంటి బలహీనత నాకొస్తుంటుంది.

మాటాడకు. నాలిక తెగ్గోస్తాను." శ్రీనివాసరావు సత్యంవంక కసిగా చూస్తూ అన్నాడు, గోడకి జారగిలబడుతూ.

"శీనూ! నీ రూమ్మేటు సత్తిగాడంటున్నాడని తేలిగ్గా కొట్టి పారేయకు. బెజవాడలో ఎవడో క్రికెట్ కాప్టెన్‌తో తిరిగేదట. వాడిపేరు రాజారావట. ఆ పిల్ల నువ్వంటున్నంత పతివ్రతేం కాదు; కళ్ళున్న ఎవర్నడిగినా ఆ మాట చెప్తారు. కొంచెం కళ్ళు తెరువు. అంతే!"



స్టాపిట్ రాస్కెల్! మరో మాట కూస్తే చంపేస్తాను. నోరుందని వెధవ మాటలు మాట్లాడకు" శ్రీనివాసరావు సత్యం షర్టు పట్టుకొని గుంజుతూ అన్నాడు.

సత్యానికేడుపొచ్చింది స్నేహితుడి మాటలకి. శ్రీనివాసరావుపైన ఎదురు తిరగేందుకు ధైర్యంలేని ఒక్క మనిషి సత్యం. సత్యం మనసు కష్టపెట్టుకొని అన్నాడు "అవును! నిజమెప్పుడూ నిష్ఠూరంగానే వుంటుంది. అసలా బాబూ అయ్. నిజమే! నీచేతిలో తుపాకీ వుంటే నిజంగానే నన్ను కాల్చిపారేసే వాడివి. నవ్వుకొంటున్నాను. శైలా దగ్గర స్నేహానికి తావుండదని గ్రహించేను. కాలేజిలో సోమశీల గురించి ఎలాటి కథలు ప్రచారంలో వున్నాయో తెలిసినవాడివి కనక నువ్వు నా స్నేహితుడని చెప్పానంతే! ఏకక్షణం కలుగుతోందని గ్రహించలేని ఫూల్ని నరికేయ్ నన్ను." ఆ మాట అంటున్న సత్యం కళ్ళల్లో నీరు గిర్రున తిరిగింది.

శ్రీనివాసరావు మాటాడలేదు. అప్పుడు జగన్నాధం అన్నాడు

"శీనూ! సత్యం అసహాయుడై పోయాడు. తాగిన మైకంలో ఏవో అన్నాడని కష్టపెట్టుకోకు. వాడు విన్న మాటనే నీకు చెప్పాడు. అంతేగా!"

శ్రీనివాసరావు కళ్ళు సగం మూసి తెరచి అన్నాడు సిగరెట్టు పొగని గాలి లోకి వదిలి.

"బొమ్మలాటపిల్ల కంటి కెదురుగా వుంటే ప్రతి అణాకాని వెధవకీ ఆశ గానే వుంటుంది. ఆశ ఆశగానే మిగిలి పోవడంతో నోటికొచ్చిన మాటలనే స్తారు. అంతేరా అంతే! నేను ఛస్తే నమ్మను. సోమశీలని నేను ధాయి ఇంగా ప్రేమిస్తోన్నాను. ఆ అమ్మాయి గురించి ఎవరన్నా తెలీక మాటలు మాటాడితే నేను భరించలేను. దయ చేసి నాకింకేం చెప్పకండి." అన్నాడు శ్రీనివాసరావు, సీసాలో మిగిలిన మందుని గ్లాసులోకి పోసుకుంటూ. అతని మాటలు విని సత్యం నీరసంగా గోడకి చేరగిలబడిపోయాడు. జగ న్నాథం కూడా సత్యం కాళ్ళ దగ్గర పడుకున్నాడు శ్రీనివాసరావు మెల్లిగా లేచి, మంచంపైన పడుకున్నాడు, ఇంక మాటాడేందుకు ఓపికలేక. అతని కళ్ళముందు మాత్రం సోమశీల తార ట్లాడుతోంది.

* * *

శ్రీనివాసరావు ఆ సాయంత్రం గర్ల్స్ హాస్టల్ కెళ్ళేడు. అతను వెళ్ళే



సరికి సోమశీల అందంగా వున్న ఒక కుర్రాడితో మాటాడుతోంది. శ్రీనివాస రావుని ఆ కుర్రాడికి పరిచయం చేసింది సోమశీల.

"ఇతను రాజారావు. బెజవాడలో నాతోపాటే బి. ఏ. చదివేడు. క్రికెట్ ఆటలో రంజీవరకు పోయాడు. రాజా రావ్ ఇతను మిష్టర్ శ్రీనివాసరావు ఎం. ఏ. చదువుతున్నాడు నాతో పాటుగా."

శ్రీనివాసరావు, రాజారావుని పరీ క్షగా చూసేడు. సన్నగా, పొడుగ్గా, ఎర్రగా అందంగా వున్నాడు. మరీ అంత పొడుగే కనక లేకపోతే 'చీర' కడితే ఆడదానిలా వుంటాడు రాజా రావు అతను నిజంగా ఆడపిల్లయి వుంటే బావుండేదనిపించింది. కానీ అంతలోనే జెలసీ చెందాడు. సత్యం మాటలు గుర్తుకొచ్చాయి, సోమశీల రాజారావుతో బెజవాడలో తిరిగిందని.

రాజారావుని కుక్కపిల్లని ఆడించి నట్టుగా ఆడించాలనిపించింది శ్రీనివాస రావుకి.

"అయిదు నిమిషాలు ఓపికపట్టండి. కారీ మార్చుకొస్తాను. అలా టౌన్ లోకి వెళ్ళొద్దాం!" అని లోపలకు వెళ్ళిపోయింది సోమశీల.

సోమశీల అన్నమాట నిలబెట్టు కుంది. అయిదో నిమిషం పూర్తి కాకుండానే వచ్చి:

"పదండి వెళ్దాం!" అన్నది.

రాజారావు లేచి నించున్నాడు. అతనితో సోమశీల చనువుగా మాట్లాడుతూ, తాకుతూ నడుస్తోంది. కంపరంగా వుంది శ్రీనివాసరావుకి. వాళ్ళిద్దరి మధ్యగా వెళ్ళి నడవాలనిపిస్తోం దతనికి. వాళ్ళు రోడ్డుమీద కొచ్చేసరికి కిక్కిరిసే జనంతో గుడిసె బండిలా వుండే విశాఖపట్నం పదో నెంబరు సిటీబస్సు వచ్చి ఆగింది. అందులో ఎక్కడం సామాన్యమైన వారికి తేలికైన విషయంకాదు. కానీ అక్కడ ఆడపిల్లలకి రదీగా వున్న బస్సు లెక్కడం అంటే వల్లమాలిన ఇష్టం.

సోమశీల చాలా తేలికగా బస్సు ఎక్కేసింది. వెనకగా రాజారావు ఎక్కాడు. శ్రీనివాసరావు కొంచెం ఎడం అయ్యాడు వాళ్ళకి. సోమశీల బస్సులో ఒత్తిడిచేత రాజారావుకి తగులుతోంటే, శ్రీనివాసరావు భరించలేకపోతున్నాడు. రాజారావుని చంపేయాలని వుందతనికి. రాజారావు నడుంచుట్టూ చేయివేసి నించోంది సోమశీల. అటు చూడ్డం ఇష్టంలేక తల తిప్పేసుకున్నాడు శ్రీనివాసరావు.

బస్సుదిగి హోటల్లో షామితీ రూంలోకి వెళ్ళి కూర్చున్నారు. శ్రీని వాసరావు మౌనంగా కూర్చోవడం చూసి అడిగింది సోమశీల, "అలా వున్నావేం?" అని.

"తల నొప్పిగా వుంది!" సిగరెట్టు వెలిగిస్తూ అన్నాడు తను.

"ఏవన్నా టాబిలెట్స్ తేనా?" అడిగేడు రాజారావు.

"వర్లేదు. అదేపోతుంది!" అన్నాడు.

"నో! వుండండిప్పుడే వస్తాను." అంటూ రాజారావు బయటికి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళినవైపే చూస్తూ అన్నది శీల.

"రాజారావు చాలా మంచివాడు."

"అవును ఎదుటి మనిషి కష్టాన్ని ఇట్టే గ్రహించగలడులా వుంది."

ప్రశ్నార్థకంగా చూసింది సోమశీల. అంతలో అతనే వచ్చాడు.

"సారిడాన్ దొరికింది కాఫీతో వేసుకోండి. వెంటనే పోతుంది మీ

నొప్పి?" అన్నాడు రాజారావు.

"దేశసేవకి బాగా పనికొచ్చేలా వున్నారు. పాలిటిక్స్‌లో దిగక పోయారూ?" అన్నాడు శ్రీనివాసరావు.

రాజారావు నవ్వేడతని మాటలకి.

"మీరెన్ని రోజులుంటా రిక్కడ?" అడిగేడు శ్రీనివాసరావు. అతను ఆరోజే వెళ్ళిపోతే బాగుండునని మనసులో వుంది.

"ఎల్లుండి వెళ్ళిపోతాను సార్! విజయనగరంలో మా అక్కయ్య వుంది. చూసి వెళుతూ ఇక్కడ శీల వుందని దిగేను. అసలీపేశే వెళ్ళిపోయే వాడిని. కానీ శీల తనమీద ఒట్టు పెట్టింది."

రాజారావు మాటలకి సోమశీల అన్నది "అవున్నన్ను చూసి రెండే ళ్ళయింది. మెరుపులా కనబడి మాయ మైపోవాలనుకున్నా వేమిటి? అదేం కుదర్దు."

సోమశీలమీద వున్న ప్రచారాలు నిజమేనా? అన్న సందేహంలో కొట్టుమిట్టాడుతోన్నాడు శ్రీనివాసరావు. తను సోమశీలను దారుణంగా ప్రేమి స్తున్నాడు. తనింకా ఆమెకి భర్త కాలేదు కానీ భార్యాభర్తలమధ్య సంబంధం తనకి, సోమశీలకి వుంది.

అలాంటిది తనముందేరాజారావుతో ఆ విధంగా సోమశీల మసలడం నచ్చ లేదతనికి.

"శీలా! ఏ పద్ధతి నాకేం బాగో లేదు. నే స్నీకు కాబోయే మొగుణ్ణి. నా ముందు ఎవడో అణాకానీ వెధ వతో ఇంత సన్నిహితంగా మసలడం నేను సహించలేను. నా రక్తం మరిగి పోతోంది. ప్లీజ్ రాజారావుని పొమ్మను - దూరంగా నా క్కనబడ కుండా పొమ్మను" అని చెప్పా లను కున్నాడు.

టిఫిన్ ముగించి కాఫీ తాగేక బయట కొచ్చేరు. "శీలా! నేను లాడ్జికి వెళ్ళిపోతాను. తిరిగి దర్శనం?" అడిగేడు రాజారావు నవ్వుతూ.

సోమశీల అతని చేతిని పట్టుకుని నొక్కుతూ "నువ్వు రాక రాక వచ్చేవు కనక, రేపు కాలేజికి వెళ్ళను.

---

● జడ్జి:—ఖరీదయిన బట్టలున్న ఆ సూటుకేసును నువ్వు దొంగి లించావు ఎందుకని?

ముద్దాయి:—ప్రతిసారి పాతగుడ్డలతో కోర్టుకు రావడం నాకు చిన్నతనంగా వుంది

నీ రూం నెంబరెంతన్నావ్? ఇరవై నాలుగు కదూ! అల్ రైట్! సరిగ్గా పదకొండు గంటలకి నేను నీ లాడ్జ కొస్తాను. ఎక్కడికీపోను. వీలుంటే సింహాచలం వెళదాం!" అన్నది. ఆ మాటలు విని రాజారావు వెళ్ళి పోయాడు

సోమశీల తనని కూడా రమ్మని చెప్తుందనుకొన్నాడు శ్రీనివాసరావు. కానీ ఏమీ చెప్పిందికాదు. బస్సులో అడిగేడు శ్రీనివాసరావు.

"రేపు కలుద్దామా?" అని.

"సారీ శీనా! విన్నావుగా రాజాకి చెప్పేను. రేపు సింహాచలం వెళ్లామని. మనం తర్వాత కలుద్దాం" అన్నది.

శ్రీనివాసరావుకి కొరడాతో వీపు మీద ఛళ్ మని కొట్టినట్లనిపించింది. విశాఖపట్నంలో వున్న సముద్రం లోతున్నా తెలుసుకోవచ్చు. సోమశీల మనసుని అర్థం చేసుకోడం అంత తేలిక కాదనిపించింది.

గర్ల్సు హాస్టల్ దగ్గర సోమశీల దిగిపోయింది. శ్రీనివాసరావు హాస్టల్ సిద్ధార్థలో తన రూంని చేరేటప్పటికి రాత్రి ఎనిమిదిన్నరయింది.

♦ ♦ ♦

శ్రీనివాసరావుకి ఎప్పుడూ తాగ నంతగా తాగేసి కంటికన్నబడ్డ వాడి నల్లా కాల్చిపారేయాలని వుంది సూట్ కేసులోంచి అందమైన సీసాని బయ టకి తీశాడు. దానిమీద గోల్డ్ రిబాండ్ విస్కీ అని రాసి వుంది మూత తీసి సీసా మూతిని నోట్లో పెట్టుకుని తాగడం మొదలు పెట్టాడు.

కంఠం మండుతోంది. చేత్తో కంఠాన్ని సవరించుకున్నాడు. తడ బడుతున్న అడుగులతో వెళ్ళి మంచం మీద కూర్చున్నాడు. అతనికి తెలీ

కుండా ఏడుపొస్తోంది. వెక్కి వెక్కి ఏడ్చాడు. జుత్తు పీక్కున్నాడు. వంటి మీదున్న చొక్కాని చింపేసుకోవా లనిపించింది. రూంలోవున్న పుస్తకా లని దూరంగా పారేయాలనిపించింది శ్రీనివాసరావుకి. పన్నెండవుతోంది. ఈ పాటికి సోమశీల రాజారావుగాడి కోసం లాడ్జికి వెళ్ళివుంటుంది. రాజా రావు సోమశీలని దగ్గరగా తీసు కొంటూ ఉంటాడు. సోమశీల అందాన్ని త్రాగడానికి ప్రయత్నం చేస్తూ వుంటాడు. శ్రీనివాసరావు కళ్ళకి ఓ అందమైన హోటల్లో ఒక గది, ఆ గదిలో అందమైన మంచం. ఆ మంచంమీద రాజారావు, రాజారావు ప్రక్కనే అతని చేతుల్లో సోమశీల కనబడుతున్నారు. కానీ ఆ విధంగా సోమశీల గురించి ఊహించడానికి మనసొప్పలే దతనికి.

సోమశీల పేరు ప్రతిష్టలతోపాటు లక్ష్మీదేవికి మొగుడై కూర్చున్న చల పతిరావుగారి ఏకైక గారాబుపట్టి. ఆ పిల్ల పుట్టిన వెంటనే చలపతిరావు గారి భార్య కన్ను మూయడంతో ఆయన కళ్ళన్నీ ఆ పిల్లమీద పెట్టు కొని పెంచాను. సోమశీల చెప్పింది వేదం ఆ తండ్రికి. ఆ పిల్ల కిష్టంలేని పని చేయడం అంటే ఆ తండ్రికి సుతరాము నచ్చదు. ఏ విషయంలో నైనా సరే ఆ పిల్ల మనసు కష్టపడిం దని తెలిస్తే కారణం వెదకందే నిద్ర పోరు చలపతిరావుగారు. పెద్ద పెద్ద నదులకి సైతం ఆనకట్టలు కట్టిన ఆ మనిషి కూతురిపైన ప్రేమ విష యంలో ఆనకట్ట కట్టలేకపోయారు. శ్రీనివాసరావుకి ఆ విషయం తెలుసు. కనక సోమశీల సంస్కృతినీ, నాగరి కతని తప్పుగా అంచనావేసి ధారు ణంగా ఆలోచించడం అతని కిష్టం లేదు. నాగరికత పెరిగింది. సంఘంలో మగవాడితోపాటుగా సమానమైన అర్హతలని సంపాదిస్తోన్న ఆడది మగ వాడితో మాటాడ్డం, చనువుగా తిర గడం తప్పేంకాదు. ఆ చనువుని తప్పుగా తీసుకోడం బుద్ధిహీనుల లక్షణం. శ్రీనివాసరావుకి ఆరాటంగా వుంది. మంచంమీద పడుకోవాలని లేదు. నేలమీద పడుకున్నాడు శ్రీని వాసరావు.

"ఇక నిన్ను ఉపేక్షించను సోమ శీలా! నిన్ను ప్రేమించిన వెధవని. నీ మీద నమ్మకం వుంది నాకు. నిన్ను పెళ్లి చేసుకుని ఇంట్లో కట్టి పారే స్తాను నువ్వేం నాగరికతని నేర్చుకో నవసరంలేదు. నువ్వింట్లో పడివుంటే నా కంతే చాలు!"

అంతలో తలుపు తోసుకొని సత్యం, జగన్నాథంగదిలోకి వచ్చారు. వాళ్ళని చూడగానే మనసు స్థిమితం లేని శ్రీనివాసరావు వెక్కి వెక్కి ఏడవడం మొదలు పెట్టాడు.

• • •

రాజారావు వెళ్ళిపోయాడు వెళ్ళే ముందు నిన్ను కలుసుకోవాలను కున్నాడు. కానీ వీల్లేక పోయింది పాపం!" అన్నది సోమశీల శ్రీనివాస రావుతో.

"నాకు మాత్రం ఏమీ అనిపించ

లేదు." శ్రీనివాసరావు ముభావంగా అన్నాడు.

"అదోలా వున్నావ్? రెండ్రోజు ల్నుంచీ కనబడలేదని కోపమా?" దగ్గరగా జరుగుతూ అడిగింది సోమశీల.

"రెండ్రోజుల్నుంచీ కనబడక పోతేయేం! ఇప్పుడు కనబడుతున్నావుగా!" అన్నాడు శ్రీనివాసరావు.

"నీ మొఖంలో జెలసీ కనబడుతోంది!" అంది నవ్వడానికి ప్రయత్నం చేస్తూ. సోమశీల చేతిలోకి మెత్తని ఇసుకని తీసుకొని తిరిగి క్రిందపోస్తూ.

శ్రీనివాసరావు సోమశీల మొహం లోకి చూస్తూ "జెలసీనా? ఎందుకు? నాకు జెలసీ అంటే ఎలా వుంటుందో తెలీదు!" అన్నాడు.

"ఇప్పుడు నీ మనసులో వున్నదే జెలసి అంటే!"

శ్రీనివాసరావు కొన్ని క్షణాలు ఆమె కళ్లల్లోకి గుచ్చి గుచ్చి చూసి ఆమె చేతిని గట్టిగా పట్టుకున్నాడు.

చీకటి పడుతోంది. బీచిలో జనం లేరు. అక్కడుంది వాళ్ళిద్దరే!

ఆమె రెండు భుజాలని గట్టిగా పట్టుకొని దగ్గరగా లాక్కుంటూ అడిగేడు.

"శీలా! నే నడిగే దానికి నువ్వీ రోజు సూటిగా సమాధానం చెప్పాలి"

శిల, అతని చేతుల్ని విడిపించుకొంటూ అన్నది "నీ మనస్సులో ఏదో దెయ్యం ప్రవేశించింది. రాజారావుని చూసిన దగ్గర్నుంచీ నీ మాటలే వేరుగా ఉన్నాయి."

"అవున్నిజమే! శీలా! నీ దగ్గర నాకు తప్ప మరో మనిషికి చోరవ, సన్నిహిత్యం ఉండడం నేను సహించలేను. అది నాకు బాగోదు. అందుకే నే నీ రోజు ఈ నిర్ణయాని కొచ్చేను."

శీల నవ్వింది. నవ్వి "ఏమిటో ఆ నిర్ణయం?" అడిగింది.

"పరీక్ష అవగానే పెళ్ళికి ఏర్పాట్లు చేయాలనుకొంటున్నాను."

"పెళ్ళా?" ఆ మాటకి ఆశ్చర్యాన్ని ప్రకటించింది సోమశీల.

శ్రీనివాసరావు పిచ్చిపట్టిన వాడిలా అయిపోయాడు. "అవున్నేను మాటాడేది మన పెళ్ళి గురించి" అన్నాడు.

"నువ్వు చాలా పిచ్చివాడివి" అంది నవ్వుతూ సోమశీల.

"శీలా! వింతగా మాటాడి నాకు చిరాకు తెప్పించకు. అసలే నా మనసు బాగోలేదు" అసహనంగా అన్నాడు.

"శీనూ! నిన్ను పెళ్ళి చేసుకుంటానని నే నెప్పుడూ అనలేదే! ఎలా అనుకున్నా వసలు?"

"శీలా!"

సోమశీల కొద్దిగా వెనక్కి జరిగింది. "శీనూ! ఇంతకాలం నుంచీ నువ్విదే అభిప్రాయంలో ఉంటే మటుకు చాలా పొరబడ్డావు. నేను పెళ్ళి చేసుకోబోయే వాడికి చాలా అర్హత లుండాలి. నేను గొప్పింట్లో పుట్టిన దాన్ని. నా కెన్నో కోరిక లుంటాయి. అవన్నీ తీర్చగలిగిన వాడు నాకు కావాలి. నువ్వు తీర్చగలవా?"

"ఏమిటో కోరికలు?" అడిగేడు మెల్లగా. అతని గొంతులో జీర అస్ప

షంగా పలుకుతోంది.

"నీ వల్ల తీరేవికావు. శీనూ! నీకు కారుందా?" అడిగింది.

"లేదు."

"అందమైన మేడ?"

"లేదు."

"బ్యాంక్ ఎకౌంటు ?"

"లేదు."

"నువ్వు నన్ను చేసుకొని ఏం చేయాలనుకొంటున్నావ్!"

"నిన్ను నే నమితంగా ప్రేమిం చేను శీలా! నిన్ను నా హృదయంలో ఉంచి ఆరాధించే మనసుంది నాకు. అది చాలదూ?" అన్నాడు.

సోమశీల గలగల నవ్వేసింది.

"వెధవ మనస్సు. కథల్లోని మాటలు నాకు తలనొప్పి. పెంపుడు కుక్కని గొలుసుతో కట్టినట్టు, మంగళ సూత్రం కట్టి ఇంట్లో కూర్చో మంటే కూర్చునే దాన్ని కాదు నేను"

శ్రీనివాసరావు సోమశీల భుజాన్ని గుచ్చి పట్టుకున్నాడు. అతని కళ్ళు నిప్పులు కురుస్తున్నాయి.

"ఏం, రాజారావుగాడి కంటే తీసి పోయానా? వాడొచ్చేకే నీలో నాకి మార్పు కనబడుతోంది" అన్నాడు.

"నువ్వెందుకు గిల్టీ ఫీలవుతున్నావో అర్థం అయింది. అందుకే నిన్ను మరోసారి ఫూల్ అనాలనుంది.

"శీనూ! మా డాడీ నన్ను కళ్ళల్లో పెట్టుకొని పెంచాడు. నా మనసు కష్టం కలిగిందని ఏ మాత్రం తెలిసినా కారణం వెదకందే నిద్రపోడు. నా ప్రవర్తనని తప్పుపట్టే ధైర్యం వీళ్ళ నికి నీ లాటి సామాన్యమైన మనషులకి ఉండదనే రూలు జగమెరిగిన సత్యం. ఎవరన్నా తప్పు పట్టినా - ఆ తప్పు రైటుగా చెలామణీ అయి పోయినపుడు తప్పు పట్టిన మనిషి కాలిపోగల ప్రమాదం గూడా వుంది. శీనూ!

పెళ్ళికాని వయసులో ఉన్న ఆడదానికి మగవాడి అవసరం మగవాడికి ఆడదాని అవసరం ఎంతైనా వుంది. కేవలం నేను అందుకే నీతో స్నేహం చేశాను. రాజారావు కూడా నీ లాటి స్నేహితుడే నాకు. చెప్పు నన్ను పెళ్ళి చేసుకొనేపాటి ధైర్యం నీకివ్వుడుందా?" సోమశీల కళ్ళల్లో నీరు గిర్రున తిరిగింది. శ్రీనివాసరావు

---

● తప్పిపోయిన వ్యక్తిని గురించి రష్యా ప్రభుత్వ వార్తాపత్రికలో అధికార ప్రకటన :

నీవా నదిలో కొట్టుకు పోయాడని నమ్మబడుతున్న పెట్రోవిచ్ కళేబరం యొక్క ఆచూకీ తెల్పినవారికి తగు బహుమతి ఇవ్వబడ గలదు. మరణించిన వ్యక్తి వివరాలు : సాధారణమైన ఎత్తు నీలి రంగు కళ్ళు, తెల్లని జుత్తు, చప్పిడి ముక్కు. ముఖ్యమైన గుర్తు : ఈయనకు నత్తి.

మాటాడలేదు.

"నాకు తెలుసు శీనూ! నిజం చెబితే మాటాడ లేవని నాకు తెలుసు. నిన్ను నేను వంచించలేను. అందుకే నిజం చెప్తున్నాను. అంతా మర్చిపో శీనూ! ఈ రోజు నేనే నీకు చెప్పా లనుకొన్నాను. నా పెళ్ళి నిశ్చయమై పోయింది హైదరాబాద్‌లో గోవింద రావ్ అండ్ కంపెనీ ప్రొప్రయిటర్ నన్ను పెళ్ళి చేసుకోబోతున్నాడు. అతనికి నాలుగు కార్లు, నాలుగు మేడలు, చేతినిండా డబ్బు, బ్యాంక్ ఎకౌంటు నగలు, హైదరాబాద్‌లో ద్రాక్ష తోటలు .. చాలా ఉన్నాయి. ఒకవేళ నీకు నిజం చెప్పకుండా వంచించి పెళ్ళి చేసుకోవాలన్నా, ఈ సుఖా లన్నింటినీ ఎలా వదులుకో గలను?" అడిగింది జీరపోయిన గొంతుతో.

"అయితే నన్ను వంచించలేక పోయిన దానివి గోవిందరావు కళ్ళ నెందుకు కప్పాలను కొంటున్నావ్!" అడిగేడు. సోమశీల నవ్వింది. "కళ్ళు కప్పాలని నే నేం అనుకోడంలేదు. ఇన్ని సుఖాలమధ్య వున్న మనిషికి పెళ్ళాం గురించి ఆలోచించే పాటి తీరికుంటుందంటే నేను నమ్మను. అతని ఇంటిని ఆ సిని కాపలా కాయ డానికో, నలుగురిలో నా భార్యంటు చెప్పుకోడానికో ఒక ఆడది కావాలి.

ఆ ఆడది చదువుకొన్నదై వుండాలి. అందంగా ఉండాలి, గొప్పింట్లో పుట్టి నాగరికత అబ్బినదై ఉండాలి. అంటే! అతనితోపాటు క్లబ్బుల కెళ్ళాలి. బారుల కెళ్ళాలి. పరాయి మగాళ్ళతో చొరవగా ఉండాలి. అవసరం అయితే ఆ నాగరికులతోపాటుగా తాగాలి. తడ వాలి. శీనూ! పెళ్ళికి ముందు నా ప్రవర్తన గురించి తెలుసుకొనే పాటి తీరిక ఆ దేవుడికి వుండదు. ఉన్నా, నాగరికత పేర్న, సరదాగా తిరిగిందని తోసిపారేస్తాడు. అంతే! మీదు మిక్కిలి సంతోషిస్తాడు." అన్నది, జీరవడుతున్న గొంతుతో సోమశీల.

శ్రీనివాసరావుకి మాటాడ్డానికి మాటలు కరువైనాయి. సోమశీల నవ్వింది. ఆ నవ్వులో తెలీని బాధ కదిలింది.

"నన్ను చూస్తే నీకు అసహ్యంగా లేదూ?" అడిగింది శ్రీనివాసరావుని సోమశీల. శ్రీనివాసరావు సోమశీల వంక చూస్తూ చెప్పాడు.

"చేతిలో తుపాకీ వుంటే నిన్ను కాల్చిపారేసి నీ శవాన్ని ఈ సము ద్రంలో పారేయాలని వుంది!"

అతని మాటలకి సోమశీల వెక్కి వెక్కి ఏడ్చింది. కొన్ని క్షణాల తర్వాత లేచి నించుని "సెలవు" అన్నది. తరువాత మెల్లగా నడుస్తూ వెళ్ళిపోయింది సోమశీల.

శ్రీనివాసరావుకి వెళ్ళిపోతున్న సోమ శీలని చూస్తుంటే గొప్పింటి ఆడపిల్ల పులిలాటిదన్న జగన్నాధం మాటలు గుర్తు కొచ్చాయి. ఆ పులితో ప్రేమ జూదం లాటిదని గ్రహించేడు శ్రీని వాసరావు. తన కెప్పుడూ లేని దిగులు కలిగింది. ఆ దిగులుతోనే సముద్రం వంక చూస్తూ వుండిపోయాడు.



# ఎంపైర్ స్టేట్ బిల్డింగ్స్

## న్యూయార్క్

చూచుటకు వచ్చే ప్రజల సంఖ్య - రోజుకు 35,000.

పరిమాణము - 37,000,000 ఘనపుటగులు (క్యూబిక్‌ఫీట్).

ప్రతి సంవత్సరము సుమారు మిలియన్ ప్రజలు దీనిని దర్శించెదరు.

ప్రపంచములోని 8 అద్భుతములలో యిది ఒకటి. (20 వ శతాబ్దములో నిర్మించినది యిది ఒక్కటే).

నీటిపైపు (వాటర్ పైప్) పొడవు - 60 మైళ్ళు.

దీని నిర్మాణములో వినియోగించబడిన యినుము బరువు 60,000 టన్నులు. (న్యూయార్క్‌నుంచి బాల్టిమోర్ నగరమువరకు యీ యినుముతో - "డబుల్ లైన్" రైలు మార్గము వేయవచ్చునట !)

టెలిఫోన్ వైర్ పొడవు - 3500 మైళ్ళు.

6500 కిటికీలు

విద్యుచ్ఛక్తి వినియోగము - 2000,000 కిలోవాట్లు ప్రతినెలకు.

ఎలివేటర్ల సంఖ్య - 72. వాటి వేగము - 600 అడుగులనుంచి 1200 అడుగుల వరకు - నిమిషమునకు.

దీనిపైనుంచి 40 మైళ్ళ దూరమువరకు సముద్రములోని పడవలను చూడవచ్చును.

ప్రపంచములోని అన్నిటికన్నా పెద్ద టి. వి. టవర్ 1472 అడుగులు. సూర్యుడు బాగా ప్రకాశించు రోజున 80 మైళ్ళ దూరము వరకు చూడవచ్చును.

పనివారి సంఖ్య - 6,000.

అమెరికన్లకు మాత్రమే ! (మీరూ ప్రయత్నించవచ్చును).

షాకింగ్ కిస్సెస్ అన్ ది టవర్ !

—డా॥ జూలూరి పాండురంగ విఠల్

జ్యోతి

# అల్లుడి అభీష్టం

అజ్జరపు హనుమంతరావు

సాయంత్రం అయిదు గంటలైంది. పొలంనుంచి అప్పుడే వచ్చిన ఆనందరావుగారు కాళ్ళు, చేతులు, ముఖం కడుక్కుని లుంగీ చుట్టబెట్టుకుని హాల్లో కొచ్చారు, ముఖం తుడుచుకుంటూ.

"ఏమండీ యివాళ కూడా ఏమీ ఉత్తరంలేదు వాళ్ళ దగ్గర్నుంచి .." అంది, వసుంధరమ్మగారు కాఫీ అందించి భర్త మొహంలోకి చూస్తూ.

ఆయనేం మాట్లాడలేదు. మేఘావృతమైన ఆకాశంలా ఉంది. ఆయన ముఖం. వాలు కుర్చీలో కూర్చున్నారు మౌనంగా. ఆయనేదో గాఢంగా ఆలోచిస్తున్నాడని గ్రహించి మౌనంగా వంటింట్లోకి నడిచిందావిడ ...

మరో అరగంటలోనే వంటింట్లో పని పూర్తి చేసుకుని మళ్ళీ భర్త దగర కొచ్చింది వసుంధరమ్మగారు. ఆయనలో ఏ విధమైన మార్పులేదు! అలాగే స్థాణువులా కూర్చున్నాడు. ఏదో అడుగుదామని మళ్ళీ ఆ ప్రసక్తి మానుకుంది వసుంధరమ్మగారు. అడగవలసింది మాత్రం ఏముంది? తన కెంత తెలుసో ఆయనకీ అంతే తెలుసు! తనెంత బాధపడుతోందో అంతకు పదిరెట్లు మనసులో బాధపడుతున్నారాయన! తను మాత్రం పైకి వెళ్ళకక్కుతోంది - అంతే తేడా! ఆలోచిస్తూ అక్కడే కూలబడింది

"ఇదిగో! రేపొద్దున్న బండికి నేను గుంటూరు వెడుతున్నాను" నిశ్శబ్దాన్ని చీలుస్తూ హఠాత్తుగా అన్నారు ఆనందరావుగారు.

ఉలిక్కిపడింది వసుంధరమ్మగారు.

"అదేమిటి?! మీ రెందు కక్కడికి? .." అంది అయోమయంగా.

"ఎందుకేమిటి? అక్కడ పరిస్థితేమిటో! నెల్లాళ్ళబట్టి పదుత్తరాలు రాసినా జవాబు లేదుకదా! పండగ యిహ నాలుగురోజులుంది. ఎల్లుండే అందర్నీ వెంటబెట్టుకు వచ్చేస్తాను."

"బాగుంది వరస! అక్కడెవళ్ళిలా

ఉన్నారో అని మీరే అంటుంటిరి। పిల్లల కొంప్లో బాగాలేదో, అతనికే బాగాలేదో, అమ్మాయికి నలతగా వుందో ఇవేవీ తెలియకుండా, మీరు కూడా అక్కడికెళ్ళి కూర్చుంటే యీ కొంపలో నేనొక్కర్తినీ బిక్కుబిక్కులాడుతూ కూర్చోలేను బాబూ। మీతో బాటు నేనూ వస్తాను పదండి ..." అంది కచ్చితంగా వసుంధరమ్మగారు.

ఆవిడ చెప్పిందీ సబబుగానే తోచిందాయనకి. ఈ సమయంలో భార్యనొక్కర్తినీ వదలి వెళ్ళడానికి ఆయనకి మనస్కరించలేదు....

"సరే, అయితే। పెందరాళే లేచి బట్టలు అవీ సర్దు ." అన్నాడు.

ఆవిడ మనస్సు కాస్త స్థిమితపడింది।

## 2

రాత్రి పదిగంటలైంది

పేపరు మడిచి ప్రక్కనే పెట్టి నిద్ర కుపక్రమించారు ఆనందరావుగారు. మరో పదినిముషాల్లోనే గాఢనిద్రలో మునిగినట్టు ఆయన గుర్రే చెప్తోంది. వసుంధరమ్మగారికి మాత్రం నిద్రపట్టలేదు. ఏవేవో ఆలోచనలు కందిరీగల్లా ఆవిడ మనస్సు చుట్టూ పరిభ్రమించసాగాయి. కొద్దికొద్దిగా గతాన్ని స్మరించుకుందావిడ

ఉన్న ఒక్కగానొక్క కూతురికి ఘనంగానే పెళ్ళిచేసి కాపరానికిపంపి అప్పుడే పదేళ్ళవుతోంది. అల్లుడు కూడా ప్రస్తుతం చెప్పుకోతగ్గ స్థితిలోనే వున్నాడు. ఈ పదేళ్ళలోనూ అల్లుడు, కూతురు ముగ్గురు పిల్లలోటి పండుగలకని పబ్బాలకని పాతిక, ముప్పయిసార్లైనా వచ్చుంటారు। వాళ్ళొచ్చిన పదిరోజులు ఇల్లు పెళ్ళివారిల్లులా కలకలలాడుతూ ఉంటుంది. వచ్చినప్పుడల్లా అల్లుడుగార్ని ఘనంగానే సత్కరిస్తూ వచ్చారిన్నాళ్ళూను। ఇక ముందూ అంతే। "అతనికి మాత్రం ఎవరున్నారు చెప్పు। తల్లి, తండ్రి అన్నీ మనమే। మనకీ అదొక్కర్తే నలుసు। దాని కడుపు పండి అందరూ చల్లగా ఉన్నారు అదే మనకి పదివేలు ..." అంటూంటాడాయన. అల్లుడి కూడా తామంటే ఎంతో ఆపేక్ష। అటువంటిదీసారి ఇలా ఎందుకు జరిగింది ? పండక్కి రమ్మని అప్పుడే పదుత్తరాలేనా రాసుంటాయి : ఒక్కదానికి జవాబులేదు। కారణం తెలీక ఇరవై రోజులబట్టీ ఇద్దరూ సతమతమై పోతున్నారు. పోనీ ఏవైనాకోపం వచ్చిందా అంటే వాళ్ళకెప్పుడూ తెలుసున్నంతమటుకు ఎలాంటి లోపం జరగనివ్వలేదు. అలాంటప్పుడు ఎందుకూ కోపం? కూతురు అల్లుడిమీద విసుగు పుట్టిందా క్షణంలో వసుంధరమ్మగారిక్కి. 'ఒకవేళ ఎవళ్ళ కొంపలోనేనా గట్టి సుస్తీ చేసిందేమో। తెలియపరిస్తే బెంగ పెట్టుకుంటామని వూరుకున్నారేమో। పాపిష్టి దాన్ని అనవసరంగా విసుక్కున్నాను ...' అని తనలో తను అనుకుని, 'రేపెల్లాగా వెడుతున్నాంగా ..... అన్నీ తెలుస్తాయి ...' అని సమాధానపడింది.... ఆలోచిస్తూనే ఎప్పుడో నిద్రలో కారి




గించి, వసుంధరమ్మగారు.

## 3

గుంటూరు స్టేషన్లో బండి ఆగీ ఆగడంతో ప్లాటుఫారంమీద కూతురు, పిల్లల్ని చూసి ఆశ్చర్యపోయారు ఆనందరావు దంపతులు.

"మీ ఉత్తరం మధ్యాహ్నం ఆఫీసు కొచ్చిపట్టింది. వెంటనే స్టేషన్ కెళ్ళమని కబురు పంపారు మీ అల్లుడు! ఆఁ అన్నట్టు సామానేమీలేనట్టుంది. ఆ పెట్టె ఇలా ఇవ్వవే అమ్మా .." అంటూ తల్లి చేతిలోంచి చిన్న తోలు సూటుకేసు అందుకుంది విజయలక్ష్మి.

పిల్లలు ముగ్గురు తాత, అమ్మమ్మల చేతులు పట్టుకుని ముందుకు నడిపించారు. ఇద్దరికి అంతా అయోమయంగా ఉంది! "అవునుగాని, ఏవేఁ విజ్జీ ఇదేం వరసే అమ్మా! ఉత్తరంముక్క రాసుకోరూ? హడిలి చచ్చాం! అల్లుడేవైనా అలిగాడా-ఏవిఁటి కథ?! ..." అంటూ సాగదీసింది వసుంధరమ్మగారు. నడుస్తూనే కూతురేం చెప్తుందోనని చెవులు రిక్కించారు ఆనందరావుగారు. "యింటి కెళ్ళాక మాట్లాడుకుందాంలేవే అమ్మా.. " అంది విజయ ముభావంగా. అంతా బయటికొచ్చి టాక్సీ ఎక్కారు

## 4

సాయంత్రం ఏడుగంటలైంది ....

"ఏవేఁ విజ్జీ అల్లుడెన్ని గంటలకొస్తాడేవిఁటి? .." అన్నారానందరావుగారు వంటింట్లో కొచ్చి. పిల్లలికన్నం పెడుతోంది విజయ. వసుంధరమ్మగారు ఆ పక్కనే కూర్చుని కూతురితో కబుర్లుచెబుతోంది. "ఎనిమిదవుతుంది నాన్నా! మీరు కూడా వచ్చేస్తారేవిఁటి? ప్రొద్దున ఎప్పుడు

భోంచేశారో ఏమో(! అమ్మా! నువ్వు కూడా రావే! మరేం ఫరవాలేదు. ఆయన నేనూ తర్వాత తింటాం ..." అంది విజయ.

"హవ్వ! అప్రతిష్ట! అతను రాకుండా మేం భోజనాలా? అయినా అసలు సంగతేవిటంటే అంటే కప్ప దాట్లు వేస్తావేం? ఉత్తరం రాయక పోవడానికి కారణం ఏవిటంట? మీ క్యాంపలసిం దేవిటో చెప్తే మేం కాదంటామా? సాయంత్రం నుంచి అడుగుతుంటే మాట తప్పిస్తావుకాని అసలు విషయం చెప్పవు..." అంది వసుంధరమ్మగారు విసుగ్గా.

"అవునమ్మాయ్! మీ మనసులో మాట ఉత్తరంలో నేనా రాయొచ్చుగా! అసలు సంగతేవిటి? " అన్నా రానందరావుగారు, ప్రక్కనే పీట వాల్చుకుని కూర్చుంటూ, తాపీగా.

"ఎప్పటికప్పుడు ఉత్తరం రాద్దా మనే నా ఉద్దేశం నాన్నాయా! కాని ఆయన పడనిస్తేగా! తీరారాస్తే ఆయన కోరింది మీరు కాదంటారేమో నీ ఆయన అనుమానం...."

విసుక్కోయా రానందరావుగారు.

"అదేవిటే!! మీ కేది ఎప్పుడు కావాలంటే నేను కాదన్నాను? నా ఆస్తి అనుభవించడానికి మీరు కాక ఇంకెవ రున్నారు? అయినా నేను కాదంటా నన్న అనుమానం అతని కెలా వొచ్చింది? ఇంతకాలం నుంచి మమ్మల్నింతే అర్థం చేసుకున్నా రన్నమాట " బాధగా అన్నా రాయన.

మళ్ళీ గొంతు సవరించుకుని ఆయనే అన్నారు .

"ఇంతకీ అతని క్యాంపలసిం దేవిటట? "

"ఆ విషయం నన్ను మాత్రం చెప్పొద్దని ఒట్టు కూడా పెట్టారు, మధ్యాహ్నం మీరు వొస్తున్నారని, స్టేషను కెళ్ళమని రాసిన ఉత్తరంలో " అంది, విజయ పిల్లలకి మజ్జిగపోస్తూ,

"బాగానే ఉంది " మూలిగింది వసుంధరమ్మగారు.

ఆనందరావుగారేం మాట్లాడలేదు. అల్లుడేదో పెద్ద ఎత్తుమీదే ఉన్నాడని మనసులోనే అనుకున్నారు. కాని అల్లుడి ప్రవర్తనకి బాధపడ్డా రాయన. పిల్లలు భోజనాలు పూర్తిచేసి వాళ్ళ గదిలోకి పోయి చదువుకుంటూ కూర్చున్నారు.

## 5

ఎనిమిది గంటలైంది.

ప్రకాశరావు రావడంతో మామూలు పలకరింపులు, యోగక్షేమాలు పూర్తయ్యాయి. సాధారణంగా వసుంధరమ్మగారు అల్లుడితో ఎక్కువ మాట్లాడరు. ఈసారి ఆనందరావు కూడా మనసారా అల్లుణ్ణి పలకరించలేక పోయారు. ప్రకాశరావు మాత్రం మామూలుగానే వున్నాడు. కూతురు, అల్లుడు ఒకర్నొకరు చూసుకోవటం చాటుగా నవ్వుకోవడం వసుంధరమ్మ గారు పసిగట్టింది. ఆవిడ ఒక



మండింది కూడాను।

భోజనాలైనాక మామా, అల్లుళ్ళిద్దరూ ఇష్టాగోష్టిగా కూర్చున్నారు. ఆ మాటా, యీ మాటా అయినాక ఆనందరావుగారన్నారు....

"ఏవోయ్। ఈసారి మా ఇంటికి రాదల్చుకోలేదా? ఉత్తరం పత్తరం రాయకపోవడంతో ఎవళ్ళకెలా వుందోనని ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకొనొచ్చాం..। విషయమేంటో ఉత్తరంలోనేనా రాయొచ్చుగా ..."

"అవుననుకోండి। అయినా ఉత్తరం రాస్తే మీరు అశ్రద్ధ చేస్తారేమోనని.." నసిగాడు ప్రకాశరావు.

"ఎంత మాటన్నావోయ్। నువ్వు నోరు తెరిచి అడగడం, నేను అశ్రద్ధ చెయ్యడమూనా? మీ ఆనందంకోసం కొండమీద కోతినయినా తీసుకు రావడానికి వెనుకాడను। నా సంగతి నీకు తెలియంది కనకనా "

"అది నిజమేననుకోండి। ఇది నా ఒక్కడి కోరిక కాదు సుమండీ। మీ అమ్మాయి కూడా అంతో యింతో భాగం ఉంది. ."

"ఇంతకీ అసలు సంగతేవిఁటోయ్

మహానుభావా...."

"చెప్తాను వినండి .. మా పెళ్ళయి పదేళ్ళయింది! అవునా? ఇన్నేళ్ళూ మమ్మల్ని ప్రతిపండక్కీ ఆహ్వానించి యథావిధిగా సత్కరించి మీ దానం దిస్తున్నారు: మీ షష్టిపూర్తి అయిన మొదటి పండుగ యిది! ఒక విధంగా మీ రిప్పుడు క్రొత్త దంపతులన్న మాట! అలాంటప్పుడు మిమ్మల్ని పండక్కి ఆహ్వానించి బట్టలవీఎవరు పెడతారు? అందుచేత మీ దంపతు లిద్దర్నీ మా యింటికి రప్పించి సన్మా నించి ఆనందించాలని మీ అమ్మాయి, నేను ఏకగ్రీవంగా తీర్మానించుకున్నాం! ఈ సంగతి మీకు రాస్తే మీరు రావ డానికి ఒప్పుకోరు సరిగదా, తేలిగ్గా తీసి పారేస్తారు. అప్పుడు మా సరదా ఎలా తీరుతుంది చెప్పండి! మీ ఉత్త రాలకి జవాబు రాయకపోతే కంగారు పడి మీ రిద్దరూ వస్తారని మాకు తెలుసు....మిమ్మల్ని రప్పించడానికే యింత నాటకం ఆడాం తప్పయితే క్షమించండి మీమనవలు మిమ్మల్ని స్టేషన్లోనే సాదరంగా ఆహ్వానిం చారు....యిప్పుడు మీరు గాని మమ్మల్ని కాదని పండగ ఇక్కడ జరుపుకుని మా సత్కారా లందుకోకపోతే, ఇక మీ ఇంటికి మే మెప్పుడూ రానే రాం ." అన్నాడు ప్రకాశరావు చిరు నవ్వు నవ్వుతూ

"అవును . అంతే ." అంది విజయలక్ష్మి తమలపాకులతో లోపలికి వస్తూ ..

ఆనందరావుగారి కళ్లు ఆనందంతో చెమర్చాయి "హరి మీ .మొత్తానికి భలేవారే ." అంటూ గట్టిగా నవ్వి, గొంతు సవరించుకుని, "ఇదుగో.... ఏమేవ్! ఇది విన్నావా... వాళ్లు " అంటూ భార్యని పిలవబోయాడు.

గోడ పక్కనించి సంగతంతా విన్న వసుంధరమ్మగారు ముసిముసి నవ్వు నవ్వుతూ ప్రక్కకి తప్పుకో బోయేసరికి.

"అదేమిటే అమ్మా! అంత సిగ్గ యితే ఎలాగే .. కొత్త పెళ్ళికూతు రిలా!? మీ అల్లుడు గారేలే ..... ఇలా రా "

అంటూ పకపకా నవ్వింది విజయ లక్ష్మి. ఆమెతో శృతి కలిపారు మామా అల్లుళ్ళు! ఏం చెయ్యాలో తెలియక వసుంధరమ్మగారు కూడా ఆఖరికి నవ్వేసి ఊరుకుంది

□□□



# పనికొచ్చే పరిజ్ఞానం

- భారతదేశంలో 500 పైగా అడవి మృగజాతులు, 1200 పక్షి జాతులున్నాయి.

* * *

- మానవుడు అంతరిక్ష ప్రయాణాలు మొదలుపెట్టి ఎనిమిదిన్నర సంవత్సరాలయింది. ఈ ప్రయాణంలో 37 వది అపోలో 12. ఇంతవరకు అమెరికన్ వ్యోమగాములు 21 సార్లు, రష్యను వ్యోమగాములు 15 సార్లు అంతరిక్షంలో ప్రయాణం చేశారు. ఇందులో పాల్గొన్నవారు 44 మంది స్త్రీ పురుషులు. అమెరికన్లు 23 మంది, రష్యనులు 21 మంది.

* * *

- వయోవృద్ధుని శరీరంలో సగటున ఎనిమిది లేక పది పింటుల రక్తముంటుంది. ఆ రక్తంలో 70 శాతం నీరు ఉంటుంది. (పింటు—12 ఔన్సులు).

* * *

- ఈనాడు వాడబడుతున్న 52 ముక్కల "పేక" ను తొలిసారిగా ఉపయోగించినవారు "ఫ్రెంచివారు".

* * *

- విశ్వంలో అతి విషకరమైన జంతువు "యారోపాయిజన్ ఫ్రాగ్". ఇవి ఎక్కువగా కొలంబియాలో ఉంటాయి.

* * *

- గడియారాన్ని 400 సంవత్సరాల క్రితం "బర్గండ్" వాసులు కనిపెట్టారు. మొదట గడియారాన్ని మెడకు తగిలించుకొని తిరిగేవారు. కాలక్రమేణా నాగరికత పెరిగి మణికట్టు (ప్ర) దగ్గర కొచ్చిందా గడియారం.

సేకరణ ఎమ్. గోవిందరాజ్




ఏపుగా పెరిగిన మామిడిచెట్లూ, కొబ్బరిచెట్లూ, పిచ్చి మొక్కలూ ఆ ప్రాంతాల్ని అడవిగా మార్చేశాయి. రాత్రి వెన్నెట్లో ఆకుల గలగల తప్పిస్తే మరో సవ్వడి

వుంటాడు. వారం రోజుల కొకసారి మాత్రం అప్పుడప్పుడు నక్కల గోల వినబడుతుంది. ఈ మధ్య అదీలేదు. ఆ అడవి మధ్య—నల్ల చెరువులో తెల్ల కలువలూ—ఓ చిన్న తెల్లని డాబా. ఆ డాబాలో ఓ భార్యా - ఓ భర్తా. ఆ ఇంటి ముందు బాగా తర్ఫీదైన సిపాయిల్లా రకరకాల పూలమొక్కలు. గర్వంగా ఠీవిగా నిలబడ్తాయి వెన్నెల్లా తెల్లగా నవ్వుతాయి ఇంద్రధనుస్సులా రంగులు వెదజల్లుతాయి. ఆ పువ్వులు వెన్నెల్ని పరిహసిస్తాయి. చీకట్ని అపహసిస్తాయి

ఆ అడవిలోని ఇంటికి — సుమారు ఆరు మైళ్ళ దూరంలో మరో అడవి వుంది. ఈ అడవి సామాన్యమైన అడవికాదు నిజం చెప్పాలంటే అదో మహారణ్యం. కారుణ్యం లేని జీవాలకి లావణ్యం లేని మనసులకి అది ఆల వాలం. డబ్బు దండిగా సంపాదించి మదించిన ఖద్దరు గ్రాలకీ, కంట్రాక్టుల్లో ఒకే దెబ్బకి రెండు పిట్టలన్నట్టు అటు ప్రజల్నీ ఇటు ప్రభుత్వాన్నీ ఒకేసారి మోసంచేసే గుంటనక్కలకీ, లంచాలు మరిగి విద్యుక్త ధర్మాలు మరిచిన ఉద్యోగులకీ, కడుపుకోసం మానాభి మానాలు మరిచిన దగాపడ్డ గొర్రెలకీ రోగి బాగు' కాక వాడిచ్చే ఫీజుమీద దృష్టి లగ్నం చేసే పులి వేషాల భిషగ్వరులకీ ఎక్స్‌గారి పిలకా వైగారి పిలకా ఎవడో ముడి వేస్తే—ఆ ముళ్ళ మీద పడి బతికే ప్లీడరు తోడేళ్ళకీ, నిత్యజీవితావసర వస్తువుల్తో టోకున బ్లాకు వ్యాపారం చేసే వ్యాపారి జల గలకీ పేదరికంలో మగ్గుతూ ఓవర్ నైట్ లక్షలు సంపాదించాలన్న పేరాశతో కానికూడా కక్కుర్తిపడే కాకులకీ — ఇతరేతర క్రిమి కీటకాలకీ ఆ మహారణ్యంలో చాలా పెద్ద స్థానాలే వున్నాయి. అయితే, అందులో అతి మంచి హంసలూ—ఎంతో చక్కని పావురాలూ లేకపోలేదు. కాని అవి అరుదు. అక్కడ జీవితం ప్రళయ సదృశ్యమైన వేగంతో గిర్రున తిరిగి పోతూ వుంటుంది. చెవులు చిల్లులు పడేట్టు మోత పెట్టే రైళ్ళూ-గర్జిస్తూ ఎగిరే విమానాలూ—బుస్సుమనే ఫేక్టరీ గొట్టాలూ—రొదచేసే బస్సులూ — కార్లూ — స్కూటర్లూ — మోటార్ బైకులూ అక్కడి జీవిత వేగాన్ని తెలుపుతాయి.

* * *

ఆ మహారణ్యంలో ఒక మారు మూల గదిలో — ఇరుకు అరలో ఓ పరంధామయ్య ఏభై ఏళ్ళుగడిపేడు. ముప్పయ్యేళ్ళు ఆ అరణ్యంలోని ఓ ఫేక్టరీలో స్క్రూలా జీవించేడు. అలా జీవించగా వొచ్చిన సంపాదన పైసా పైసాగా కూడబెట్టేడు. అది మెల్లిగా ఓ ఇరవై వేలవగానే స్వంత ఇల్లు కట్టుకుందామని జాగా కోసం ఆ అడవిలో కాకిలా తిరిగేడు, ఓనాడు వుత్తనే దానంగా యిచ్చినా ఎవరికీ అక్కర్లే స్థలం—ఇప్పుడు గజం ఏభై అరవై రూపాయలు. అయినా సరే తిరిగేడు తిరగ్గా తిరగా వున్న వూరికి ఆరు మైళ్ళ దూరంలో మరో చిన్న అడవిలో చవగ్గా జాగా దొరికింది. అయితే, సహజ సిద్ధమైన అడవి ఇది. ఇక్కడ మామిడిచెట్లూ, సరుగుడుచెట్లూ













పరిమితమైన కుటుంబం — సుఖప్రదమైన కుటుంబం

కాటిచెట్లూ కొబ్బరిచెట్లూ వున్నాయి. అయిదో ఆరో పావురాలూ, ఒకటో రెండో చిలకలూ, పదో పదిహేడో కాకులూ. ఏభయ్యో అరవయ్యో పిచి కలూ, రెండు కుక్కలూ, ఒక పాలిచ్చే ఆవూ అక్కడున్నాయి. వెంటనే జాగా కొని పరంధామయ్య డాబా యిల్లు కట్టించేడు. ఆవుకి ఓ చిన్న పాక ఏర్పాటు చేసేడు. ఇంటిముందు పూల తోటా — ఇంటి వెనక కిచెన్. గార్డెన్ పెంచేడు.

* * *

అతని స్నేహితులూ-కొంతమంది పరిచయస్థులూ గుసగుసలు పోయేరు. నవ్వుకున్నారు. మరీ బడుద్ధాయిలు కొందరు అతని ముఖాన్నే 'నువ్వు పిచ్చివాడివి' అన్నారు.

అయినా పరంధామయ్య ఏమీ బిడియపడలేదు. ధైర్యంగానే ఎదిరించేడు.

'నేను గాదు; మీరే పిచ్చివాళ్ళు. డబ్బే పరమావధిగా ఇతర విలువలు విస్మరించే వెధవల మధ్య నేను బ్రతక లేను. ఇన్నాళ్ళూ ముక్కు మూసుకొని ఆ కంపు మధ్య ఆ కళ్మలం మధ్య నిలబడ్డాను. ఇక చాలు. ఏభై ఏళ్లు బతికేను. ఇంకో ఏభయ్యేళ్లు ఖచ్చి తంగా బ్రతికే తీరుతాను. నాకు పిల్ల ల్లేరు. బంధువుల తండా ఏదీలేదు. నేనూ నా ఇంటిదీ సుఖంగా ప్రశాం తంగా సహజంగా బ్రతుకుతాం. ఇంటి ముందు పూలతోట కళ్ళకి విందు చేస్తుంది. ఇంటి వెనుక దొండపాదూ, బెండ మొక్కలూ, చిక్కుడు తీగ నోటికి విందు చేస్తాయి. ఆవు చక్కని పాలూ పెరుగూ యిస్తుంది. నెలకోసారి ఏ గోపాలపట్నమో సింహాచలమో వెళ్ళి ఇన్ని బియ్యం గింజలు తెచ్చు కుంటాను. నా కింకేం లోటు? హాస్పి టల్ పని మీద ఎవడూ మా యింట్లో తిష వెయ్యడు. తిరుపతి వెళ్ళా 'ముద' కోసం వాల్తేరులో బ్రేక్‌జర్నీ చేసి నా యింటిమీద ఎవడూ పడ్డు! ఆంధ్రా పేరిస్ అనుకుని పరీక్షల నెపంతో సిని మాలు చూద్దామన్న వెధవాయిలకి వీలు చిక్కదు. ఏం? ఎందుకని? మీ మహాపట్నంకి మా ఇల్లు ఆరు మైళ్ళ దూరం. సరైన బస్సులేదు. నడిచి వొద్దామంటే — మీ సుకుమారం నాకు తెలీదూ? అందుకే ఇంత దూరం వొచ్చి ఈ అడవిలో ఇల్లు కట్టుకున్నాను. నా సుఖం చూసి ఏడవండి. మీ దుర దృష్టం!' — అని వాళ్ళ నోళ్ళు మూయించేవాడు పరంధామయ్య.

* * *

డాబా ఇంట్లో గృహప్రవేశం చేసిన నాడు పెద్ద రిలీఫ్ పొందేడు. భార్య సరస్వతికి ఇంట్లోని ప్రతి మూల పదే పదే చూపించి మురిసిపోయేడు. గులాబీ అంట్లు నాటి అవెంత కాలానికి పుష్పిస్తాయో లెక్కలు వేసి చెప్పే వాడు. పెరట్లో బెండవిత్తులూ, బీర విత్తులూ, దొండపాదూ వేసి వాటి ఎదుగుదల కోసం వెయ్యి కళ్ళతో ఎదురు చూసేవాడు. చిక్కుడు తీగకి కాయలు పట్టగానే జాగ్రత్తగా కోసి

స్వహస్తాలతో భార్య చేతికి అందించే వాడు. సరస్వతి అవి తరిగి కూర చేసేదాకా దగ్గరుండి మరీ మురిసి పోయేవాడు....వుదయం లేవగానే కాల కృత్యాల్తోనే తోటపనితో నిమగ్నమై పోయేవాడు. మధ్యాహ్నం భోజనం కాగానే చిన్న నిద్ర....సాయంకాలం పూల మొక్కల సంరక్షణ....కొంత సేపు కాగానే భోజనం....తర్వాత చదువు....ఆనక నిద్ర....!

◆ ◆ ◆

ఓనాడు సాయంకాలం ఆరవుతూంది చీకటి అంతటా ఆవరించింది. చిరువెలుగు పరుచుకున్న పరిసర ప్రాంతాల్లో దక్షిణ పవనాలకి పూల మొక్కలు లయబద్ధంగా తలలూపుతున్నాయి. ముందరుగు మీద వాలు కుర్చీ వేసుకుని ఎదురుగా వున్న పూల మొక్కల్ని పరిశీలనగా చూస్తున్నాడు పరంధామయ్య....గులాబీ అంటు పెద్దదైంది. నల్ల గులాబీలు రెండు, తెల్ల గులాబీ ఒకటి, ఎర్ర గులాబీలు నాలుగు—ఆ మూల ఎంత అందంగా వున్నాయని! సన్నజాజి పందిరి విరగ బూసింది. మల్లెలు నవ్వుతున్నాయి. గులాబీచెట్టు గుబాళిస్తోంది. సంపెంగలు చల్ల గాలితో సరసమాడు తున్నాయి. ఆ పూల పరిమళాలు....వాటిరంగులు... పరంధామయ్య కళ్ళముందు ఏదో అలౌకిక స్వప్నాన్ని సృష్టిస్తున్నాయి. అరమూత కళ్ళతో ఆ సౌందర్యాన్నంతట్నీ మనోనేత్రాన్తో జుర్రు

కోవడం ప్రారంభించేడు. అతని కళ్ళ ముందు రంగు రంగుల పూల బాలల వయ్యారాల కదలికలు....దూరంగా శ్రవణపేయంగా వినబడే కొబ్బరాకుల సరాగాలు....కొండల మీంచి వచ్చే వాలుగాలి అందమైన విసుర్లు.... అవిశ్రాంత సంగీతంలా రూపం దాల్చిన సౌందర్య జలధిలో అతని మనస్సు తలమున్కలై పోసాగింది....

"ఏమండీ!"

..................

"ఏమండీ!"

విసుగ్గా చూసేడు పరంధామయ్య. భార్య సరస్వతి గుమ్మానికి ఆనుకుని నిలబడుంది....ఎన్నో ఏళ్ళ తపస్సు భగ్నమైన మౌనిలా ఖేదపడ్డాడు.

"ఏమిటి?" అన్నాడు.

"ఫలహారం అయిపోయిందీ...."

"అదేం. బియ్యం అప్పుడే అయిపోయేయా?"

"మీపిచ్చిగాని-బియ్యం అయిపోతే ఫలహారం చెయ్యడమేమిటి? మర్చిపోయినట్టున్నారు....ఇవేళ శనివారం!"

"ఓహో ...అవునవును...."

"అమ్మయ్య. ఇప్పుడన్న మాట ఈ లోకంలోకి వొచ్చేరు...." అంది సరస్వతి. అతనికి కాస్త దగ్గరగా వచ్చి

"అవును సరూ....అలా చూడు. ఎంత అందాన్ని సృష్టించేం మనం! ఈ పువ్వులు ఈ ప్రకృతి ఈ వెన్నెలా ఈ చల్లగాలి....ఇదంతా మనదే!"

సరస్వతి నిశ్శబ్దంగా నవ్వుతుంది.

"ఇలా వీట్ని చూస్తూ జీవించడం కూడా మర్చిపోగల్ను!" అన్నాడు పరంధామయ్య సంతృప్తిగా.

"మీకొక్కవల్సింద దేగా!"

"అవును. అదే. రచ్చలకి. రాజకీయాలకీ, వేషాలకీ, ద్వేషాలికీ దూరంగా వుండాలి. అదే నా కోరిక. నా జీవితాంతం అలాగే గడపాలని నా ఆశ."

ఎదురుగా వున్న పూల మొక్కలు చూస్తూ మౌనంగా నిల్చొంది సరస్వతి.

"ఏమండీ"

"వూ("

"ఇవేళ శనివారం...."

"అవును. ఆ సంగతి ఇందాకే చెప్పేవు.."

"అది కాదంటి"

"మరేం?"

"ఇవాళ శనివారంగదా — స్వామి పూజ చేద్దామండదండీ...." అంటూ సుకుమారంగా అంది సరస్వతి.

"ఓ—అలాగే కానీ. నీ పూజలకి నే నెప్పుడూ అడ్డు లేదే! నా నమ్మకం నాది. నీ నమ్మకం నీది. నాకు పూజా పునస్కారాల మీదా, దేవుడి మీదా నమ్మకం లేనంత మాత్రాన....

నీ పూజలకీ నీ భక్తికీ అడ్డు వస్తానా ? కానీ...."

"అది కాదండీ...."

"మరేదండీ :" పరంధామయ్య వెక్కిరింపుగా.

"మరి...."

"వూఁ....మరి....? అగరొత్తు లేవా ? హారతి కర్పూరం లేదా ? చెప్పు ఏమిటి ?"

"అన్నీ వున్నాయిగాని మీఅనుమతి కావాలి ..." నసుగుతూ అంది సరస్వతి.

"ఇచ్చేనుగా...."

"పూజకి కాదు...."

"మరి దేనికి ?"

"మనం పట్నంలో వుండేటప్పుడు పూలుకొని పూచ్చేసేవాన్ని ....ఇప్పుడు సంపెంగల్తోనూ గులాబీల్తోనూ దేవుడి పటం అలంకరించాలని కోరిగ్గా వుందండీ...."

"సారీ, సరస్వతీ దేవిగారూ !" అంటూ ముఖం మరోవేపు తిప్పేశాడు పరంధామయ్య.

సరస్వతికి భర్త నైజం తెలుసు. అతను అవునంటే అవునే. కాదంటే ముమ్మాటికీ కాదు !

"అదేంటండీ . రావాని కొక్క సారి.... దేవుడి పూజకి ఆదీ అయిదో ఆరో పువ్వులు....అంతేగదా...."

పరంధామయ్య సమాధానం ఇవ్వకుండా బిగుసుకుపోయి కూర్చున్నాడు.

"సర్లేండీ....మీరెప్పుడు మాత్రం నా మాటకి అవునన్నారు గనుక !" ఆఖరి అస్త్రం నిష్ఠూరంగా ప్రయోగించింది సరస్వతి.

అయినా కిమ్మన్లేదు పరంధామయ్య.

ఓ నిమిషం అలాగే నిలబడింది.

"పోనీ ఒక్క ఎర్రగులాబీ కోస్తానండీ !"

"సరస్వతీ ! !"

ఉలిక్కిపడింది సరస్వతి. భర్త మొహంలోకి చూసింది. ఎక్కడో ఏదో పుస్తకంలో ఎప్పుడో చూసిన పులిబొమ్మ గుర్తుకొచ్చింది ఆమెకి. పరంధామయ్య కళ్లు క్రోధంతో మిలమిలా మెరుస్తో గుచ్చి గుచ్చి చూస్తున్నాయి. దవడ మీది కండరాలు వుబ్బేయి. భ్రుకుటి ముడిపడింది.

అంతే !

ఆ తర్వాత మళ్ళీ ఎన్నడూ పువ్వుల సంగతి ఎత్తలేదు సరస్వతి. కాని పువ్వుల తలపుల్ని మాత్రం తన గుండె మారుమూలల్లో దాచి భద్రంగా తాళం వేసింది.

• • •

ఓ రోజు పరంధామయ్య గోపాలపట్నం వెళ్లేడు సాయంకాలం అయిదుగంటలల్లా బయల్దేరినవాడు ఇంకా తిరిగి రాలేదు.... వంట పూర్తి చేసు

కొని వీధి గడపలో కూర్చుంది సరస్వతి.

ఆకాశంలో చంద్రుడు నిండుగా వెలుగుతున్నాడు. గులాబీల గుబాళింపు, మల్లెల మధుమలు, సన్నజాజుల పరిమళాలు వాతావరణాన్ని సుగంధపూరితం చేస్తున్నాయి. కొబ్బరాకుల మీది చంద్రకాంతి నేలమీద పడి ముక్కలౌతోంది. సరుగుడు చెట్లు విరహాభిసారికల్లా అసహనంగా కదుల్తూ- అవ్యక్తాలాపనల్ని గాల్లోకి ప్రసారం చేస్తున్నాయి.... ఎక్కడో కొండ శిఖరం మీద ఎవరివో వేణువులు....

సరస్వతి లేచి పూలమొక్కల వేపు నడిచింది. బారులు తీరిన పూలబాలల మధ్య.... వెన్నెల విసిరిన వేడి వెలుగులో.... సరస్వతి నిలబడింది. మరికాస్త నడిచి కొబ్బరి మానుకి చేరబడి దృష్టి మీదకి సారించింది.... వెన్నెల వెలుగులో నాచు రంగు చెట్లు, బూడిదవర్ణంలో కొండ, కొండమీద చంద్రబింబం.... ఆమె హృదయంలో అమృతం కురిపించేయి. కొండమీది గాలి తాకిడి ఆ అమృతాన్ని శీలతరం చేసింది. వున్నట్టుండి ఒక్కసారి బద్ధకంగా ఒళ్లు విరుచుకుంది సరస్వతి.... గ్ర్రున కాలం వెనక్కి తిరిగినట్టూ- పోయిన మధుభాండం దొరికినట్టూ అన్పించిన దామెకి!

'ఈ సౌందర్యాన్ని నేను చూసి భరించలేను. కేవలం చూపుల్తోనే ఇది నాది అని సంతృప్తి చెందలేను. ఈ సౌందర్యాన్ని అనుభవించాలి. ఈ పూలు నా జడలో నక్షత్రాలవ్వాలి. ఈ గాలి నా ఒంటికి గంధ పూత పూయాలి. ఈ నిశబ్ద సౌందర్య సంగీతం నా గుండెల్లో రవళించాలి....' అనుకుంది ఆ ప్రౌఢ.... ఆ సౌందర్య పిపాసి.

ఎన్నడూ లేని సౌందర్యదాహం ఆమెని వుద్రేక పరచసాగింది ఆ తృష్ణ గడియగడియకీ, గంట గంటకీ అధికమై అపరిమితమై పోసాగింది.

మూడు పదులు దాటని వయసామెది. పిల్లలు లేకపోవడం మూలాన బిగువు తేరిన తనువామెది ఆరోగ్యంతో నిగనిగలాడే బ్రతుకామెది. ఆకాశనీలం పట్టుచీరా- వంగపండు రంగు జాకెట్టూ ధరించిన సరస్వతి ... కేవలం ఒక స్త్రీ మాత్రమే కాదు. శృంగార రసాధి దేవత. ఆమెలో అందం వుంది. అవయవ సౌష్టవం

---

● కోపిష్ఠితండ్రి : పెళ్ళి కావలసిన ఆడపిల్లను తెల్లవారుజాము మూడు గంటలకు యింటిదగ్గర దిగవిడవడంలో నీ వుద్దేశ్య మేమిటి! !

ప్రేమికుడు : సార్, మరేంలేదు. నేను 7 గంటలకల్లా ఆఫీసుకు పోవాలి అందుకని...."

వుంది. కనుముక్కు తీరూ వుంది. ఆ అందాలపోపుకి సౌందర్య రాసి అంటే మక్కువ ఎక్కువే!

ఎదుగుగా ఎన్నో పూలు.... రక రకాల పూలు .... రంగు రంగుల పూలు....సువాసనలు వెదజల్లే సుగంధాలు విరజిమ్మే శృంగార కుసుమాలు....

కాని.... కాని....

చంద్ర బింబాన్ని కప్పిన మబ్బులా ఏదో దిగులు ఆమె గుండెలో ఆవరించింది. అంతలోనే ఏదో ధైర్యం ఆ దిగులు మేఘాన్ని సమీరకుమారుడిలా పారద్రోలింది.... భర్త మాటలు మస్తిష్కంలో మెదిలేయి. అతనెంత మంచివాడో అంత చండశాసనుడు. పూలు కోయడానికి వీల్లేదంటే— అంతే! దానికి మరి తిరుగన్నది లేదన్నమాట!

కాని. పరవశంతో పరవళ్లు తొక్కే ఆ అందాన్ని చూడకుండా కళ్ళు మూసుకోవడమెలా? తీరా చూసి, ఆ అందాన్ని ఆస్వాదించకుండా వూరుకోవడమెలా?

అలనాడు....అల్లవేళ...అభంశుభం ఎరుగని రోజుల్లో.... ఈ సరస్వతికి పదహారేళ్ళ పరువం అంకురించిన తొలిఘడియల్లో.... ప్రకృతి ఎంత కనికరించిందో! ఎంత ఓదార్చిందో- ఎంత సేద తీర్చిందో!

తల్లి వారానికొకసారి మొగలి రేకుల జడ కుట్టేది. తనివితీరా మెరిసే కళ్ళతో చూసి, పొంగారే బుగ్గల్ని తన్మయంగా ముద్దుపెట్టుకొని 'నా బంగారు తల్లికి ఎలాంటి మొగుడొస్తాడో.' అని మురిసిపోయేది. ఆ మాతృమూర్తి ఏనాడూ ఏ రోజూ పువ్వులు లేని జడ సరస్వతికి వుండేది కాదు. సంపెంగలు, పొగడలు, చేమంతులు, బంతులు ఆయా కాలాల్లో ఆయా ఋతువుల్లో ఎప్పుడూ సరస్వతి జడకి సొగసిస్తూ వుండాల్సిందే! పూలే జీవితంగా— జీవితమే పూలుగా సాగిపోయిందామె బాల్యం అంతా!

సరస్వతికి పద్దెనిమిది వసంతాలు నిండేయి. పూర్తి యవ్వనం పొటమరించింది! పసిమి దేహం అందమైన వంపులు సంతరించుకుంది. ముఖంలో, చెంపల్లో, బుజాలో, కళ్లలో స్త్రీత్వం అంకురింపసాగింది. ఇపుడు సరస్వతి ఎదిగే లత. సరైన జంటకోసం అన్వేషణ ప్రారంభం అయింది. సరస్వతి తండ్రి కాళ్ళకు బలపాలు కట్టుకొని తిరిగేడు.... ఆఖరికి పరంధామయ్య దొరికేడు. అప్పటికి పరంధామయ్యకి ముప్ఫయ్యేనిమిదేళ్ళు దాటేయి. మొదటి భార్య నిస్సంతుగా అప్పటికి రెండేళ్ళ కిందటే చనిపోయింది. అయినా సరస్వతి తండ్రి సందేహించలేదు. వరుడు బుద్ధిమంతుడు. ఆరోగ్యవంతుడు. చక్కటి వుద్యోగం చేస్తున్నాడు. పైపెచ్చు ఒంటరి వాడు ఇంకేం? ఇరవై ఏళ్ళ తేడా వుంటే మాత్రం ఏం? భళీ అంటే భళీ అనుకున్నారు. సరస్వతిని నామమాత్రంగ ఆమె అభిప్రాయం అడిగేరు. ఏమ!

చెప్తుంది. తన తండ్రి సంపాదన ఆమెకి తెలుసు. తను గాక మరి నలుగురు ఆడకూతుళ్ళింకా వున్నారనీ తెలుసు. మగో మగ నలుసుకి చదువు చెప్పించి పెద్దచెయ్యాలనీ తెలుసు. ఇంతకన్నా మంచి సంబంధం తండ్రి తేలేడనీ తెలుసు. అందుకే 'మీ యిష్టం' అంది.

అంతే ఝామ్మని పెళ్ళి అయిపోయింది. మరి కొన్నాళ్ళకి కాపరానికి వచ్చేసింది. పెళ్లయిన కొత్తలో బీచ్ షికార్లూ, సినిమా విహారాలూ జోరుగానే సాగేయి. భర్త కూడా బాగానే చూసుకొనే వాడు.

అయితే ఒకటే లోపం ఆమెని బాధించేది. పువ్వులు ఒకోటప్పుడు కన్పించేవికావు. కనిపించినా కొందామంటే బోలెడు ధర. పైగా భర్త పొదుపరి.. దానా దీనా పువ్వులు కొన్నరోజు పండుగరోజు అయ్యేదామెకి. ఆ మహా నగరంలోని పన్నెండేళ్ళు పన్నెండు యుగాల్లా గడిచేయి. ఊరికిదూరంగా జన సంచారం లేనిచోట భర్త యిల్లు కట్టిస్తున్నాడంటే విపరీతంగా మురిసిపోయింది. పూల మొక్కలు పెంచుకోవచ్చు గదా అన్న సంబరంతో పరవశించిపోయింది. అన్నీ అనుకున్నట్టే జరిగేయి . కాని—

సరస్వతి గుండె ఒక్కసారి ఝల్లుమంది. సంపెంగ చెట్టు దగ్గర ఏమిటది .? పాము. నాగుపాము! ఒక్కసారి బుస్సుమని ఎటో చీకట్లో జర్రుమని జారి పోయింది ...

మళ్ళీ ఆమె భావనా స్రవంతి ప్రస్తుతానికి ప్రయాణం చేసింది....

'నేనాయనికి ఏం ద్రోహం చేసేను? నాకెందుకీ శిక్ష? ఇరవై ఏళ్ళు తేడా వున్నా పెళ్ళికి అంగీకరించేను. ఏనాడూ ఆయన్ని అగౌరవపర్చలేదే! మరెందుకీ చిత్రహింస? చెట్టునున్న పూలు కోసుకోవడం తప్పా? ప్రకృతి ప్రసాదించిన ఆనందం అనుభవించటం నేరమా? అసలు ప్రతిస్త్రీ ఏం కోర్తుంది జీవితంలో? భర్త అనురాగం, సుఖప్రదమైన జీవితం, తిండి. బట్ట అంతేనా? పోనీ ఏవో చిన్నచిన్న సర్దాలు ... ఓ బీచ్ షికారు. ఓ సినిమా. ఓ రేడియో, ఫేన్, పువ్వులు పౌడర్ స్నోలు ... కాని నేనెన్నడూ ఇవన్నీకావాలనినోరువిడిచి అడిగేనా? లేదే! పెళ్లయిన కొత్తలో ముద్దుల్తో కౌగిలింతల్తో ప్రతిరోజూ వుక్కిరిబిక్కిరి చేసేవారు. ఆనందించేదాన్ని. ఓపికాది గడిచేక ఆ జోరు తగ్గింది. ఆఫీసులోపని, శ్రమ ఆయన ముఖం మీద ముద్ర వేసేవి. అలసటగా మంచం మీద పడుకునేవారు. ఎప్పుడో ఏనెలకో ఓసారి అర్ధరాత్రికి పక్కలో దూరేవారు .. మరి కొన్నాళ్ళకి నెలల తరబడి నాఒళ్ళు ముట్టుకునేవారుకాదు. నాకుతెలుసు. ఆయనవృద్ధాప్యపడిలోకి వచ్చేస్తున్నారు. దాంపత్య మధురిమలు మీద కొద్దికొద్దిగా మోజు తగ్గుతోంది. అయినా నేను బాధపళ్లేదే! నా శరీరం రోజురోజుకీ పదును ఎక్కుతోంది. పరువాలు రెక్కల్లా

ఎగురుతున్నాయి. మనసు మరో మనిషి సాంగత్యం కోసం విలవిల్లాడి పోతోంది. అయినా అతన్ని దేవికి ప్రార్థించలేదే ... కనీసం అడ్డదారుల వేసేనా నామనసు మళ్ళలేదే. పోనీ- నగలు కావాలనీ, రేడియో కొనాలనీ. ఇంకా ఇంకా సినిమాలూ షికార్లూ బట్టలూ కావాలనీ అడిగేనా- లేదే! కోరికలే లేని సాధుజీవితం గడిపేను.... అతనిలో శరీర దార్ఢ్యం నానాటికీ తగ్గుతోంది. నా యవ్వనం రోజురోజుకీ పొంగులు వార్తోంది. ఓ చిన్న గాలితాకిడి, ఓ పిల్ల మంద మలయానిలం నా ఒంటిని చల్లబరుస్తున్నాయి.... స్వామి పూజనా సరాల వ్రుదిక్తతని శాంత పరుస్తోంది.... అంత మాత్రానికే సంతృప్తి పడ్తున్నాను. అవును. నేను చాలా అల్పసంతోషిని .. మృదువైన పూరేకుల స్పర్శకి నేను మురిసి పోతానే— ఆ మురిపంలో పరవశించి నిద్రపోతానే- నా కెందుకా అదృష్టం లేదు....? ఓ స్వామీ .. ఓ భగవాన్.... ఏమండీ.... ఏమండీ.... మిమ్మల్నే.... ఎందుకులేదూ? చెప్పరూ!!?

మూగగా నిట్టూరుస్తూ కళ్ళుమూసుకొంది సరస్వతి. రెండు కన్నీటి బిందువులు జలజలా వక్షం మీదికి రాలేయి.

ఎదురుగా గులాబీలు దీనంగా చూసేయి. సన్నజాజులు సైగలు చేసేయి. మల్లెలు బేలగా దృక్కులు నిగిడించేయి. చేమంతి చలువకాంతి ఆమె కన్నులలో మిలమిల లాడింది.

'రా. నారుపోసి నీరుపోసిన ఓ జవరాలా, ముద్దరాలా, రా! మేం నీకోసమే పుష్పించేం. నీ ఆనందానికే సుగంధాలు వెదజల్లుతున్నాం. నీ ఆరాధనకి అంకితం కావడమే మా ధ్యేయం.... రా'!

సరస్వతి రెండడుగులు ముందుకు వేసింది. ఎర్రగులాబీ ఒకటి తెంపింది. దోసిట్లో ఇన్ని బొండు మల్లెలు కోసింది గబగబ ఇంట్లోకి వెళ్ళి మాల కట్టింది. మధ్య ఎర్రగులాబీ ... చుట్టూ మల్లెలు . మాల సిగలో తురుముకొని అద్దంలో చూసుకొంది. . ఎవరున్నారా అద్దంలో? సరస్వతా? కాదు. సౌందర్యదేవత. అవును. అవునవును.

అంతలో అడుగుల చప్పుడు. గబగబ వీధి గుమ్మంవేపు వెళ్ళింది సరస్వతి. సైకిలు హేండిల్స్‌కి వేలాడుతున్న రెండు పెద్ద సంచుల్ని దింపుతున్నాడు. అంతా అయ్యేక ఇంట్లోకి వచ్చేడు పరంధామయ్య.

"అబ్బ. ఎంత వుక్క పోస్తోందో!" అన్నాడు. ఫక్కుమని నవ్వింది సరస్వతి.

"ఏమలా నవ్వుతున్నావ్?"

"ఏం లేదు. డాబామీదికి వెళ్దాం రండి. చెప్తా"

పరంధామయ్య లేచేడు. డాబా

ఎక్కేరిద్దరూ.

"వూఁ.... ఇప్పుడు చెప్పు. ఎందుకు నవ్వేవిందాక?" అన్నాడు పరంధామయ్య రుమాలుతో ముఖం తుడుచుకుంటూ.

"ఎందుకా?- అటు చూడండి...."

"వూఁ.... చూసేను."

"ఇటు చూడండి."

"ఆఁ చూశా"

"ఇప్పటికైనా తెల్సిందా?"

"అబ్బ. చెట్లూ. చంపక"

"ఇవాళ పున్నమి. ఆ చెట్లు గాలికి వూగుతున్నాయి. ఈ పూలు పరిమళాలు వెదజల్లుతున్నాయి.... నాకు- చెప్పొద్దూ.... చలేస్తోంది.... అందుకూ నవ్వేను...."

"ఓ- అదా- సైకిలు మీంచి ఒచ్చేను గదూ? అందుకలా అన్పించింది"

"అవును గానీ. టౌన్నుంచి ఏఁవి. ఏమిటి తెచ్చేరు?" అంది సరస్వతిఁ

పరంధామయ్య సమాధానం ఇవ్వ లేదు. కందవితో తీక్షణంగా చూస్తున్నాడు. సరస్వతి కూడా అటే చూసింది.

"ఏఁవిఁటలా చూస్తున్నారు?"

"ఇందాక నే వెళ్ళే ముందు చూసేను.... ఎర్రగులాబీలు మూడుండేవి. ఇప్పుడు రెండే వున్నాయి. ఇంకోటి ఏమైందా అని చూస్తున్నాను...."

వున్నట్టుండి పరంధామయ్య గొంతు గంభీరంగా మారిపోయింది.

"... ఓ వేళ రాలిపోయిందేమిటి కొంపతీసి!" అన్నాడు మళ్ళీ.

"నేలరాలిందో లేకపోతే ఏ జవ లాలి జడలోనేనా వాలిందో!" అంది సరస్వతి. అంటూనే అతని భుజాల మీద రెండు చేతులు వేసి మెడని చుట్టింది. పరంధామయ్య నవ్వుతూ ముందుకి వంగేడు. ఆమె సిగలోని ఎర్రగులాబీ అతని ముక్కుని పలక

రించింది.... అంతే! సరస్వతి చెంప ఛెళ్ళుమంది.

"ఛీ.... నీ కెన్నిసార్లు చెప్పాలి? బుద్ధిలేదూ? పువ్వుల మీద చేయి వేస్తే వూరుకొనేది లేదని చెప్పేనా? లేదా?" అంటూ గర్జించేడు.

సరస్వతి మొదట బిత్తరపోయింది. వెంటనే ధైర్యం తెచ్చుకుంది. పొంగిన నరాల్నింకా చెలరేగిన ఉద్రిక్తత ఉచ్ఛ్వాస నిశ్వాసాల్ని ఎక్కువ చేసింది.

"ఏం తప్పా?" అంది.

"తప్పా తప్పున్నారా!"

"ఏం నేను మనిషిని కానా? నాకు మాత్రం సరదాలేదా? ముచ్చటపడి ఓ పువ్వు కోసుకుంటే అపరాధమై పోయిందా?"

"సిగ్గు లేక ఇంకా అడగడం ఒకటా? నేను వద్దంటే అంతే. నా మాట మీద నీకా మాత్రం గౌరవం లేదన్న మాట!"

"దానికి దీనికీ ఏం సంబంధం? రూపాయలు తగలేసి సిగరెట్లు పూదే యటంలేదూ మీరు? పెరట్లోని పువ్వు కోసుకుంటే ఏం? మీలాంటి సర్దాయేనా నాది?"

"సిగరెట్లు బజార్లో అమ్ముతారు. ఈ పువ్వులు నేను కష్టపడి పెంచేను. అవి పుష్పించి సహజంగా నేలరాలాలి. అంతే. ఎవరూ కోయటానికి వీల్లేదు."

"పువ్వులు చెట్టుకుంటే చూసి ఆనందించడంలో ఏముంది? ఆపాటి దానికి కష్టపడి ఎందుకు పెంచటం?"

"పూలమొక్కలూ నీలాంటి జీవ పదార్థాలే. నీకు మెదడుంది. ఆలోచించే శక్తుంది. నీ బాధ నీ సంతోషం నీ సుఖం దుఃఖం చెప్పుకోడానికి నోరుంది. కానీ ఆ మొక్కలకి అవేవీ లేవు. అంతే నీ వేళ్ళు కొరికేసేవి. అందుకే వాటిని ముట్టుకోవద్దన్నాను. అసలు కారణం చెప్తాను. నీ తలకాయ మీద ఆ నల్లటి సిగ వున్నంత కాలమే నీ అందం. అది తీసేస్తే ఏముంది.... బోడిది! ఈ పువ్వూ అంతే."

"హరహరా అంటూ చెవులు మూసుకొంది.

"ఇదే ఆఖరుసారి చెప్తున్నాను. ఇంకోసారిలా జరిగిందంటే ఈ ఇంట్లో నువ్వో- నేనో- అంతే." అంటూ దూకుడుగా మెట్లమ్మట కిందకి దిగి పోయేడు పరంధామయ్య.

కింద పచ్చని అడవి.

అడవి నిండా కాచిన వెన్నెల.

కట్టలు తెగిన దుఃఖం సరస్వతి కళ్ళలో కల్లోలం రేపింది. ఆ అందాల నిలయంలోంచి దుఃఖాశ్రువులు జారగా కురిసేయి. అడవిని కాచిన వెన్నెల వెలుగులు ఆ కన్నీటి బిందువుల్ని ముత్యాలుగా తీర్చిదిద్దేయి.

ఆ అడవిని వెన్నెల కాస్తూనే వుంది.

ఆ వెన్నెలంతా అడవిపాలై పోతూనే వుంది.

కాలం మాత్రం ఆగిపోలేదు.

♦ ♦ ♦

ఇంటి ముందు కారాగిన చప్పుడవ గానే డాబా మీదున్న సరస్వతి కిందకి చూసింది. కార్లోంచి పరంధామయ్య దిగేరు. ఏవో పెట్టెలు అతనూ డ్రయివరూ ఇంట్లోకి మోసుకు వచ్చేరు. డ్రయివర్‌కి డబ్బివ్వగానే కారు వెళ్ళిపోయింది. సరస్వతి నెమ్మదిగా కిందికి దిగింది. ఇంట్లోకి చేరవేసిన సామానుల్ని చూసి రొప్పుతున్నాడు పరంధామయ్య.

"సరస్వతీ- రా. ఇదుగో ఇదేమిటో తెలుసా? ట్రాన్సిస్టర్ రేడియో. త్రిబేండ్‌ది. ఇక్కడ సిలోన్ వస్తుంది. తెలుగు పాటలూ వస్తాయి. హిందీవే ఎక్కువనుకో. ఇదిగో ఇది మరో బేండ్ ఇక్కడ హైదరాబాదూ వివిధ భారతీ వస్తాయి. ఇది మీడియం వేవ్. ఇందులో విశాఖపట్నం వస్తుంది. నీకు పూసుపోతుందని తెచ్చేను. ఇదుగో వాణి. ఇందులో ప్రోగ్రామ్స్ వివరాలూ అవీ వుంటాయి.... ఇది వ్యూఫైండర్. తాజ్‌మహల్నీ, బృందావన్‌గార్డెన్స్‌నీ, పేరిస్‌నీ, అమెరికా విశేషాల్నీ సినిమాలోలా చూడొచ్చు. ఇదిగో ఇది గ్రామఫోన్. ఇవి రికార్డులు. భావ

మతిపీ, రాజేశ్వర్రావీ, బాలమురళీపీ తెచ్చేను " అంటూ సుక్క తిప్పుకోకండా వర్ణించ సాగేడు పరంధామయ్య

సరస్వతి వాటినన్నింటినీ చూస్తూ నిశ్శబ్దంగా నిలబడింది.

* * *

రోజులు దొర్లుతూనే వున్నాయి. పదిహేనేసి రోజులకోసారి పున్నమి వస్తోనే వుంది. పూలు విరగపూస్తూనే వున్నాయి.

వెన్నెట్లో డాబామీద గ్రామఫోన్ పెట్టుకుని 'మనసున మల్లెల మాల లూగెనే' అన్న భానుమతి పాటవిన్నా. 'పాట పాడుమా కృష్ణా' అని రాజేశ్వర్రావు గొంతు విన్నా - బాలమురళి అష్టపదులు విన్నా సరస్వతి మనస్సు మళ్ళీ పూలమీదకే వెళ్ళేది

వెన్నెట్లో విరగబూసిన పువ్వుల ముందు ఇవన్నీ వృధా అన్పించేది

అలా రోజులు వారాలు నెలలు గడిచేయి.

అడవిని వెన్నెల కాస్తోనే వుంది.

వెన్నెలంతా అడవిపాలౌతూనే వుంది.

పువ్వులు పువ్వులు.., పువ్వులు..



ఎటుచూసినా రంగురంగుల పూలు కుసుమిస్తోనే వున్నాయి.

* * *

మంచినీళ్ళకి దూరంగావున్న బావి దగ్గరకి పోవాలంటే సరస్వతికి కాస్త ఇబ్బందిగా వుండేది. అందుకని పెరట్లోనే ఓ నుయ్యి తవ్వించే ప్రయత్నాలు చేసేడు పరంధామయ్య. కూలీలని పెట్టించి ఎన్ని నిలువుల లోతు తవ్వినా జలపళ్ళేదు. డబ్బంతా వృధాయే మోనని భయపడ్డాడు. బలి కావాలంటే కోడిని కోయించేడు. అప్పటికీ జల పడకపోగా మేకను బలివేసేడు. అయినా జలపళ్లేదు. విసుగెత్తి కూలీలనలా పంపించి వీధిగుమ్మంలోకూర్చున్నాడు పరంధామయ్య అవు పాలు వెచ్చచేసి గ్లాసుతో వీధిగుమ్మంవేపు వెళ్ళింది సరస్వతి. పరంధామయ్య అదోలా రెప్పవాల్చకుండా పూల మొక్కలవేపు చూస్తున్నాడు. 'ఏమండీ' అన్న సరస్వతి పిలుపు అతన్లో చలనం కలించలేదు గ్లాసు నేలమీద పెట్టి రెండు భుజాలూ పట్టుకుని వూపింది చల్లబడ్తున్న శరీరం తగలగానే ఏదో అర్థం అయినట్టు ఘోరుమని విలపిస్తూ అతన్ని వాటేసుకు పోయింది సరస్వతి.

పరంధామయ్య జీవితం అలా ముగిసింది

* * *

పరంధామయ్య చనిపోయి అప్పుడే రెండు నెల్లయింది. ఆ లంకంత కొంపలో సరస్వతి ఒక్కతే మిగి

లంబి ఓనాడు ఒంటరితనం దిగు లన్నించి డాబా ఎక్కింది.

ఇంద్రధనుస్సు రంగుతో పువ్వులు; నాచురంగులో చెట్లు, బూడిదరంగులో దూరాన కొండలు, పైన పెద్ద చంద్ర బింబం, అంతటా పరుచుకున్న తెల్లని వెన్నెల కన్పించేయి. ఆమె మన స్సులో మహారణ్యం చిటపటమంటూ తగులడసాగింది. భావలహరి దారీ తెన్నూలేని దూరతీరాలకి పయనం ప్రారంభించింది ఒక్క వుదుటున కిందకివెళ్లి ఆకాశ నీలంరంగు పట్టు చీరా, అదే రంగు జాకెట్టూ ధరిం చింది. సిగవిప్పి జుత్తు విరబోసు కుంది. ముఖాన తీర్చి తిలకం పెట్టు కుంది. కళ్ళకి కాటుక అద్దుకొంది. పీధిగుమ్మం తలుపుతీసి పూలమొక్కల మధ్యకి వెళ్ళి నిలబడింది.

గులాబీలు స్వాగతమన్నాయి
మల్లెలు ఆహ్వానించేయి
సన్నజాజులు సైగచేసేయి .
చేమంతులు రా రమ్మన్నాయి

ఈ చుట్టూ చెట్లు, ఆ చుట్టూ కొండలు. ఆపైన ఏవేవో పొదలు. అదంతా అడవి.

ఆపైన ఆకాశం. ఆకాశంలో గగనతార చంద్రుడు. అతనిచుట్టూ మిలమిల్లాడుతూ తారలు.

కింద వెన్నెల. అడవి అంతటా నిష్పక్షపాతంగా అలముకున్న అవధి లేని వెన్నెల.

అడవినిండా వెన్నెల. వెన్నెల వెలుగులో అడవి రాగాలు తీస్తోంది. విరహగీతికల్తో వేగిపోతోంది.

అడవి కాచిన వెన్నెల అడవిని చూసి పరిహసిస్తోంది. వెన్నెల వెలు గులో-ధవళిమలో అడవి కుమిలికుమిలి పోతూంది.

పూలబుట్ట పట్టినన్ని గులాబీలు, చేమంతులు. మల్లెలు, సన్నజాజులు, పొగడలు, సంపెంగలూ ఏరింది. ఇంట్లోకివెళ్లి మాల కట్టింది. కొన్ని పువ్వులు పరుపుమీద చల్లింది. కొన్ని దేవుడికి సమర్పించింది. తీరుబాటుగా జడ వేసుకుంది. ముడివేసి మాల తురిమింది...అద్దంముందు నిలబడింది.

కాని ఆమెకి కన్పించిన దేమిటి? ప్రతిబింబంకాదు. కానేకాదు ఎదు రుగా అద్దంలో పెద్ద అరణ్యం.కాకులు దూరని కికారణ్యం. చీమలు దూరని చిట్టడవి. అవును. అడవే ఆ అద్దంలో ఆమెకి కన్పించింది. దుర్గమం. దుస్సాధ్యం అయిన అడవే అందులో ప్రతిబింబించింది.

గిరుక్కున వెనక్కి తిరిగి పెర ట్లోకి వెళ్ళింది. నూతిగట్టున నిలబడి తొంగిచూసింది. ఆశ్చర్యం. జల పడింది

ఎన్ని నీళ్ళో !!

పంచప్రాణాలూ కూడదీసుకొని ముందుకు వురికింది, ధబ్బుమని చప్పుడు. కాసేపు గాలిబుడగలమర్మర ధ్వని అంతే. తర్వాత నిశ్శబ్దం.

వెన్నెల అడవిని కాల్చేసింది.

అవును,

అడవి వెన్నెట్లో కాలిపోయింది !






బెంజమిన్ డిస్రేలీ, గ్లాడ్‌స్టన్ రాజకీయంగా పరస్పర వ్యతిరేకులు. ఓ ఫ్రెండ్ డిస్రాలీని "ఆపద" కు "విపత్తు" కు మధ్య ఉండే తేడా చెప్పమన్నాడు.
గ్లాడ్‌స్టన్ థేమ్స్‌నదిలో పడితే అది ఆయనకు సంభవించిన "ఆపద". ఆయనను ఎవరైనా రక్షిస్తే అది "దేశాని"కి సంభవించిన "విపత్తు" అని సమాధానం చెప్పాడు డిస్రాలీ.

• • •

సోక్రటీసు దగ్గర శిష్యుడు తన వంశం గొప్ప గురించి తెగ డబ్బా కొడ్తున్నాడు. "గురువుగారూ ! మావంశంలో ఎలాంటి పెద్దమనుషులు పుట్టారంటే ! అలాంటివారు మీ వంశంలో కూడా జన్మించి ఉండరేమో" అన్నాడు. దానికి సోక్రటీసు, "అవునయ్యా, ఆ గొప్పతనం మీ వంశంలో నీతోటే ఆఖరయింది. నా వంశంలో నాతోటే మొదలయింది." అన్నాడు.

• • •

స్వతంత్రం రాక ముందు నెహ్రూగారు ఒకసారి లాహోరు వెళ్ళారు. లాహోరు జిల్లా కాంగ్రెసు కమిటీవారు స్టేషను వెలుపలనే ఆయన స్వాగతంకి ఏర్పాటు చేసారు. బయట ఏర్పరచిన ప్లాటుఫారం మీద నెహ్రూగారు వచ్చి నిల్చోగానే ప్రజలందరూ వచ్చి ఆయన మెడలో పూలదండలు వేయసాగారు నెహ్రూగారు చిరునవ్వుతో యిలా అన్నారు, నన్ను మీరంతా ఒక మేకుగా భావించారా ఏమిటి ? వచ్చిన వాళ్ళందరూ ఈ హారాలు తెచ్చి నా మెడకి తగిలించి పోతున్నారు !

• • •

చిత్తరంజన్‌దాస్ చనిపోయినప్పుడు, శ్రీమతిదాస్‌ను పరామర్శ చేయడానికి గాంధీజీ కలకత్తా వెళ్ళారు. ఆమె కూర్చున్న మంచం మీదనే ఆయనకూడా కూర్చుని మాట్లాడుతున్నారు. ఆమె ఘోరున విలపిస్తోంది. మాటల మధ్యలో గాంధీజీ ఒకమాట అడిగారు, "నన్ను పెళ్ళి చేసుకుంటావా ?" అని. ఆమె దుఃఖము ఎటు పోయిన మయిందోగాని పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వింది.

సేకరణ : ఎస్. గోవిందరాజ్

వాషింగ్టన్‌లో ఒక యిల్లాలు, ప్రెసిడెంట్ కూలిడ్జ్‌ని మాట్లాడిస్తానని ప్రగల్భాలు పలికిందట. కూలిడ్జ్‌ని ఒక విందులో కలుసుకుని, ఆమెమాట నిలబెట్టుకోవాలనే ఉద్దేశ్యంతో, "మిస్టర్ ప్రెసిడెంట్ ! మీ చేత కనీసం మూడు మాటలైనా మాట్లాడిస్తానని పందెం వేసాను" అందిట.
"మీరు నెగ్గరు" అన్నాడట కూలిడ్జ్.

• • •

ఫ్రాన్స్‌లో రైట్ బ్రదర్స్ మొదటిసారిగా విమానం ఎగరవేసిన సందర్భములో ఏర్పాటు చేసిన విందులో, విల్బర్ రైట్ యిలా అన్నారట. "నేను బహిరంగ సభల్లో మాట్లాడలేను. కాని యీ సమయంలో, నా సంతృప్తి గురించి కొంచెం సేపు మాట్లాడుతాను, నేను మాట్లాడే ముందు మాట్లాడినాయన, ఆకాశంలో చాలా నేర్పుతో ఎగరడం గురించి ప్రసంగిస్తూ డేగ, వానకోవెలకు సంబంధించిన పోలికలు చెప్పారు. కాని, ఎందుచేతనో నాకు మాత్రం పక్షిజాతి మొత్తంలో చాలా నెమ్మదిగా ఎగిరేదీ, బాగా మాట్లాడేదీ అయిన రామచిలుక స్ఫురించింది.

• • •

ఒక మిత్రుడు, తన అనారోగ్యత గురించి మార్క్ ట్వైన్‌కి ఉత్తరం వ్రాస్తూ "ఒకేసారి పంటినొప్పి, చెవినొప్పి అనుభవించడం కంటె ఘనమైన దేమైనా యున్నదా ?" అని వ్రాసాడట.
దానికి మార్క్ ట్వైన్ తన సహజ ధోరణిలో "వాతం-సైన్స్ విటూ నాట్యం" అని సమాధానం వ్రాసాడట.

సేకరణ : భమిడిపాటి సోమయాజి



# రాజకీయమా? వర్ధిల్లక్కు

పిశుపాటి ఉమామహేశ్వరశా

చూడగానే ఆదో చిన్న సైజు పల్లెటూరన్జెప్పుడానికి వీలుగా ఆ వూళ్ళో నాలుగై దొండల గడప ఉంది. అంతే గాకుండా జనాభాలెక్కల టైమ్‌లో ఉపయోగపడేందుగ్గానూ గడపలేని గుడిసెలుగూడా కొన్ని ఉన్నాయి.

ఊరి చుట్టూతా పొలాలున్నాయి. ఆ పొలాలకి స్వంత యజమానులూ ఉన్నారు. అద్దెయజమానులూ ఉన్నారు. ఆ పొలాల్లో నిక్షిప్తమైయున్న బంగారాన్ని తవ్వి వెలికితీసి యజమానుల కప్పగించడానికి కర్షకులున్నారు. శ్రామికులున్నారు. (ఈ శ్రామికుల రక్తాన్ని పైసల్లోకి మార్చుకుని పట్నాలకి బోయి పారిశ్రామికులైన వాళ్ళు గూడా ఉన్నారనుకోండి. అది వేరే విషయం)

వీరందరికీ తగిన సదుపాయాలు సమకూర్చడానికి ఓ కోఆపరేటివ్ (జనడదే) స్టోర్సుంది. తనఖా బ్యాంకుంది. రిక్రియేషన్ పేర డబ్బులు గుంజుకోడానికో డేరా సినిమా హాలుంది. దానికి అనుబంధం(లా)గా ఓ కాకా హోటలు, కిళ్ళీబడ్డీగూడా ఉన్నాయి. ఒక్క కిళ్ళీ కావలసిన వారే కాదు, బుడికోసం గూడా చాలామంది జనం ఆ బడ్డీకే వెళ్తారు.

కాగా, పిల్లల్నీ, పెద్దల్నీ తీరిక సమయాల్లో విజ్ఞాన ఖనుల్ని చేయడానికో పొద్దుంకా పంతులుగారున్నారు. చేసిన పాపాలు కడుక్కోడానికి వీలుగా ఊరి మధ్యనో చెరువూ, దానికి అనుంటాని ఆస్తి ఉండీగుడా నాస్తికుల చేతుల్లో ఉన్న దేవుడూ, అతగాడి తాలూకు ఆలయమనబడే ఒక శిధిల కట్టడమూ ఉన్నాయి.

సంజెవేళ భోజనాలయేక తీరిగ్గా ఊసులాడుకుంటుకూ, కష్టసుఖాలు చెప్పుకుంటుకూ గుడికెదురుగానే ఏ చంద్రగుప్త మౌర్యుడి కాలం నాటిదో అన్న భ్రమకలిగించే ఓ రావి చెట్టూ, దానికి చుట్టూతా కట్టిన సిమెంటు చప్టా ఉన్నాయి.

'మీరొక్కరే గాదు, తోటి(దేశ, విదేశ) ప్రజలుగుడా ఇలాగే అఘోరిస్తున్నారు'ని చాటిజెప్పటానికి ఓ రేడియో ఉంది. శ్మశానంలో చెట్టుకి వ్రేలాడే భేతాళుడి శవంలా దాని తాలుకు మైకు ఈ రావి చెట్టు కొమ్మల్లోనే ఓదానికి వేలాడుతూంటుంది.

చుట్టు పక్కలున్నన్నీ కుగ్రామాలు కావడం మూలాన ప్రజల్ని కన్నబిడ్డల్లా ఆదరించి, వారి కష్టసుఖాల్ని విచారించి సమస్యల్ని సరిదిద్దడం కోసం ఉద్దేశింపబడ్డ పంచాయతీ సమితి కార్యాలయంగుడా ఈ గ్రామంలోనే ఉంది.

ఒక్కసారి చూసీచూడగానే ముంజేతి కంకణంలా స్పష్టంగా ఇన్ని విషయాలు అగుపడుతున్నా 'రాజకీయం' అన్న ముక్క వినిపించక పోవడం గానీ దానితాలూకు చిహ్నాలు కనిపించక పోవడంగానీ ఆశ్చర్యం గలిగించే విషయమే.

అంతమాత్రాన ఆ ఊళ్ళో రాజకీయాలు లేవనడం అనుకోడం అంత సబబు కాదు గాలీ వెల్తురూ మొదలైన పంచ భూతాలతో పాటు కలసిపోయిన రాజకీయాలు ఆరో భూతంలా మారి ఆ ఊరి వాతావరణాన్ని ఆక్రమించుకుని ప్రజలజీవితంలో ఓముఖ్య



మైనభాగమై కూచున్నాయి.

చిత్రమేమిటంటే గాలి ఉన్నది. కంటికికనబడదు. స్పర్శవల్ల తెలుస్తుంది. రాజకీయాలూ అంతే. పైకి చూడ్డానికి కన బ డ వ్. వా టి వ ల్ల లాభమో నష్టమో పొందిన వాడికీ, అటువంటి వాళ్ళు తెలిసిన వారికీతప్ప ఆ ఊళ్ళో నీ రాజకీయాల ఉనికి ఇత రులకు తెలీదు.

వేలమంది జనం ఒకచోట గుమి గూడి ఉన్నా మౌనంగా ప్రార్థన జేస్తున్నప్పుడు అలుముకునే భయంకరమైన నిశ్శబ్దం చాటున ఉన్నవాడికి అక్కడెవరూ లేరనే భావన కలిగించినట్లు సూర్యగోళంలోని వాతావరణాన్ని మించి ఉండే రాజకీయాల్ని వెన్నెల కన్నా చల్లగా మార్చి ఈ ఊరిజనాలకి అసలిటు వ ం టి వా టే తె లీ దు గాబోలు అన్నస్థితికి తీ సు గొ చ్చి న ఘనత పెదనాయుడిగారిది.

ఆ ఊరికి మొట్టమొదటి సారిగా రాజకీయాలొచ్చినపుడు సరాసరి వారింటకేవచ్చి బసచేసి ఆతిథ్యం పుచ్చుకున్నాయి. నాయుడుగారు వాటి నెంతో ఆదరించి, ఆ ఊళ్ళో ఒ క ఉ ని కి కల్పించి, పెంచి పె ద్ద చే సి న కార ణంగా కొంతకాలమయేసరికితమయిల్లు చాలకపోతే పంచాయతీ ఆఫీసను పేర వేరే యిల్లుకట్టించి వాటి న ం దు లో ప్రవేశపెట్టి ఇన్నాళ్ళుగా ఇన్నేళ్ళుగా తామే గార్డియన్‌గా ఉంటూ వచ్చేరు. అవిగూడ ఆయన ఇలాకాలో పెంపుడు కుక్కలా విశ్వాసంతో ఆయన్నే అంటి పెట్టుకునుంది ఎందరెన్ని విస్కత్తులు చూపించినా చలించలేదు

కానీ హఠాత్తుగా పెదనాయుగారు కనుమూయడంతో అసలు కథ ఆరంభమైంది.

తెలుగు భాషలో 'రాజకీయం' అన్న ముక్కొకటుందని తెలిసున్న ప్రతివాడికీ పెదనాయుడుగారు కీర్తిశేషులైనారన్న వార్త వినగానే పుట్టెడు దుఃఖం కలగడానికి బదులు ప్రజల భవిష్యత్తు ఏమిటి ? వీళ్ళ ఆలనా పాలనా ఎవరు చూస్తారు. వీళ్ళను కడుపులో పెట్టుకుని కాపాడగల వ్యక్తి ఎవరు ఎవరన్న ప్రశ్నలుపెనుభూతాలై ఎదురుగా నిల్చి యుకిపించగా భయపడిపోయేరు.

నాయుడుగారి మరణంతో వాళ్ళకి జగత్తంతా అంధకార మ లు ము కొన్నట్టూ, భూభ్రమణం ఆగిపోయినట్టూ, దేశం మొత్తంమీద బ్లాక్ మార్కెట్ వ్యాపారం ఆగిపోయినట్టూ అనిపించి వణికిపోయేరు.

ఈ వణిక్ప్రముఖులందరూ 'పంచాయితీ ఆ ఫీ సు లో ప్రెశిడెంటుగారి కుర్చీలో కూచోగల సమర్థులెవరా' అని అనతి కాలంలోనే బట్టతల వచ్చేటంత తీవ్రంగా ఆలోచించేరుగానీ ఆ 'ఎవరో' గారు మాత్రం వారి బుర్రలకు తట్టలేదు.

కొంతమంది మనసులు మాత్రం కొన్ని పేర్లను సూచించేయి, కొన్ని పేర్లను అనుమానించేయి. (ఈపేర్లను తలచుకోగానే కొంతమంది గుండెలు గుభేలు మన్నాయి.

మరికొంతమందికి 'నేనే' నన్న సమాధానం దొరికింది. ఇంటో బిడ నెట్టుకుని ఊరంతా కల్దిరిగినట్టిదేట్ అని వారాశ్చర్యపడి లేచేక అందులోవి సాధ్యాసాధ్యాలను గూర్చి ఆలోచించ డంలో లీనమయ్యేరు.

ఏ ఒకరిద్దరికో మాత్రం అనాధలైన అమాయిక ప్రజలను చూడ్డం వల్ల కలిగిన కడుపుకోత భరించలేక వీధినబడిః మీరేం భయపడకండిక. నేనున్నా నిక్కడ. మిమ్మల్ని నా కంటి పాపల్లో దాచుకుంటానంతే' అని అరవా లన్నంత వూపొచ్చేసింది.

మనసుల్లో ఎవరెవరేమాలోచించుకున్నా పైకి మాత్రం ఆ పదిరోజులూ ఊరిచెరువు పొంగి పొర్లిపోయేట్టు కడవలకొద్దీ కన్నీరు గార్చడంలోనే నిమగ్నులైపోయేరు పెద్ద అందరూను.

పెద్దకర్మగూడా ఐపోయేక నాలుగు రోజులకి, వచ్చేవారంలో ఉండబోయే రాజకీయ పరిస్థితుల్లా మండిపడిపోతున్న ఎండలో పనవి ఎక్కడికో పారిపోబోతూంటే పట్టుకోబోయిన మంత్రిలా స్పీడుగా అవధాని గారింటి చీడీ లెక్కేడు వీరాసామి.

అవధానిగారి గురించి ఒక్కముక్కలో చెప్పాలంటే 'బ్రహ్మర్షి'. ఈ మూడక్షరాల ముక్కనీ విడదీసి చెప్పాలంటే చాలా ముక్కలవసరమౌతాయి.

ఊళ్ళో ఉన్న కొద్దిమంది సంపన్న గృహస్థుల్లోనూ అవధానిగారు ఒక మెట్టు పైన ఉన్నవారు. కానీ మనిషివి చూస్తే రెండువందల ఎకరాల మాగాణికి అధిపతి అని ఎవరూ అనుకోరు. ఎల్లప్పుడూ భోజరాజు ఆస్థానానికి వెళ్ళబోతున్న పండితుడి వేషంలో ఉన్నా వేదంలో ఎనభై రెండు పన్నాలూ చదువుకున్నవారని పసిగట్టలేనంత అమాయకంగా ఉంటారు.

ఎప్పుడైనా ఇంట్లోంచి బయటికి వచ్చినపుడే బంగారపు పొన్నుకఱ్ఱగాని మిగతా సమయాల్లో ఆయన చేతుల్లో అష్టోత్తర శతనామావళి పుస్తకాలో, భగవద్గీతో ఉంటాయని ఆయనతో ఏ పాటి పరిచయం ఉన్నవారైనా చెప్తారు.

భక్తి భావంతోగానీ వ్యంగ్యంగా గానీ నలుగురూ చాటుగా అనుకునే 'పరమ ఛాందసుడు' అన్న మాటను ఆయన మొహంమీద అనేసినా, అలా అన్నవాడెవడైనా ఒక చిర్నవ్వు నవ్వేసి ఊర్కునే సహనమూ, సౌశీల్యమూ ఆయన కున్నాయి.

ఈ పైన వివరించిన గుణాలుగల వ్యక్తికి అన్ని విధాలా సరితూగగల స్త్రీయే మహాలక్ష్మమ్మగారు. అందుకే ఆవిడకు అవధానులుగారి జీవితాన్ని పంచుకునే భాగ్యం కలిగింది.

నిజంగా మహాలక్ష్మి కున్నంత సిరిసంపదలతో తులదూగుతున్నా ఆవిడ కళ్ళలో దిగులు గూడుగట్టుకునుండ డానికి, గొంతులో బాధ జీర ధ్వనించ డానికి కారణం ఉన్న నలుగురు కొడుకులూ చదువుల పేరిట విదేశాల్లో ఉన్నారన్న బెంగ.

ఇటువంటి పురాణ దంపతులు పురాణ వఠనంలో ఉన్నవేళ పీరాసామి చావడిలోకి దూసుకొచ్చి 'అవతల కొంపలంటుకుంటుంటే పురాణాలూ హరికథలూ ఏమిటండీ బాబూ! లెండి త్వరపడండి. అవతల అనాధలైన ప్రజల వెన్ను తట్టండి, అభయం ఇవ్వండి' అన్నాడు ఆయాసాన్నిగూడా నిర్లక్ష్యం చేసి.

అవధానిగారు తమ చూపుల్ని 'లావొక్కింతయులేదు—' పద్యం మీదనుండి కళ్ళజోడు పై అద్దంగుండా పీరాసామి వేపు ప్రసరించేరు.

మహాలక్షమ్మగారుకూడాఒక్కక్షణం ఒత్తులు చేయడం ఆపి ప్రశ్నార్ధకంగా చూశేరు పీరాసామి వంక.

పీరాసామి పైబట్టతో ఓ సారి మొహం తుడుచుకుని దాంతోనే నేలని శుభ్రం జేస్తున్నట్టు దులిపి గచ్చు మీద కూలబడి స్తంభానికి జేరగిల బడ్డాడు.

అతని వాలకాన్ని చూసేక 'లావొక్కింతయు లేదు....' పద్యం ఆవేల్టికిక ముందుకు సాగదనీ, గజేంద్రుడి మొర ఇహ రేపు వినాల్సిందే ననీ రూఢీ చేస్కుని పత్తీ, ఒత్తులూ వెండి భరిణలో సర్దేసుగునీ వంటింటి వేపు నడిచేరు మహాలక్షమ్మగారు ఓ గ్లాసెడు మజ్జిగ తెచ్చే ఉద్దేశంతో.

అవధాన్లుగారు కూడా భాగవతం మూసేసి 'ఏమిటయ్యా స్వామీ ఆహడావుడి ఎక్కడో కొంపలంటుగుంటేనే గానీ మా గుమ్మం తొక్కవుగదా' అన్నారు శాంతంగా కళ్ళజోడు తీసి కణతలు నొక్కుకుంటూ.

'ఒకసారి ఎక్కడో అంటు కోలేదండీ బాబూ! మన ఊళ్ళే అంటు కున్నాయి. మీలాంటి వాళ్ళు చూస్తూ ఊరుకుంటే పక్క ఊళ్ళగ్గూడా వాపించిపోతాయి. అనక చేతులు కాలేక ఆకులన్న సామెత ఉండనే ఉందిగదా'

చల్లని తేట మజ్జిగతో పీరాసామి ప్రాణం కొంత కుదుట పడింది. పక్కనే ఉన్న విసన కఱ్ఱందుకొని విసురు కొంటూ 'హమ్మయ్య' అ(నుకు)న్నాడు.

'ఇప్పుడు చెప్పవయ్యా స్వామీ అసలు విషయం సామెతలుపయోగించకుండా....'

'అయ్యా! సూటగా చెప్పేస్తా నాలకించండి. నాయుడుగారు కాలంచేశేక పంచాయితీ ఆఫీసులో ఆయన కూర్చున్న కుర్చీలో ఇంతవరకూ ఎవరూ కూర్చోని విషయం మీకు తెలుసు గదా'

'అయితే'

'అవటాని కేముందండీ బాబూ! మెడమీద తలకాయున్న ప్రతి వెధవా నేనంటే నేనంటున్నాడు ఆ కుర్చీలో కూచోడానికి'

'అయితే'

'ఇంకా అయితే గియితే ఏమిటండీ బాబు. అలా ఐడమైన వాడినీ సింహాసనం మీద కూచోనిస్తామా? కైవారాలు చేస్తామా?'

'ష్! నెమ్మదిగా మాట్టాడు.

ముందాయాసం తీర్చుకో'

'అయ్యా! బయటజరుగుతున్న ఘోరాలు తెలిస్తే మీరింత శాంతంగా ఉండరు. ఎంత ధర్మరాజైనా కురుక్షేత్రంలో పాల్గొనక తప్పిందా? అబద్ధ మాడక తప్పిందా? మీరు నడుంగట్టాలి మళ్ళీ పాలెంప్రజలు గుండె మీదచెయ్యేసుగుని నిద్రబోవాలి అనంతే'

'నేనా నడుంగట్టాల్సింది'

ఓ పొడుం పట్టుపట్టారవధాన్లుగారు.

'మరి చెడ్డవాళ్ళు చెలరేగినపుడు మంచి వాళ్ళే గదటండీ నడుం గట్టాల్సిందీ ఎదురు చెప్పకండిక. అదిరూలు'

'ఎవరయ్యా చెడ్డవాళ్ళు'

అవధాన్లుగారికి వీరాసామి మాటలు వినడమంటే సరదా. 'కొంప లంటుకున్నాయండి బాబోయ్' అంటూ పరిగెట్టుకొస్తాడు. అరఘంట గడచేక గానీ అసలు విషయం చెప్పడు.

'ఎవరేవిటండీ ఒహసారలా వీధిలో అడుగెట్టి జూడండి. వెధవ పలకరింపులూ, విషపునవ్వులూ వాళ్ళూను. ప్రతివాడూ 'ఏందిబాబాయ్, అరేయ్ బావా' అంటూ వరసలు గలిపేస్తున్నారు. ఉదాహరణకి చెప్తాను. ఆ గొడ్డుమోతు వెధవ లేడూ....'

'ఎవరూ'

'ఇంకెవడూ. కరణంగాడే'

'తప్పు స్వామీ! అలా అనకూడదు'

'ఏమిటండీ తప్పు. పిల్లా జల్లా లేనోణ్ణి అంటే తప్పొచ్చిందా? వాడికి బిడ్డా పాపా ఎందుకు కలగ లేదంటారు. ఆ బోడిముండ కరణీగాన్ని అడ్డం పెట్టుకుని వాడు చేసిన పాపాలు ఇన్నా అన్నా. చేసినపాపం పామై చుట్టుగోకుండా పూస్తుందా'

'ఒకళ్ళ ఊసుమనకెందుకు జెప్పు'

'అవసరమొచ్చింది గాబట్టి. అలా అంటీ ముట్టనట్టుండ గలిగే వ్యవహారమైతే నీవరకూ రాక పోను చేయిదాటిపోయింది గనకనే మీకు విన్నవించుకుంటా. వాడప్పుడే రెండు లారీల కంకర తోలించాడు. రోడ్డేయిస్తాట్ట రోడ్డు'

'ఎవరూ'

'ఎవరా! శ్రీశ్రీశ్రీగవర్రాజులుంగారు'

మయసభ ఏకపాత్రాభినయంలో దుర్యోధనుడు "హాహాహా పాంచాలీ" అన్నట్టుగా అన్నాడు వీరాసామి ఆపేరు ఉచ్చరించడమే తనకసహ్యమన్నట్టు.

"వేయించని మంచిదేగా"

"ఏవిటండీ వేయించేది? కాకర కాయ పులుసా. చెప్పకండిక. ఒళ్ళు మండిపోతూంటేనాకు, ఎలక్షన్లయ్యేంత వరకూ ఆ కుప్పలలాగే ఉంటాయి. గెలిచేదా నాలుగేదు నెల్లు పోసేక నిక్కుతూ నీలుగుతూ పరిపిస్తాడు. ఓడేదా ఎక్కణ్ణించొచ్చేయో అక్కడికే వెళ్ళిపోతాయి. ఎవడికి తెలియదనకండీ బాబూ ఎలెక్షన్ వాగ్దానాలు.'

'నువ్వంటున్నంత చెడ్డవాడుగా కనపడ్డులే వీరాస్వామీ. పోనీ గెలవనీ.

వ్యవహారజ్ఞానం ఉన్నవాడు. నిన్న మొన్నటిదాకా వైస్‌ప్రెసిడెంట్ గిరీ జేసినవాడుగవా'.

'వాడి బొంద. జ్ఞానం విషయ మెవ డాలోచిస్తున్నాడండీ బాబూ. పదవినూ సేవరికి అందరి కళ్లూ వచ్చబాంటేనూ. నిన్నటిదాకా బొడ్డూడనివాడు నాఅల్లుడు నిల్చున్నాట్ట. పొద్దునొచ్చి నామినేషను వడేసొచ్చాను మావాడ అన్జెప్పేదాకా తెలీదు నాకు. ఛెడామడా తిట్టేసు, కనకపు సింహాసనమున.... అని ఎంతో నచ్చజెప్పి జూసేను. 'నసేమిరా' అన్నాడు. గవర్రాజుకన్నా తీసిపోయేనా అన్నాడు. తీసిపోవుగాబట్టే ఒద్దంటు న్నానన్నాను. వినలేదు. అయ్యో! ఆ తర్వాత నా కాళ్లూ చేతులూ ఆడలేదు. సవానరి మీ దగ్గరి కొచ్చేశేనింక. అదీ విషయం.'

'నీ అల్లుడు నిల్చుంటే నీకేమయ్యా? వదవీ, పలుకుబడీ'

చెప్పకండిక పంతులుగామా నే విన లేనంతే. నోట్లో నాలిక లేనివాడు నిల్చున్నా ఒహాటే కూర్చున్నా ఒహాటే గావీ నీతిలేనివాడు లేచి నిలబడ్డాడంటే శ్మశానంగూశా మస్సై పోదటండీబాబూ. మీకేం చెప్తాను. కడుపు చించుకుంటే కాళ్ళమీన పడ్తుంది. మా అంకినీడు గురించి ఏమాత్రం తెలిసిహా మీరలా అన్లేరికంతే. కన్నకూతుప గాబట్టి కడుపులో పెట్టుకుంటున్నాను గానీ— పగవాడిగ్గూశా వద్దండీ బాబూ అటు వంటల్లుడు. వదంతే.'

'ఇంతకీ నేనేం జెయ్యాలో చెప్ప లేదు'

'మీరేం చెయ్యాలంటీ బాబూ. మీరేం చెయ్యక్కర్లేదు. ప్రెసిడెంట్ గిరీకి నేన్నిలబడుతున్నానూ అనొక్క ముక్క జనాలకి చెప్పండంతే. మిగతా పన్లన్నీ వాటంతటవే జరిగిపోతాయింక'

ఏమిటి? నేనా!'

'అవునండీ బాబూ మీరే. ఆలోచిం చకండిహ. మీరు గాకపోతే ఈ కేతి గాళ్ళటండీ అర్హులు. మీరు 'ఊ' అనం డంతే. లేకపోతే ఈ పాలెం ప్రజలకి దిక్కు లేదింక'

తనకు వరసాగ్గా కొడుకులు పుట్టు కొస్తున్నా కలగని ఆశ్చర్యం అప్పుడు గలిగింది అవధాన్లుగారికి.

ఒక్క లిప్త ఆలోచన తర్వాత చిన్నగా నవ్వేరు.

'ఈ ఆలోచన నీకెలా వచ్చిందయ్యా స్వామీ'.

'నా క్కొక్కడికే ఏవి టంటీ బాబూ! మన్నేదో మాణిక్యమేదో తెలుసుకోగల ప్రతివాడికీ రావలసిన ఆలోచనే ఇదీ. మరేమీ ఆలోచించకండిక'

అవధానిగారు తమ సహజమైన నిస్పృహ, శాంత ప్రవృత్తుణవల్ల ఏరా సామి ప్రతిపాదనని అంగీకరించలేదు.

అసలాయనకు రోజులో ఎక్కువ భాగం దేముడి గదిలోనే జరిగి పోతుంది. మధ్యాహ్నం. సాయంత్రం విధిగా గీతాపారాయణమో, పురాణ పఠనమో చేయవలసిందే. తన ప్రతి శ్వాసలోనూ అంతర్భాగమైపోయిన 'దైవ చింతన' ను వదలి 'రాజకీయ చింతన' చేయడానికి ఆయన అంత రాత్మ అంగీకరించలేదు.

కానీ వీరాసామి ఆయన అభిప్రాయాన్ని సుతరామూ అంగీకరించలేకపోయేడు.

ప్రజ లెంత అమాయకులో తెలియజెప్పేడు. వాళ్ళకి ఒక ప్రభువు అండదండ లెంత అవసరమో వివరించేడు. అవతల పదవికోసం ఉబలాట పడుతున్న వాళ్ళెంత దుర్మార్గులో చెప్పి వాళ్ళ కులగోత్రాలు బయట పెట్టాడు. మానవ సేవే మాధవ సేవన్న దేవరహస్యాన్ని మరోసారి గుర్తుజేసేడు. అవధానిగారి లాంటి వాళ్ళందరూ మిన్నకుంటే ఘోరకలి ఎలా ప్రబలిపోతుందో ఉద్ఘాటించేడు. 'అధర్మాన్ని ఉపేక్షించడం అధర్మంగాదా'ని సూటిగా ప్రశ్నించేడు.

వీరాస్వామి ఇంత అవస్థ పడ్డాక అవధానిగారి దగ్గర్నుంచి 'చూద్దాంలే' అన్న ముక్క దీసుకుని బయటపడ్డాడు.

వీరాస్వామి వెళ్ళిపోయేక మన్నేదో మాణిక్యమేదో తెలుసుకో గలిగినవాళ్లు వంతుల ప్రకారం (వచ్చినట్టుగా) వచ్చి అవధానిగారి అభ్యర్థిత్వాన్ని అభ్యర్థించేరు.

రెండ్రోజులు సుదీర్ఘంగా ఆలోచించేక రాత్రిళ్ళు కలలో శ్రీకృష్ణపరమాత్మతో సంప్రదించేక అనాధలైన శ్రేయోభిలాషులకి అభయ మిచ్చేరు అవధాన్లుగారు.

ఆనందం పట్టలేని ఆశ్రితులు 'కొండిభొట్లు అవధాన్లుగారికీ జై' అని మొట్టమొదటి సారిగా వీరాస్వామి నాయకత్వంలో అవధా. గారి భవనాన్ని నినాదాలతో మార్మోగించేరు.

మహాలక్ష్మమ్మగారి కెందుకో దుడుసుకున్నట్లుగా ఒళ్లు జలదరించింది. ఈ నిర్ణయం మంచికా చెడుకా అన్నటువంటి అనుమానపు పొరేదో రెపరెపలాడింది ఆవిడ మనసులో.

ఎలెక్షనాఫీసుకి అవధాన్లుగారి నామినేషన్ గూడా చేరింది. దాంతో అభ్యర్థుల సంఖ్య మూడుకి పెరిగింది.

కరణం గన్రాజు అప్పటికే పాత పరిచయాలు తిరగేయడం ఐపోయింది.

వీరాస్వామల్లుడైన అంకిసిడు కొత్త పరిచయాలు చేసుకోడంగూడా ఐపోయింది.

ఐనా అవధానిగారి పార్టీవాళ్ళు భయపడలేదు. శరవేగంతో జనాల్లోకి దూసుకుపోయేరు. కారు మేఘాల్లా కమ్ముకున్నారు ముక్కుల్లో ఒబ్బిడ వేసినట్టు తగులుకొని ఓటర్ల ఊపిరాడనీయలేదు.

ఎక్కడ చూసినా ఆహాలు .... ఓహోలు .... రుస రుసలు .... గుసగుసలు.... హామీలు .... వాగ్దానాలు .. పరిచయాలూ.. పరాచికాలూ జోరుగా సాగిపోతున్నై.

అంతటా హడావుడి .... కోలాహలం.

ఆరేళ్ళ కిట్టాడుగూడా అరవైయ్యేళ్ళ వృద్ధుణ్ణి ఎడపీధిలో నిలబెట్టి ఫలానావారికి ఓటెయ్యమని శాసిస్తున్నాడు.

ముక్కూ మొహం తెలీనివాళ్ళు మరో ముక్కూ మొహం తెలీని వాళ్ళని ఆత్మబంధువుకన్నా ఆప్యాయంగా పలకరిస్తున్నారు. క్షేమ సమాచారాలడుగుతున్నారు.

ఇన్నేళ్ళ నాయుడుగారి పాలనలో గ్రామ ప్రజలకు జరగని సౌకర్యాలనెన్నిటినో (భూతద్దంగుండా) ఎత్తి చూపి 'ఈ కన్నీళ్ళు, ఈ కష్టాలు కలకాలం కాపురం చెయ్యవ్' అని ధైర్యం జెప్పి' మిమ్మల్నుద్ధరించడానికి నడుం గట్టింది ఫలానా బాబే' అని ఒకటికి పదిసార్లు గుర్తు జేస్తున్నారు.

'ఆ బాబు' హయాం వచ్చేక ప్రజా జీవనం ఎలా మారబోయేదీ టెక్నికలర్ దృశ్యాలలో కళ్ళముందు నిలబెడుతున్నారు.

మొత్తంమీద రోజులు గడుస్తున్న కొద్దీ మామిడిపళ్ళు మాగేసే గదిలోలాగా ఆ ఊరి వాతావరణంలో ఒక విధమైన ఉద్రిక్తత ఏర్పడింది.

రెక్కలొచ్చిన కొడుకులు విదేశాల కెగిరిపోయినా ఎంతో అవసరం పడేతేగానీ గడప దాటి కాలు బయట పెట్టాల్సిన అవసరం కలగని అవధానిగారికి ఈ సందడి సమూహాల్ని చూస్తూంటే తన చుట్టూ ఏం జరుగుతుందో అర్థంగాలేదు. తెలుసుకోడానికి ఉత్సాహం గూడా చూపలేదాయన.

భారమంతా పరానికి సంబంధించినంత వరకూ కృష్ణపరమాత్మ మీనా ఇహానికి సంబంధించినంత వరకూ వీరాస్వామిమీదా వదేసి నిమిత్త మాత్రులై కూచుండిపోయేరు.

వీరాస్వామి బైటనించి లోనికొచ్చినప్పుడెల్లా ఒక్కో విచిత్రమైన వార్త చెప్పేవాడు.

'దొంగ వెధవలు. వాళ్ళ ఎత్తులు జూసేరండీ బాబూ! వీళ్ళ దుర్మార్గానికి నాయుడుగార్ని గూడా అడ్డం పెట్టుకుంటున్నారు కాంగ్రెసువాళ్ళు గాంధీ నడ్డుపెట్టుకున్నట్లు. శిలావిగ్రహం పెట్టిస్తార్ట ఆయనది.'

'ఎవరు స్వామీ ఆ మాట అన్నది'

'ఇంకెవరు బాబూ! మా అంకినీడు పార్టీవాళ్ళే. నా కొళ్ళు మండిందంటే నమ్మండి. వాళ్ళ నక్కవినయాల్జూస్తుంటేను. శిలావిగ్రహమేం కర్మ కంచు విగ్రహమే పెట్టిస్తామని చెప్పమన్జెప్పేనంటే మనవాళ్ళతో. వాళ్ళ రోగం కుదుర్తుందింక. ఒక్కడూ నోరెత్తలేదికంతే.'

నిజమే! ఆయన చేసిన సేవలకి కంచు విగ్రహం పెట్టించినా ఆయన ఋణం తీర్చుకోలేము స్వామీ.'

'ఇదిగిదిగో. మీరిలా అభయహస్తమిస్తారన్దెలిశే మీ తో చెప్పకుండా బయట మాటిచ్చేశాను.

ఈ విధంగా వీరాస్వామి అవధాన్లుగారిని సంప్రదించకుండా ఎన్నో నిర్ణయాలు చేసెయ్యడం వాటికాయన సంకోచించకుండా ఆమోద ముద్ర వేసెయ్యడం మామూలై పోయింది.

ఒకనాడు వీరాస్వామి రుసరుసలాడుతూ లోనికొచ్చాడు. 'దుర్మార్గులండీ బాబూ నరరూప రాక్షసులంతే. ఇలా మనుష్యుల్ని కొనేవాళ్ళను నేనెక్కడా చూళ్ళేదు ఈ పాపాలనీ భూమాత సహించలేదింక.'

'ఏమిటి స్వామీ మళ్ళఏమొచ్చింది'

'నెమ్మదిగా అడుగుతారేమిటండీ బాబూ! అవతల వాళ్ళు మన ఓట్లన్నీ నమిలేస్తూంటేను, ఒకైదు వేలిలా

పారెయ్యండి వాళ్ళు అంతేదో తేలుస్తానిక'

'ఏమిటి స్వామీ ఎందుకు మళ్ళీ డబ్బు'

'ఎందుకేమిటండీ బాబూ వాళ్ళు ఓట్లన్నీ కొనేస్తున్నారు. ఎన్నికల పిచ్చి పట్టి. పరిహేసూ అంటున్నాడు. ఏప్పీ తెలిసీ వాళ్ళకి నోప్పి పెట్టటం కాదటండీ మరి. చూద్దాం. మన వేనా అంత చేతులు ముడుచుగూర్చున్నదీ. ఒక్కసారి గనక మనం చేయి విదిలిస్తే వాళ్ళెక్కడుంటారింక'

"గెలవడం కోసం లంచం గుడా పెట్టాలా స్వామీ. ఇటువంటి నీచప్పనులు చేసి గెలవకపోతేనేం."

పీరాసామి జాలిగా నవ్వబోయేడు గానీ అలానవ్వితే ఏడ్చినట్టుంటుందని మామూలుగానే నవ్వేడు. నవ్వడం పూర్తయేక ఇలా అన్నాడు.

"ఎందుకేమిటండీ బాబూ! మీరింత సత్యకాలపు మనుషులు గాబట్టి మీరు సింహాసనాన్నధిష్టిస్తే మళ్ళీ ధర్మం నాలుగు పాదాలా నడుస్తుందన్న ఆశతోనే మేమిన్ని బాధలు పడుతుంట. మీరెన్ని సంస్థలకి వేల మీద విరాళాలివ్వలేదు. ఇదీ ఒక విధమైన విరాళమే. ప్రజాసేవకే గదా మన మేం చేసినా. ఈ అమాయక ప్రజలు ఆ దుర్మార్గుల చేతుల్లో పడకుండా కాపాడడం కోసం మీరు ఖర్చు బెడ్తే అది నీచప్పనెందుకౌతుందండీ. ఇదీ ఒకవిధమైన ధర్మకార్యమే గదా ...."

అవధానిగారు మారు మాట్లాడకుండా పీరాసామి అడిగిన మొత్తాన్ని చ్చేరు.

పీరాసామలా అడగడం, అవధానిగారలాగే ఇవ్వడం అది మొదటిసారి గాదు. ఆఖరుసారీకాదు. కనుక ఎలక్షను ముగిసే లోపల అవధాన్లుగారు చాలాసార్లు చేయి విదపవల్సొచ్చింది.

రోజులు దగ్గిర పడ్తున్న కొద్దీకీ ఎన్నికల ప్రచారం తీవ్రతరమైంది. ఏనోట విన్నా అవధాన్లుగారి పేరే విన

---

● ప్రఖ్యాతి చెందిన వేటగాడు క్లబ్‌లో మిత్రులకు తన సాహసిక అనుభవాలను చెప్తున్నాడు. "ఒకసారి నేను గుడారంలో కూర్చొని లక్షణంగా భోజనం చేస్తున్నా; ఇంతలో పెద్దపులి వచ్చి సరిగ్గా వెనక చేరి నా మెడను వాసన చూస్తుంటే ఆ వెచ్చని ఊపిరి నాకు తగిలింది, అప్పుడు నేనేమి చేశానో తెలుసా".

అప్పటికే బాగా విసిగెత్తిపోయిన మిత్రుడు లేచిపోతూ :

"బహుశా కాలరు పైకెత్తుకొని వుంటావు" అన్నాడు

—పద్మావతీరాజ మోహన్

బడుతోంది. ఎక్కడ చూసినా ఆయన తాలూకు ఎన్నికల గుర్తే కనబడుతోంది

ఎన్నికలు ముగిశేయి.

ఫలితం ప్రకటింప బడింది.

అప్పుడు మాత్రం అవధాన్లుగారి పేరు వినబళ్ళేదు.

ఫలితం ప్రజల చెవిని బడగానే "అంకిసీడు గారికీ జై" అన్న కేకలు గ్రామాన్నంతటినీ వెల్లువలో ముంచెత్తేయి.

ఈ వార్త వినే సమయానికి భగవత్సన్నిధానంలో ఉన్న బ్రహ్మర్షి "దైవేచ్ఛ" అనుకుని ఒక నిట్టూర్పు వదిలేరు.

ఆతర్వాత ఒక్కొక్కరే వచ్చి అవధాని గారికి తమ సంతాపాన్ని తెలిపి రిప్లైకార్డులా వచ్చినంత అర్జెంటుగానూ వెళ్ళిపోయేరు అంకిసీడు గారికి అభినందనను తెలుపడం కోసం.

ఆ మధ్యాహ్నమే ఒకతను అవధానిగారింటికి పరిగెట్టుకుంటూ వచ్చేడు.

"త్వరగా రావాలి బాబూ! వీరాసామి గారు విషం మింగి ప్రాణం తీసుగోబోయేరు. సమయానికి అదాట్లుగా రద్దు పడ్డారు. ఆయన మిమ్మల్ని చూడాలంటున్నారు."

సాధ్యమైనంత తక్కువవ్యవధిలో వీరాసామెదురుగా నిలబడ్డారు అవధానిగారు.

ఇంటిముందు చాలా మంది జనం ఉన్నారు. గదిలో మంచం చుట్టూ ఉన్న ముఖ్యుల్లో గవర్రాజూ, అంకిసీడూ గుడా ఉన్నారు.

అవధానిగార్ని చూస్తూనే అన్నాడు అంకిసీడు.

'క్షమించండి పంతులుగారూ! కుఱ్ఱతనం వేడిలో ఎందరు జెప్తున్నా వినకుండా ఈ పన్జేశాను. ఇంతవరకూ వసుంధ నెలిస్తే కాలు కదపకబోదును. ఇంత జరిగేక ఈ పదవులూ పలుకుబడులూ నాకొద్దు. ఈ ప్రెసిడెంటుగిరిమీరే దీసుకుని మా మావను బ్రతికించి పుణ్యం గట్టుకోండి. చర్మంతో చెప్పులు కుట్టించు గిచ్చుకుంటాను.'

అవధానిగారు అతన్ని వారిస్తూ తమ సహజమైన చిర్నవ్వుతో జవాబిచ్చేరు.

'తొందర పడకంకిసీడూ. నువ్వు తప్పేమీ చెయ్యలేదు. నిజంగా నాకా పదవిమీద వ్యామోహం లేదు. ఐనా ముసలివాణ్ణి. నీవు కుఱ్ఱవాడివి. యువకులు పన్జేసినట్టు వృద్ధులు చేయలేరు గదా. ప్రజాసేవ జేసే మహద్భాగ్యం నీకు దక్కింది. జాగ్రత్తగా నీ కర్తవ్యం నీవు నిర్వహించు. ఆపైన పరమాత్మ ఉండనే ఉన్నాడు. ఇక మీ మావంటావా స్వామి కొచ్చిన ఆపదేమీ లేదు. ఆచార్ల గారి హస్తవాసి మనకు తెలిసింది గనకనా....'

ఈలోపల వీరాస్వామి కళ్ళు తెరిచి అవధాన్లుగారివేపు పశ్చాత్తాపంతో దహించుకుపోతున్న హృదయంతో చూసేడు. దరిమిలా అందర్నీ ఆ గది విడిచిపెట్టి పొమ్మన్నట్టుగా సైగ జేసేడు.

అవధాన్లుగారు తప్ప మిగతా వారంతా వీరాస్వామి అనుజ్ఞ ప్రకారం

బయటికి నడిచేరు మౌనంగా. అవధాన్లుగారు పీరాస్వామిని ఆప్యాయంగా పలకరించేరు.

'ఎలా ఉంది స్వామీ'

'ఆ మాట మాత్రం అడక్కండి బాబూ నా గుండె మండి పోతోంది. ఉట్టి పుణ్యానికి నాలుగోడల మధ్యనా కృష్ణా రామా అనుకునే మిమ్మల్ని బైటికి లాగేను. నావల్ల మీరు చాలా నష్టపోయేరు బాబూ! ఒహటా రెండా పాతిక వేలు. నే జేసిన పాపానికి ప్రాయశ్చిత్తం లేదంతే ఈ పాపిష్టి మొహం ఇహ మీ కక్కనబడకుండా ఉండాలని ప్రయత్నిస్తే ఆ పాపిష్టి దేవుడు ఆ అవకాశం గూడా ఇవ్వ లేదు. నా పాపానికి నిష్కృతి లేదింక లేదు'

'తప్పు స్వామీ! త్వరపడి దేవుణ్ణి నిందించకు. ఎవరెవరి ఖర్మలో ఎలా జరగాలని రాసిపెట్టుంటుందో అలాగే జరుగుతుంది. అందరమూ నిమిత్త మాత్రులమే. ఆ పాతిక వేలూ నిజంగా నావి కావేమో! అవి ఎవరికి ఎలా చేరాలో అలాగే చేరేయి. నేనేమీ బాధ పడ్డంలేదు. నువ్వేమీ బాధ పడకు. నేనా పదవి ఆశించలేదని నీకూ తెలుసు. నేను కేవలం నిన్ను సంతోష పెట్టడం కోసం, ధర్మసంస్థాపన కోసం స్వంత అల్లుడికే ఎదురు తిరిగిన నీ కోసం నిల్చున్నాను. ఇందులో ఎవరిదోషమూ లేదు. ఎప్పుడేదెలా జరగాలో అలాగే జరుగుతుంది. అందుకు భిన్నంగా జరగలేదని బాధ పడడం అవివేకుల లక్షణం. అయినా గెలిచింది ఎవరో పరాయి వ్యక్తి కాదుగదా! స్వయాన అల్లుడాయె. పెద్దవాడివి. అన్నీ తెలిసిన వాడివి. నువ్వతన్ని చక్కదిద్దుకో పైనుండి. ధైర్యంగా ఉండు. వస్తా నింక'

అవధానిగారు పీరాస్వామికి ధైర్యం జెప్పి గది బయటకు నడిచేరు.

ఆయన బయటకు రాగానే అంకినీడూ గవర్రాజూ లోనికొచ్చేరు.

వాళ్ళిద్దర్నీ చూస్తూనే పీరాస్వామి చెంగున గంతేసి లేచి కూచున్నాడు మంచం మీద

ఏదో మాట్లాడబోతూ యదాలాపంగా కిటికీవేపు చూసిన అంకినీడుకీ, ఆతన్ననుసరించిన మిగతా యిద్దరికీ యింటివేపు సాగిపోతున్న అవధానిగారు కనబడేరు.

మహాప్రస్థానాని కెడుతున్నట్టున్న ఆయన్ను చూడగానే 'నీ కెందుకల్లుడూ నువ్వు నిలబడు. ఎలక్షనుకయ్యే ఖర్చు నేనెలాగో సర్దుబాటు జేస్తాను' అని అభయమిచ్చిన మామా, సకాలంలో మామగార్నుండి సరైన సహాయం పొంది అధికారాన్ని చేజిక్కించుకున్న అల్లుడూ, అందినంతలోనే పదివేలు దిగమింగి తన అభ్యర్థిత్వాన్ని అంకినీడుకి ధారబోసి మళ్ళీ ఉపప్రధాను పదవితోనే తృప్తిపడ్డ కరణం, ముగ్గురూ కలిసి జమిలిగా ఫక్కున నవ్వేరు అవధాన్లుగారికి వినబడదనే ధైర్యంతో—

☐☐☐

# రాక్షసీ, నీ పేరు రాజకీయమా? వర్ధిల్లు!

[గత సంచిక తరువాయి]

## 8

"నీకు సిగ్గులేదురా సత్యం! నువ్వు వాజమ్మవి. వాడి తొత్తువి." అన్నాడు సీతాపతి.

"అవునవును. మహా నీకే వుంది, సిగ్గు! తగుదునమ్మా అని వచ్చి నా ప్రాణం తీసి చిరంజీవిగాడికి పని చేయమన్నావ్. చేసేను, ఇవాళ వాడు నా యింటికి వచ్చి నన్ను పలుకరించి వెడితే నీకది మంటగా వుంది. ఇంటికొస్తున్నవాడిని మెడపట్టుకు గెంటమంటావా?" అన్నాడు సత్యం రోషంగా.

"ఎంత నేను చెబితే మాత్రం అంతపని నువ్వెందుకు చేస్తావులే? పోరాపో! మీకెవ్వరికీ సిగ్గులేదు."

"ఇందాక నా కొక్కడికి అని యిప్పుడు మా అందరికీ అంటున్నావ్. నీ ఉద్దేశమేమిట్రా అసలు?"

"ఉద్దేశమా? ఒరే సత్తిగా, నన్నెందుకు రెచ్చగొడతావ్ చెప్పు. నీకేం తెలీదుట్రా?"

"ఏమిటి తెలిసేది?"

"అమ్మకొడకా! ఎదిగిపోయేవురా బాబూ! అవున్లే చిరంజీవిగాడికి గుండెలు కదూ ఎదక్క ఏమవుతావ్ మరి? ఒరేయ్ మీ రాజకీయాలు తగులబడిపోనూ, ఎంతెంత రాజకీయంరా సన్నాసీ! నేను రాజకీయాలకి వర్రీ కావడం లేదురా బోడిగా. రాజకీయాల్ని ప్రేమల్లోకి తీసుకురావద్దంటున్నాను. అర్థమయ్యిందా?" అన్నాడు సీతాపతి కోపంగా.

ఎన్నికలు పూర్తయిన ఆరు నెలలు గడచిం తర్వాత ఇద్దరూ తీరుబడిగా కూచుని మాటాడుకునే అవకాశం చిక్కింది. వాళ్ళిద్దరూ హోటలు రత్నంలో ఒక మూల కూచుని తర్జన

సీరియల్

భర్జనలు చేసుకోడం ప్రారంభమైంది 'సిగ్గులేనితనం' దగ్గిర్నుంచేసు.

సీతాపతి ప్రేమ పేరు ప్రస్తావించడంతోటే సత్యం చాలా రకాల ఆలోచనలకి గురైపోయేడు. చాలాసేపు నిశ్శబ్దంగా వుండి చివరికి అన్నాడు.

"అయితే నన్నిప్పుడేం చేయమంటావు? వాడిని మా యింటికి

న్నాడు. తెలుసా?"

"అయితే, ఏమిటయిందటిటావ్?"

"ఏమిటయ్యిందా? నువ్వే నా అడుగుతున్నావ్ — ఏమి టయిందని? నీకు చీమ కుట్టినంత బాధైనా లేదుట్రా?"

"నన్నెందుకు కుట్టాలి చీమ?"

"చిరంజీవి మీ సుమతిని ప్రేమిస్తు

---

## జరిగిన కథ — కమామీషు

తిమ్మాపురం పురపాలక సంఘ ప్రెసిడెంటు రామదాసుకు ఆస్తి, అంతస్థు అన్నీ ఉన్నాయి. ఆయన వారసుడు చిరంజీవి కాలేజీ ఎలక్షనులో నిలబడి గెలిచాడు.
ఆ కాలేజీలోనే చదువుతున్న శర ప్రసాదంతో పరిచయం పెంచుకున్న సుమతి అకస్మాత్తుగా ప్లేటు ఫిరాయించి చిరంజీవివైపు మొగ్గుతుంది.
చిరంజీవి పుట్టినరోజు పండుగ. తడి, మడి పార్టీలు. సుమతి వగైరాలంతా హాజరు, రామదాసుగారు మర్యాద కోసం వచ్చిన విద్యార్థు లందరికీ నాలుగు నీతి వాక్యాలు బోధించారు.

—ఇక చదవండి.

---

రానివ్వ కూడదంటావ్, అంతేగా?"

"ప్రేమొకటిపెట్టి ఇల్లంటా కిమ్మిట్రా గాడిదా? ని యింటికి వాడొస్తే నాకేం మంటనుకున్నావా?"

"డొంకతిరుగుడు మాని తిన్నగా మాటాడు."

"వాడు మీ సుమతిని ప్రేమిస్తు

న్నాడురా!"

"చెప్పేవ్."

"మీ సుమతిని నేనూ ప్రేమించేన్రా రాస్కెల్!"

"మరి సుమతి నిన్ను ప్రేమించవద్దూ?"

"ఆ మాటకొస్తే సుమతి చిరంజీవి

గాడినీ ప్రేమించడం లేదు తెలుసా? వాడి మేడనీ, కారుని, వాడి హోదానీ చూచి ఆశ పడుతుందేమోగానొరేయ్, వాడు దొంగ రాస్కెల్! ఉదాహరణ కావల్సొస్తే—నేను. నేనురా! అవసరమున్నంత వరకూ నన్ను వాడుకుని, ఆ అవసరం గడిచిం తర్వాత నన్ను ఫుట్‌బాల్‌ని కొట్టినట్టు కొట్టి పొమ్మన్నాడు. అదే విధంగా, మీ సుమతితో వాడి అవసరం తీరిం తర్వాత సుమతిని పొమ్మంటాడేగాని పెళ్ళి చేసుకోడు. యమదెబ్బగాడు వాడు. వాడి దొంగబుద్ధీ, వాడి నక్కవినయం నాకు తెలుసున్రా సన్నాసీ! పో.... వెళ్ళి మీ సుమతితో చెప్పు. కళ్ళు మూసుకుని గోతిలో పడొద్దని హెచ్చరించు. తెలిసిందా?" అన్నాడు సీతాపతి.

"గొయ్యో నుయ్యో, దానిష్టం. దానిష్ట మొచ్చినట్టు నడుస్తుందేగాని మధ్య మన మొహళ్ళమి సలహాలిచ్చేందుకు?" అన్నాడు సత్యం.

"సుమతి మీ సిస్టర్రా!"

"అందుకని దాని ప్రైవేట్ ఎఫైర్స్‌లో జోక్యం చేసుకోమంటావా? నావల్ల కాదది. 'సుమతీ! నువ్వు చిరంజీవిని ప్రేమించడం మానేసి సీతాపతినే ప్రేమించమ్మా!' అని చెప్పేందుకిదేమైనా కూరగాయల వ్యవహారమా? ప్రేమరా ప్రేమ! ప్రేమనేది జీవితంలో ఒకే ఒకమాటు, ఒకే ఒకడిపైన కలుగుతుంది. అంతేగాని రోజుకో రకంగా రోజుకో మనిషి మీద కలగదు. తెలుసా?" అన్నాడు సత్యం ఆవేశంగా.

సీతాపతి ఫెళఫెళా నవ్వేసేడు. ఆ నవ్వుని మరికొంతసేపు పొడిగించేడు. నవ్వు ఆగిపోవటం తోటే అతవి మొహం ఎర్రబడి వుంది. హోటల్లోవున్న సంగతి మరిచి చాలా రోషంగా అన్నాడు సీతాపతి.

"ఏం చెప్పేవురా సత్తిగా! ఒరేయ్, నువ్వు మరిచి పోయావో, లేక నటిస్తున్నావో గాని మీ సుమతి మొట్టమొదట ప్రసాదం గాడ్ని ప్రేమించింది. నీకూ తెలుసా విషయం. పైగా- అది మామూలుగా ప్రేమించలేదురా, ఘాటుగా ప్రేమించింది. వాడు, ఆ ప్రసాదం గాడు సాధు జంతువు గనక

---

**•అవివాహం•**

---

చేతులు కట్టుక్కూచున్నాడుగానీ అదే మరో రౌడీ వెధవైవుంటే- ఆ పరిచయంతో సుమతికి పుట్టిన ఛైల్డ్‌కి తండ్రై పోయేవాడు. చూస్తూండు, చిరంజీవిగాడు ఆ హోదాకి పెళ్ళి కాకముందే చేరుకోకపోతే నన్ను పేరుతో పిలవకు!"

సత్యం చివాలున లేచి నుంచున్నాడు. గుప్పెట బిగించేడు గాని మళ్ళా వెంటనే తెరిచేడు. గట్టిగా అరవబోయేడుగాని సంబాళించుకొన్నాడు. కానీ, అతి నెమ్మదిగా మాటాడినా, చాలా కటువుగానే అన్నాడు.

"అంత మాటఅని నువ్వు గనక బతికిపోయేవు. అదే మాట మరో

వెధవ ఎవడైనా అని వుంటే వాళ్ళ చీరేసి వుందును. సుమతి నాకు సిస్టరన్న సంగతి మరిచిపో. ఒక ఆడపిల్ల గురించి చెడుగా మాటాడకు. నీ కసేమిటో నాకు తెల్సున్రా! ఎవడో నిన్ను ఛీ కొట్టాడని వాడిమీద నీ మంటని దమ్ములేక మరో మనిషికి అంట గడుతున్నావ్. జాగ్రత్త! ఇంకెప్పుడూ సుమతి ప్రేమ విషయం నా దగ్గిర మాటాడకు అసలివాళనుంచి నాతో ఏమీ మాటాడకు. గుడ్ బై. వెళ్లొస్తా!"

సత్యం వెళ్ళి పోతుండగా సీతాపతి లోలోన కోపంతో మండిపోయేడు!

'పీడుత్త గంగిగోవు! సుమతికి అన్న పీడు. సుమతిని చెడగొట్టి పొరపాటయింది సత్తిగా క్షమించమని వేడుకుంటే పీడిక నో రెత్తడు. ఇంతటి మంచి ముండావాడిని దగ్గిరెట్టుకని బంగారం లాంటి అవకాశాన్ని చిరంజీవి కొదిలేసిన పూల్నేను. నాకైనేను ప్రెసిడెంట్‌గా పోటీ చేసి వున్నా బాగుండి పోను. ఇటీజ్ టూ లేట్ నౌ! ఇప్పు డెన్ననుకున్నా ప్రయోజనంలేదు. జరిగేదేదో జరక్క మానదు. మన జాగ్రత్తలో మన ముండాలి.'

* * *

"సుమతి చిరంజీవి తోచాలాయిదిగా తిరుగుతోంది తెలుసా?" అన్నాడు రవి.

"తెలీదు" అన్నాడు ప్రసాదం.

"మొన్న సినిమాలో చూసేను. నిన్న బీచ్‌లో చూసేను. ఈరెండు తడవలూ వాళ్ళని పెద్దగా పట్టించుకోలేదు గాని, ఇవ్వాళ దెయ్యాల బంగళా దగ్గర వాళ్ళిద్దరూ అతి దగ్గిరగా కూచుని నవ్వేసుకుంటూ ఒకళ్ళ మీద ఒకళ్ళు పడిపోతూ మాటాడుకుంటూ ంటే నావళ్లు మండి పోయింది ప్రసాదం!"

"నీకెందుకు వళ్లు మండి పోవడం?"

"పెళ్ళి కాకుండా, అలా పట్టపగ్గాలు లేకుండ క్లాసు ల్లెక్కొట్టి తిరిగేస్తుంటే వళ్లు మండదూ?"

"అయినా ఆ దెయ్యాల బంగళా వేపు నువ్వెందుకెళ్లేవ్?"

"నువ్వేమో అక్కడ దగ్గిరి కెళ్ళి పోయేవ్. నాకొక్కడికీ తోచి చావదాయె! పుస్తకం తీసుకుని అటు వేపు వెళ్లేను. నీకు తెలుసుగా అదెంత నిర్జన ప్రదేశమో! నేను వాళ్ళని చూచేను గాని వాళ్లు నన్ను చూళ్లేదు."

"ఇంకెప్పుడూ అటు వెళ్ళకు."

చాలా సేపు ఇద్దర్లో ఎవరూ మాటాడలేదు. నిశ్శబ్దాన్నింకభరించలేక రవి సిగరెట్టు ముట్టించుకుంటూ అన్నాడు.

"అయినా ప్రసాదం, ఆడపిల్ల మరీ అంత చొరవగా తిరగడం మంచిది కాదేమో! ఏమంటావ్!"

"పరీక్షలు దగ్గిర పడుతున్నాయి. శ్రద్ధగా చదువు కోవడం మంచిది. ఏమంటావ్?" అన్నాడు ప్రసాదం.

"ఏం మనిషివో గాని నీతో స్నేహం చేయడం బహు కష్టంరా ప్రసాదం." అన్నాడు రవి.

41 ప్రసాదం నవ్వి వూరుకున్నాడు.

—ఆదివారం సాయంత్రం ప్రసాదం బజారునుంచి యింటికొస్తుంటగా

సీతాపతి కారులోవచ్చి అతని ముందాగేడు. డోర్ తెరిచి 'గెటిన్ ప్లీజ్' అన్నాడు.

ప్రసాదం ముందు తటపటాయించేడుగాని మళ్ళీ సీతాపతి బలవంతం చేయగా కారెక్కక తప్పింది కాదు. అతను కారులో కూచున్న తర్వాత స్టీరింగ్ దగ్గరున్న సీతాపతి సర్దుకూర్చున్నాడు హుందాగా.

కారు మెత్తగా పోతోంది. ఆకారు గురించి మాటాడేడు సీతాపతి.

"మావయ్య కొన్నాడు ఇవాళ ట్రైల్ వేస్తున్నాను. అవునూ, ఎల్లా చదువుతున్నారు?"

"ఫర్లేదు."

"ఎక్కడున్నంచేమిటి? మీ ఫ్రండ్ నొదిలి ఒంటరిగా వొస్తున్నారు?"

"లైబ్రరీ కెళ్ళేను."

"అల్లాగా. నేనసలు మీ రూమ్ వేపే వస్తున్నాను. దార్లోనే మీరు కలిసేరు. మనం కలుసుకుని చాలా కాలమైందికదూ?"

"కాలేజిలో రోజూ కనుపిస్తూనే వున్నాంగా."

"ఏం కాలేజినోలేండి. కాలేజి అంటే భయంగా వుంది."

"భయమా?"

"అఫ్‌కోర్స్, సరిగ్గా భయమని కాదనుకోండి, అదోరకమైన నిరుత్సాహం."

"...."

"ఎప్పటికప్పుడు చదువుదామనుకుంటూనే, ఇంతకాలం చదువుని నిర్లక్ష్యంచేసి-ఇప్పుడు పరీక్షరాస్తున్నాయని తెలిసి బెంగపడిపోతున్నాను. వదిలేయండి-చదువు గోల. ఇవాళ, ఈ కొత్తకారుమీద ఒక కొత్త సినీమాకి వెడదాం. ఏమంటారు?"

"వొద్దులేండి. ఏకంగా పరీక్షలైపోయిం తర్వాత చూద్దాం సినీమాలు."

సీతాపతి చిర్నవ్వు నవ్వి అన్నాడు.

"మీలాటి బ్రిలియంట్స్ గూడ ఎప్పుడోవచ్చే పరీక్షలకి యిప్పట్నుంచే చదువు చదువని కలవరిస్తే ఎల్లా చెప్పండి. మొద్దులం మేము చదువుకోసం బెంగపడాలగాని మీకేమండి. నిక్షేపంగా, చదవకపోయినా పాసవుతారు."

"అయినా, నాకు సినిమాలపట్ల అంత అభిమానంలేదు.

"సీతాపతి నిట్టూర్చి అన్నాడు

"పోనీండి. మీ కోరిక ప్రకారం సినీమా మానేద్దాం. కొత్త కారు కొన్నాంగనక, అల్లా బీచ్‌వరకూ వెళ్లొద్దాం, కాదనకండి. ఒక్క అరగంటలో వచ్చేద్దాం. ఓ కే?"

ప్రసాదం కొంతసేపు ఆలోచించి అన్నాడు

"సరె. మీ యిష్టం!"

"థేంక్స్."

"కారు బీచ్‌వేపు సాగింది. బీచ్‌కి దూరంగా కారు ఆపి ఇద్దరూ కాలినడక ప్రారంభించేరు. దార్లో సీతాపతి ప్రసాదంతో తన కుటుంబ వ్యవహారాలు కొన్ని చెప్పటం మొదలుపెట్టేడు.

ఒకచోట —

సీతాపతి మాట లాగిపోయేయి.



అతనూ ఆగిపోయేడు. ప్రసాదం చేతిని పుచ్చుకుని, దగ్గర్లో ఆగివున్న కారుని చూపిస్తూ అడిగేడు సీతాపతి.

"ఆకారెవరిదో గుర్తించేరా?"

ప్రసాదం తెలీదన్నట్టు తలూపేడు. సీతాపతి నవ్వి అన్నాడు.

"ఎకనామిక్స్ పుస్తకంలో ఏ పేజీలో ఏ మేటరుందో చెప్పగలరుగాని ఈవూళ్ళో ఏకారు ఎవరిదో తెల్సుకోలేరు మీరు. ఆ కారు మన చిరంజీవిదండి బాబు."

"విని వూరుకున్నాడు ప్రసాదం. మళ్ళా నడక ప్రారంభించేరు.

"వీడెందుకొచ్చాడో యిక్కడికి. మీతో మాటాడుతూ సరదాగా గడుపుదామనుకుని యింత దూర మొస్తే శనిలాగా వీడూ యిక్కడికి దాపురించేడేమిటి ఖర్మ! పోనీండి వెధవని. మనమలా పోదాం రండి." అన్నాడు సీతాపతి.

సీతాపతి ఏదో దాచేస్తున్నాడని గ్రహించేడు ప్రసాదం.

సరుగుడు తోపులోంచి నడక సాగుతోంది. ఒకచోట సీతాపతి కాళ్ళకి బ్రేకుపడింది. ప్రసాదం చేతిని గట్టిగా నొక్కి చాలా నెమ్మదిగా అన్నాడు.

"అటు చూడండి."

ప్రసాదం అటు చూసేడు.

నేలమీద జంపఖానా వుంది. జంప ఖానామీద తినుబండారాలూ, ఫ్లాస్కూ వున్నాయి. మరోవక్క అందమైన ట్రాన్సిస్టరుంది. వీటన్నిటి మధ్యా చిరంజీవి వున్నాడు. చిరంజీవిగుండెల మీద సుమతి వుంది!

ప్రసాదం గిరుక్కున వెనక్కి తిరిగి అన్నాడు.

"రండి పోదాం!"

"అయ్యో యింకా సినీమా ప్రారంభం కాలేదండి బాబూ! వెళ్ళి పోదామంటా రేమిటి? చెట్టుచాటున ఓపికచేసు కూర్చు న్నా మం టే, బ్రహ్మాండమైన పెక్సు సినీమా చూడొచ్చు. వుండండి." ప్రాధేయ పడ్డాడు సీతాపతి.

ప్రసాదానికి వళ్ళు మండిపోయింది. వేడిగా అన్నాడు.

"మీరొస్తే రండి. నేను వెళ్ళి పోతున్నాను.

సీతాపతి ప్రసాదంవేపు చూచి చాలా మర్యాదగా అన్నాడు.

"సరె. మీ యిష్టం! మీరు వాతో యిక్కడికి రావడాని కిష్ట పడట్టు నేను మీతో తిరిగి వెళ్ళిపోడాని కిష్టపడుతున్నాను. ఈ బూతు సినీమా రోజూ వుండేదేగా! మరోవాడు నే నొక్కడ్నీ చూస్తాన్లెండి. పదండి పోదాం."

ఇద్దరూ తిరుగు మొహం పట్టారు. వాళ్ళిద్దరూ కారులో కూచున్న తర్వాత కారు కదిలింది.

దార్లో ప్రసాదం సీతాపతి నడిగేడు.

బీచ్‌లో వాళ్ళిద్దరూ వుంటారని మీకు ముందే తెలుసుగదూ!"

"అహా. తెలుసు. ఈ చోద్యాన్ని మీకు చూపించాలనే మిమ్మల్నిక్కడికి తీసుకొచ్చేను. ఇందాక సినీమాఅన్నాను చూడండి-మీరు సినీమాకి రానన్నారు. అవునా? సినిమా అంటే ఏవనుకున్నారు? మీరేవనుకున్నారో నాకు తెలీదుగాని మన ఉద్దేశంలో సినీమాంటే ఈ రామాయణమనే!" అన్నాడు సీతాపతి తాపీగా.

"నేను ఈ సినీమావి చూస్తే మీక్కలిగే ఆనంద మేవిటో గూడా చెప్పండి సీతాపతిగారూ ?"

సీ తా ప తి నవ్వి సమాధానం చెప్పేడు

"నా ఆనందం మాట దేవుడి కొదిలేయండి సుమతి మడికట్టుకున్న ఆడపిల్ల కాదని మీరు తెలుసుకొంటే చాలు అందికే, మిమ్మల్ని తీసు కొచ్చేను "

"పరాయివాళ్ళ మడీ దడీ మన కెందుకు చెప్పండి ?"

"అదేమిటి గురూగారూ ! విడ్డూ రంగా మాటాడుతున్నారే ! సుమతి మీకు ప యి ఆడపిల్లా ? నన్ను నమ్మమంటారా ?"

"మీరు నమ్మినా నమ్మకున్నా నామాట మాత్రం అదే ! రేపో మాపో చిరంజీవిని పెళ్ళాడబోతున్న సుమతి గురించి మ న ం మాటాడుకోడం మంచిదికాదు మరో రిక్వెస్టు మనం చూచింది యిక్కడే మరిచిపోదాం ప్రచారం చేయకుండా జాగ్రత్తపడదాం ఒ కే ?'

సీతాపతి ఏమనుకున్నాడో ఏమో గాని మరి మాటాడలేదు

కారు తిన్నగా వచ్చి ప్రసాదం గదిముందు ఆగింది

ప్రసాదం కారుదిగి గదిలోకి వెళ్ళేడు

[సశేషం]

# ఉత్తమ సంగీత వనమాలి

# ఉస్తాద్ బడే గులాం అలీ

భారీ శరీరం; భయంకరమైన మీసం, మాంసలమైన వదనం, మొత్తం మీద స్థూలమైన ఆకారం, "సంగీతానికి సదనం" అంటే ఎవరు నమ్ముతారు? కాని నమ్మక తప్పదు, కారణంతలకీ మొండేనికిమధ్య ఉన్నచె క్కని మెడ (గళం)లోంచి ఉస్తాద్ బడేగులాం అలీఖాన్ సంగీతం సముద్రంలా పొంగి ప్రవహించేది, అనర్గళంగా. అంతటి మహాకాయుడు అంతటి మహాగాయకుడవడం. అనడం వింతగా తోచక మానదు. కొంతమంది అనను భవస్థులకి.

కచ్చేరి ఇచ్చేటప్పుడు స్టేజిమీద తాళం పెట్టుకూర్చునే ఆ విందు విగ్రహం రమారమి రెండేళ్ల క్రితం అనంతంలో లీనమయింది. ఇక పైన కంటికి కనిపించక పోయినా, చూడగల మనసులకి మాత్రం కనిపించక మానదు. ఆయన అమర సంగీతం మామూలు చెవులకి అందకపోయినా మనసులకి వినిపించక మానదు. మార్మోగుతూనే వుంటుంది నిరంతరం.

పేరులో 'గులాం"(బానిస) అయినా కళాప్రాభవంలో శాహన్ శాహ (చక్రవర్తి] మానవ శారీరం (స్వరం) వలన గలిగిన స్వరగతులన్నీ సాధించి పలికించి నవరసాలొలికించిన బడేగులామాలీ కమనీయమైన కంఠం వజ్రం కన్నా కఠినం; నవనీతంకన్నా మృదులం. తుపాను కన్నా ప్రచండం. మనశ్శాంతి కన్నా ఆహ్లాదకరం, తృప్తికరం. "గులాం" కరం (హస్తం) ఉదరం పైన బైఠాయించి సుర్ మండల్ (హార్ప్) తంత్రులను, లావైన వేళ్లతో మీటుతూ, నాట్యం చేస్తూ, గళతంత్రులను వాటితో శృతిపరచి, మేళవించిన తక్షణం' సంగీత సభలలో, శ్రద్ధావాతావరణం, నిశ్శబ్దావతరణం ప్రభవించేవి. శ్రోతల చెవులూ, కళ్లూ తదితరాంగాలూ సంగీత శ్రవణం పైనే కేంద్రీకరించ బడేవి. పదుగుపడినాచలించని ఉత్కం

పి. బి. శ్రీ ని వా (యి) స్



కీ. శే. ఉస్తాద్ బడే గులాం అలీ

తంతోనూ ఉత్సాహంతోనూ, ఉద్వేగోద్రేకాలతోనూ, ఒళ్ళంతా చెవులు చేసుకొని వినేవారు మంత్రముగ్ధులైన శ్రోతలు. గులాం అలీ అనన్యాభిమానులకిక పై, రికార్డులూ, టేపు రికార్డులే దిక్కు.

"ఇల్లాంటి" సంగీతావతార పురుషులు" సంభవించడమే అరుదు. అట్లాంటప్పుడు, వీరు తమ కోసమని నాద బ్రహ్మంలో ఐక్యమయి పాడుగానే సందర్భాల్లో ప్రభుత్వమో, మరి ఇతర శక్తియుతులైన ప్రముఖులో, వారితోకూడ ఎల్లప్పుడూ ఒక టేపు రికార్డరూ, కొత్త టేపులూ సిద్ధంగా, వుంచి అనన్య సాధితాలైన అపూర్వ రాగాలయ భావ బావనా ప్రయోగాలన్నిటినీ ధ్వని ముద్రితాలుగా చేసి వుండివుంటే ఎంత బావుండేది!" అనిపిస్తూవుంటుంది నాకు.— తాన్ సామ్రాట్ ఉస్తాద్ నసీర్ అహమ్మద్ ఖాన్, నజాకత్ ఆలీఖాన్, సలామత్ అలిఖాన్, గులాం ముస్తఫా అలీఖాన్ ప్రభృతుల గానం వినేప్పుడల్లా, ఆ మహామహుడి పోకడలూ, ఛాయలూ స్మృతి పథంలో మెరుస్తూ మురిపిస్తూ వుంటాయి నన్ను. అనుకోకుండా కళ్ళు చెమ్మగిల్లుతూ వుంటాయి బడేగులాం నిధనంవల్ల సంగీత ప్రపంచం పొందిన ఘన నష్టాన్ని తలుచుకుని. 1908 లో లాహోర్లో జననమందిన ఈసంగీతావతార పురుషుడు, పరంపరాగత సంగీత కళా కుటుంబ సభ్యుడే. వీరి తాత

ముత్తాతలలో, పేరుమోసినరాజ విద్వాంసులూ సంగీత శాస్త్ర పారంగతులూ వున్నారు. మేనమామ కాలేఖాన్ వద్దే, తమ అయిదవ ఏటనే సంగీతాభ్యాసం ప్రారంభించారు మన "గులాం". కాలేఖాన్ దివంగతులైన అనంతరం, తండ్రి అలీ బఖ్ష్ గారే వీరికిగురువులై మార్గ దర్శకులై, కుమారుడి సంగీత శక్తికి సక్రమమైన రూపు కల్పించారు. క్రమేణా ఘన సాధనా సంపత్తితో సంగీత శాస్త్ర పరిశోధన కావించి తమ బాణి నొకదాన్ని సృష్టించు కొన్నారు. శ్రీ బడేగులాం

స్వరిది పటియాలా ఘరానా, శబ్దోచ్చారణకూ, భావగంభీరతకూ శృంగార ప్రాధాన్యతో సంపూర్ణత్వం ప్రసాదించే ఈ ఘరానా ఘరానా పద్ధతులకు స్వానుభవ సంపాదితాలైన నవీనతలు చేకూరిచి, మరింత పుష్టిని ప్రసాదించారు ఉస్తాద్ గులాంఅలీఖాన్. అనుమంద్రం అడుగునించి, తారస్థాయి తల పైకి గూడా సునాయాసంగా, అవలీలగా నడుస్తూ, పరిగెడుతూ, దుముకుతూ, దుదుకుగా అర్భటిస్తూ, ఒయ్యారాలతోనూ, మెరుపు వేగాలతోనూ, సయ్యాటలాడుతూ, భావమార్దవ గాంభీర్య పరిపూర్ణతా స్వాతంత్ర్య పాతేయాలతోవిరాటంకంగా పయనిస్తూ గమ్యస్థానమైన శ్రోతృ హృదయాన్ని సమారంభ ప్రారంభంలోనే చేరుకునే వీరి గళసామర్థ్యం అనితరసాధ్యం, అనూహ్యం. ఈ అసాధ్య సామర్థ్యం వీరి అమోఘ సాధనా సంపాదితమే కాక దైవదత్త సహజ మేధాబలోపాదితం.

శాస్త్రీయ సంగీతంలోనిష్ణాతులయినా "లకీర్ కా ఫకీర్" (సాంప్రదాయ దాసులు) గా వుండి పోకుండా కాలానుగుణ్యములైన మార్పులూ కూర్పులూ, కావించడానికే మాత్రం వెనుకంజ వేయని ధైర్య స్థైర్యశాలి శ్రీ గులాం అలీ. అపశ్రుతి అనేది లేనేలేదని వీరి వాదం, విశ్వాసం. సృష్టిలోని ప్రతీ శబ్దం సుశ్రుతిబద్ధం అనీ, నియమిత స్వరగతుల్లో భిన్నగతి ఏర్పడినప్పుడు అపశబ్దంగా అనిపిస్తుందేకాని, కాదనీ. పాడి నిరూపించారీ అపర సంగీత బ్రహ్మ — మద్రాసులో రసికరంజనీ సభలో తాము మొదటి సారిగా పాడిన సందర్భాన.

మనస్సును మించిన వేగంతో ఒక "తాను" యోచిస్తూన్న సమయంలో గళంజారి, అన్య స్వర ప్రదేశాన్యాయ ప్రవేశం సలిపిన తోడనే, ఆ స్వరాన్ని ఆధారషడ్జమంగా మార్చి, రాగచ్ఛాయాంతరం తోపించి, అద్భుతమైన చాకచక్యంతో సంచారం చేసి, పావుగంటసేపు పర్యటించి, ప్రస్తుత రాగప్రదర్శన ప్రారంభించే సరికి, సభలో కూర్చుని తన్మయత్వంతో ఆలకిస్తూన్న, కొమ్ములు తిరిగిన సంగీత శిరస్సులు, సరస్సులో గాలి తరంగాల తాకిడికి కదలులాడే కమలాల వగిది ఉయ్యాలలూగాయి. పెదవులు విస్మయంతో "వ్వా వ్వా వ్వా" అని చప్పరించాయి వీరి గొప్ప

తనాన్ని మెచ్చుకుంటూ-కరతాళధ్వనుల ఘోషకు కరమెత్తి సలాం చేశారు ఉస్తాద్ గులాం-నా బలవంతం మీద ఆ ప్రోగ్రాం వినడానికి వచ్చిన లలిత సంగీత ప్రియులైన కొందరు మిత్రులు (నేటి ప్రఖ్యాత దర్శకులూ రచయితలూ అయిన "బాపు రమణ" లతో సహా) శోహారు లర్పించి, నా కన్నా భక్తులై కూర్చున్నారు.—లోకాన్నే మరిచిపోయి, "మధ్యలో తప్పకుండా వెళ్ళిపోతామని ముందే హెచ్చరించి మరీ వచ్చిన ఈ మిత్రులు ప్రతిజ్ఞని మరిచిపోయి, కచ్చేరీ కదం ఓదాకా కదిలితే ఒట్టు. "శాస్త్రీయ సంగీతంలో ఇంథలాలిత్యం వుందా!" అని అబ్బురపడి కనుబొమ్మల్ని ఎగరేసి, కనులు విప్పారించారు ఈ లలిత సంగీత భక్తులు సైతం.

ఆ కచ్చేరీ అనంతరం, "మద్రాసు" ప్రాంతీయ భాషా పక్షపాతాలను విస్మరించి, బడేగులాంని పదే పదే పిలిపించుకుందంటే "ఖాన్‌సాహెబ్" ప్రతిభకు వేరే విదర్శనం అనవసరం! స్వర స్థానాల నన్నింటినీ స్వస్థలాలుగా పరిణమింపజేసుకున్న ఈ స్వర మేధావి స్వరాలతో ఆడుకునేవారు! పిలిచి నంతనే పలికి పీకవాలోంచి బిరకాలు మెలికలు తిరిగి పరుగెత్తి అరుదెంచి మరలిపోయేవి. తానులు తుపాముల్లా రుతిపించేవి. నయవినయ విరహ గీతాలు, నయనాలను తడిపించేవి. భజన్‌లు భక్తిపారవశ్యంలో ముంచెత్తేవి. ఠుమ్రీలు కమ్మగా హాయిగా సాగి శృంగార శైలితో ఉత్తేజపరిచేవి. విరహరసం ఒలికిస్తూ "శాకరూ! నజనీ ఆ ఏనబాలం" భైరవిలో అందుకోగానే సభలో చప్పట్లు ఆకాశాన్నందుకుని, పది నిమిషాల పిదపనే పాట సాగగలిగే పరిస్థితి తెచ్చిపెట్టేవి. మాల్కౌంస్, పూర్యా, జైజైవంతి, మార్వా, అడాణా, దేస్, సోహనీ, పీలూ, ఖమాజ్, భాగేశ్రీ, భీంపలాసీ, పహాడీ, భైరవీ మున్నగు ప్రజారంజకములైన క్లిష్ట రాగాల్లో అంతకన్న పదింతల ప్రతిభ చూపగలిగిన అఖండ గాన తపస్వి శ్రీ ఉస్తాద్ బడే. అలవాటులోలేని రాగాన్నైనా అప్పటి కప్పుడు ఆలపించి సర్వసామాన్యమైన రాగంలా నడిపించ గలిగిన రాగ కోశాధికారి శ్రీ గులాం. నవీన స్వర సమ్మేళనాలతో నవీన రాగప్రయోగాల ప్రయోజనాత్మకంగా సృష్టించగలిగిన సంతోష జనకులు శ్రీ ఆలీఖాన్.

ఇందుకొక సంభ్రమజనక సంభవ విశేషాన్ని ఉదాహరిస్తాము. రసి! రంజనీ సభలో ఉస్తాద్ కచ్చేరివి! ఉద్రేకోన్మాదావస్థదాకా వెళ్ళిన వేమ వ్యక్తిగతంగా ఆయన ఆశీర్వాద

పొందాలని, బడేగులాం బస జేసిన విడిదికి వెళ్ళాను. శ్రీరంగనాథుడి శేజులో శయనించి విశ్రమిస్తూన్న శ్రీ గులాం ఆలీ విశ్రామ సమయంలో సహా రాగాలాపన సాగిస్తున్నారు.

ఏ ఆధారం లేకుండానే సుర్ మండల్ వాద్యం ఆలీఖాన్ బొజ్జమీద విశ్రమించింది. చుట్టూ రసిక ప్రముఖులు ఆసీనులై వున్నారు. శ్రీమతి ఎమ్. ఎల్. వసంతకుమారికూడా ఒక ఆగంతుకురాలు. అందరికీ నమస్కరించి ప్రక్కగా ఒదిగి కూర్చున్నాను.

ఎమ్. ఎల్. వి. ఒక అపూర్వ కర్నాటక రాగం పేరు చెప్పి దాని కీడైన హిందూస్తానీ రాగం ఏది అని ప్రశ్నించారు తెలుసుకోవాలని. గులాం ఆ రాగం ఆరోహణావరోహణ లేవి అని అడిగి, హిందూస్తానీ సంగీతంలో ఆ రాగానికి ప్రతిబింబమైన రాగం తనకు తెలియదని మనవి చేసి, మాటాడుతూనే సుర్‌మండల్ తంత్రుల్ని ఆ రాగం ఆరోహణ అవరోహణల ప్రకారం శృతి పరిచి, ఆ రాగచ్ఛాయలలో రెండు మూడు ఫ్లరిషెస్ (ఝూలాలు) ఇచ్చి, గృహ సభతో సదరు రాగంయొక్క వాతావరణం సృష్టించారు.

ఆ సమయాన ఒక మహమ్మదీయ వ్యక్తి సభకి విచ్చేసి సలాంచేసి కూర్చున్నాడు. అతనిచేతిలో "గజల్‌కీ కితాబ్" చూసి, అడిగి, అందుకుని, గబుక్కున ఓ గజల్, ఉపర్యుక్త రాగాన్ని ఉపయుక్త రాగంగా మలచుకుని అదే రాగంలో ఆలాపించారు. అనాలోచితంగా ఆశువుగా అరగంట సేపు ఇతరుల కోసంకాక, తమకోసమే పాడుకున్న రాగమేమో, బడేగులాం చేసిన కచ్చేరీలన్నీ ఒక ఎత్తు; ఆ అర ఘంట గజల్ ఆలాపన ఒక ఎత్తు. కట్టలేం దానికి కిమ్మత్తు. ఆ అర గంటలో అక్కడున్న మా అందరికీ అందించారు ఆలీ ఆనందపు సంపత్తు.

అపరిచిత రాగంలో అంతసేపు అద్భుతంగా ఆలపించిన "ఆలీ ఖాన్" ను ఆశ్చర్యంతో తిలకించారు ఏమషీమణి పద్మభూషణి, వసంత కుమారి. ఆమెకూడా ఊహకందని ప్రయోగాలు ఆ ఆలాపనలో జరగడమే ఆమె ఆశ్చర్యానికి కారణం. ఆమె - "ఉస్తాద్‌జీ! ఈ విధంగా ఎలా పాడగలుగుతున్నారు?" అని అడిగిన దానికి "ఆలీ" సమాధానం "అల్లాకా ఫజల్" (అల్లా అనుగ్రహం) అని ఆకాశాన్ని చూపించే వినయ హస్తం. కనకనే "విందుకుండ" లా చెవుల విందుపుగా వుండేది వీరి విగ్రహం. ఈ విగ్రహానికి ప్రభుత్వంవారు దుశ్శా



జ్యోతి

బవ కప్పి "పద్మశ్రీ" ప్రసాదించారు. వీరి కళాసేవను ప్రశంసిస్తూ.

గులామాలీ గ్రామోఫోన్ రికార్డులు చాలానే యిచ్చారు. వాటిల్లో చాలా మట్టుకు పాప్యులర్ అయినవే; చాలా మందికి తెలిసినవే. "కాకరూ (సజనీ."

"తోరీ తిర్‌ఛీ నజరియాకే బాన్"

"ప్రేమ్‌కె ఫందేమె ఆకర్ సజనీ"

"సైయ్యా (బోల్", "కటేన బిర్ హాకీ రాత్".

"యాద్ పియాకే ఆఏ" మొదలైన అమృతమయ గీతాలను చపి చూడని చెవులరుదు.

బడేగులాం గొంతులోనే వింత జీవం వుంది. తనకే సొంతమైన యాస (ఏక్సెంట్) వుంది. తూకమైన తూకం వుంది. స్వరప్రయోగాలలో ఏ ప్రయోగంతర్వాత ఏ ప్రయోగం రక్తి కట్టుతుందో అధ్యయన పూర్వకంగానూ, అనుభవ పూర్వకంగానూ ఎరిగిన అనేక గాయకచక్రవర్తులలో "గులాం"ది అగ్రస్థానం. భావం ప్రతిబింబిస్తూ హావభావాలు ప్రదర్శిస్తూ, "కాకరూం సజ్‌నీ ఆఏన బాలం" అని వియోగిని వేదన నభినయిస్తూ అనుభవిస్తూ ఆలపించే సమయాన అంతటి మనిషి విరహబాధక్ గురి అయిన అందమయిన అమ్మాయిలా అగపడేవారు. అలసట తెలియని "ఆలీ", మధ్య మధ్య సోదరుడు "బర్కత్ అలీ" కి అవకాశం వదిలేవారు. అన్నకి తగిన తమ్ముడనిపించుకునేలా "బర్‌కత్" ఆడియన్స్ ఆనందాన్ని "బర్‌కత్" (పెంపు) పొందించేవారు....గులాం కొడుకు "మునవ్వర్" కూడా "అబ్బాజాన్" కి శ్రమ తగ్గించేందుకన్నట్టు తానులు విసురుతూండేవారు. మొత్తం మీద ఈ ముగ్గురి సంగీతోత్తుంగ తరంగ గంగా ప్రవాహంలో స్నానాలుచేసి. శ్రోతల హృదయాలు, దారుణ జీవన క్లేశ కల్మషాలని కడిగేసుకుని. సంతృప్తితో నిండిపోయేవి.

"సంగీతం కోసమే పుట్టి, సంగీతంలోనే పెరిగిన ఈ ఘనవిద్వాంసుణ్ణి "పక్షవాతం" విష్పక్షపాత బుద్ధితో ఎదుర్కొంది.

దానితో పోరాడుతోనే, ఏ మాత్రం లొంగకుండా అనారోగ్య పరిస్థితిలో కూడా ఈ సంగీత ప్రాణి గంటల తరబడిని ప్రోగ్రాము లిచ్చేవారు. "బొంబాయి" లో షణ్ముఖానంద సభలో పాడేందుకని ఈయనను, అనుయాయులు పల్లకీలో మోసుకు తీసుకొచ్చి. భుజాలపై ఎత్తి స్టేజిమీదికి జార్చి కూర్చోపెట్టవలసిన పరిస్థితి వచ్చింది. డాక్టర్లు వివాదించినా, "సంగీతం పాడని జీవితం నాకెందుకు?" అని వాదాడి, మొండితనంతో. కచ్చేరీలో పాడుతూనే వుండేవారు. అనారోగ్యాన్ని కూడా జయించిన "బడేగులాం" మృత్యుదేవతకు మాత్రమే గులామై, "అల్లాతాలా" అందుకున్న సలామై హైదరాబాదులో శాశ్వతంగా కన్నుమూసి అవతారం చాలించారు. ఈ మహనీయ గాయకుడి పవిత్ర చరిత్ర భావిగాయకు లందరికీ ఆదర్శప్రాయం ! !

# నటసామ్రాట్ పద్మశ్రీ

## అక్కినేని నాగేశ్వరరావు పేరున

### మూడు విశ్వవిద్యాలయాలకు విరాళాలు

ఫిబ్రవరి 14 వ తేదీన హైదరాబాద్‌లో జరిగిన సభలో పద్మశ్రీ నాగేశ్వరరావు హైదరాబాదు విశ్వ విద్యాలయంవారికి స్వయంగా ఇచ్చిన 25 వేలు విశ్వవిద్యాలయం వారు స్వీకరించారు.

ఫిబ్రవరి 20 వ తేదీన బెంగుళూరులోని లాల్‌బాగ్‌లో జరిగిన రజతోత్సవ కమిటీవారు చేసిన సన్మాన సభలో పద్మశ్రీ అక్కినేని నాగేశ్వరరావుగారి పేరున ఇచ్చిన రు 25 వేలు విరాళము బెంగుళూరు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు శ్రీ తుకోల్ స్వీకరించారు.

ఫిబ్రవరి 21 వ తేదీన తిరుపతిలోని యూనివర్సిటీ గ్రౌండ్సులో జరిగిన మహాసభలో రజతోత్సవ కమిటీవారు




కలకత్తా ఆంధ్ర సమితివారు పద్మశ్రీ నాగేశ్వరరావుకు పశ్చిమ బెంగాల్ ముఖ్య మంత్రి (మాజీ) అజయ్ ముఖర్జీ ద్వారాను, పద్మశ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావుకు కేంద్ర కార్మిక మంత్రి సంజీవయ్య ద్వారాను రజిత విగ్రహాలు అందజేస్తున్న దృశ్యం.



'పెళ్ళి సంబంధం' లో వాణిశ్రీ, విజయనిర్మల

పద్మశ్రీ అక్కినేని నాగేశ్వరరావుగారి పేరున ఇచ్చిన మరొక రు 25 వేలు విరాళము శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు శ్రీ డి. జగన్నాథరెడ్డి స్వీకరించారు.

అత్యంత వైభవంగా జరిగిన ఈ మూడు సమావేశములలోను తాను పేదరికముచేత విద్యావంతుడు కాలేకపోయినందున, దవిలోని కష్టసుఖములు అనుభవించినందున పేద విద్యార్థులకు ఉపాధి కల్పించేందుకే తాను ఈ మహా



'మనసిచ్చిచూడు'లో పద్మిని

కార్యాన్ని తలపెట్టినట్లు, కళాకారుడుగా తాను ఇంతవరకు సంపాదించిన దాంట్లో మూడవ వంతు విద్యా సంస్థలకు, విశ్వవిద్యాలయములకు, విద్యాభివృద్ధికి విరాళాలు యిచ్చినట్లుగా పేర్కొన్నారు. తాను వొసంగిన విరాళాలనుండి పేద విద్యార్థులకు ఉపాధి, విశ్వవిద్యాలయంలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులైనవారికి సువర్ణ పతకము బహూకరించవలసిందిగా విశ్వవిద్యాలయముల ఉపాధ్యక్షులవారిని ప్రత్యే కంగా కోరినారు. తాను కళాకారుడుగా ఎల్లప్పుడు పని చేస్తానని, అందరి అభిరుచులకు అనుగుణంగా తాను అనుసరిస్తానని చెప్పారు

బెంగుళూరు లాల్‌బాగ్‌లో జరిగిన సభలో శ్రీ సురేంద్రనాధ్ బెనర్జీ స్వాగతం చెప్పారు. బెంగుళూరు విశ్వవిద్యాలయ అధ్యక్షులు రాష్ట్రి గవర్నరు శ్రీ ధర్మవీర శ్రీ నాగేశ్వరరావు గుణగణాలను ప్రస్తుతించారు. ప్రథమ కన్నడ నిర్మాత శ్రీ గుబ్బి వీరన్న, ప్రఖ్యాత కవి శ్రీ ఎ. ఎన్. కృష్ణారావు శ్రీ నాగేశ్వరరావు ఔదార్యానికి వారి ఆనందాన్ని వ్యక్తపరచి, ఆశీర్వదించారు. అనేక సంస్థలు, సంఘాలు, వ్యక్తులు శ్రీ నాగేశ్వరరావును పూలమాలాలంకృతులను చేశారు. వినోద



'మరో ప్రపంచం' లో నాగేశ్వరరావు

కార్యక్రమములు జరిగినవి.

ఫిబ్రవరి 21 వ తేదీ తిరుపతి విశ్వ విద్యాలయ ఆవరణలో జరిగిన బ్రహ్మాండమైన సభలో పద్మశ్రీ అక్కినేని నాగేశ్వరరావు రజితోత్సవ కమిటీ వారి విరాళము రు 25 వేలు స్వయంగా ఉపాధ్యక్షులు శ్రీడి జగన్నాధరెడ్డిగారికి అందజేశారు విశ్వవిద్యాలయ అధ్యాపక బృందము వారు శ్రీ నాగేశ్వరరావు ఔదార్యాన్ని కొనియాడారు.

## రవీంద్ర ఆర్టు పిక్చర్స్

# "ధర్మదాత"

నిర్మాత తమ్మారెడ్డి కృష్ణమూర్తి రవీంద్ర ఆర్టు పిక్చర్స్ బానర్‌తో నిర్మిస్తున్న చక్కని సెంటిమెంటుగల సాంఘిక చిత్రం "ధర్మదాత" పంచ రంగుల నృత్య దృశ్యాలతో చాలా భాగం పూర్తయింది.

డాక్టర్ సి. నారాయణరెడ్డి రచించిన...."ఓ చిన్నారి బుల్లెమ్మా - సిగ్గెందుకు లేదమ్మా" సరసాల విరసాల చమక్కైన చక్కిలి గింతల పాటను సయ్యాటలను నాగేశ్వరరావు, కాంచనలపై మనసులు జిల్ మనేలా మద్రాస్ అడయార్ స్విమ్మింగ్ పూల్ వద్ద దృశ్యీకరించారు.

మధుర గాయనీ, గాయకులు పి. సుశీల, ఘంటసాల చక్కగా పాడిన యుగళగీతి.... "పరమేశ్వరీ— జగదీశ్వరీ" పాటను కమనీయ దృశ్యాలవాలమైన పాతనూరు డాంవద్ద నాగేశ్వరరావు, కాంచనలపై చిత్రీకరించారు

హాస్యనటి గీతాంజలి విజయపురి రాణిగా అవతరించి-ప్రేక్షకుల్ని గిలిగింతలు పెట్టి వింత, వింత నవ్వుల్లో ముంచనున్నది

ధర్మదాతగా నాగేశ్వరరావు, విషప్పింది వియ్యంకుడుగా నాగభూషణంల మధ్య చెలరేగిన—బొబ్బిలి వీరుల్ని మరపించే వీరావేశాలు—రోషాలతో మీసాలు మెలివేసి పలికిన ప్రతిజ్ఞా పటాటోపాల ఉద్రేక సన్నివేశాన్ని దర్శకులు అద్భుతంగా చిత్రీకరించారు. ఈ చిత్రానికి దర్శకులు సంజీవి.


"నా దేశం" లో చంద్రకళ



ప్రప్రథమంగా దక్షిణ భారత దేశంలో 'ఇంగ్లీషు' లో ఒక పాట రికార్డు చేయబడ్డ సమయంలోని దృశ్యం: (ఎడమనుంచి కుడి): బి. రాధాకృష్ణ, బి. కాం; (ప్రొడ్యూసర్-స్పాన్సోరర్). పి. బి. శ్రీనివాస్; ఎ. ఎ. రాజ్; శ్రీమతి యస్ జానకి; మోహన సుందరం (రికార్డిస్టు)

---

# మానవుని గగన విజయం

మానవుడు కనిన కలలు, ఆశయాలు అన్నీ చంద్రోపరితలంపై మానవుడు కాలూనడం, తిరిగి తన భూమాను సురక్షితంగా జేరడం వల్ల, విజయవంతం అయాయి. యీ మానవ విజయోత్సవ సందర్భంగా యీ గ్రామఫోను రికార్డు ఒక ప్రత్యే-

చంద్రుని వద్దకు మానవుని ప్రయాణం మరియొక వైపున చంద్రుని-వద్ద నుండి దైవము వద్దకు ప్రయాణం చిత్రించబడింది.

యీ గానంలో మాండలిన్, గిటార్ లతో మొదలై భూమికి ప్రతిబింబంగా ఆధార షడ్జం. గగనాన్ని హెచ్చు

షణ్ణం యివ్వబడింది ఆపైన రాకెట్టు గగన ప్రవేశం అయినప్పుడు కల్గేట్టి ధ్వని రూపం యివ్వ బడ్డది మానవుడు చంద్రునిపై కాలూనడం గైతారు యిచ్చే గిర శబ్దం వల్ల తెలుస్తుంది. యీ పాట ఒకటవ స్థాయిలో భూమి నుండి గగనంలోకి ఆతర్వాత రెండు అనగా చంద్రుని చేరును. న్యూమరాలజీ ప్రకారం కూడ రెండు అనగా చంద్రుడు ఆరికార్డు రెండవ ప్రక్క చంద్రుని నుండి గగనంలోకి ప్రవేశించి ఆతర్వాత భూమిని చేరడం చక్కటి ధ్వని క్రమాన్ని బట్టి తెలుస్తుంది యీ విధంగా ప్రయాణ క్రమం పూర్తి అవుతుంది.

మరొక విన్నూతన విషయం యీ పాటలో ఏమిటంటే మానవ కంఠం "జూపిటర్ గ్రంథ వరవ" వరకు పాడుతుండగా స్త్రీ కంఠం, తర్వాత గ్రహం వీనస్‌ను స్ఫురింప జేస్తూ పాడుతుంది. శని గ్రహం గురించి పాడుతున్నప్పుడు మిశ్రమ్ తెంపో అవే స్థాయికి తగ్గించ బడుతుంది. ఎందు కంటే సంస్కృతంలో మంద కొడిగా తిరిగే గ్రహం అని శనికి అర్థం. సూర్యుని గు ంచిన గీతం చాలా క్లిష్టమైన శబ్దాలతో నింపబడి అద్భుత మానవ నివాసం క్లిష్టమైంది అని స్ఫురింప జేస్తుంది, పాట చివరన హెచ్చు తగ్గుస్థాయిల కలయిక వల్ల. మానవుని ప్రయాణం వల్ల దైవసాన్నిధ్యాన్ని పొందడాన్ని రూపకల్పన చక్కగా వివరింప బడుతుంది.

పిట్స్ వ్రాసిన (మొదటి వైపు- మూన్ టు మూన్, రెండవవైపు- మూన్ టు గాడ్ రికార్డునెం. ఎస్ ఇ. ఓ. యి 3883) ఈ పాటలను ఎ ఎ రాజ్ నిర్వహణలో శ్రీ రా సంగీత దర్శకత్వంలో పి. బి శ్రీనివాస్, ఎస్. జానకి పాడారు.

● శ్రీ వెలగా వెంకట రమణ ప్రసాద్ సమర్పించు- శ్రీ విజయా పిలిమ్స్ మనసిచ్చిచూడు!" ప్రణయ సంఘర్షణా సాంఘిక చిత్రాన్ని అఖిలాంధ్ర ప్రేక్షక లోకానికి అతి త్వరలో అందించబోతున్నారు. ఇందులో పద్మశ్రీ శివాజీ గణేశన్. కె ఆర్ విజయ. పద్మిని. నాగేశ్. మనోరమ. అశోకన్, బేబీ రోజారమణి, మరియు పద్మశ్రీ నాగయ్య నటించారు.

మాటలు- పాటలు: మహాక శ్రీశ్రీ. కూర్పు శివం సంగీతం. యం. యస్ విశ్వనాథన్, నిర్వహణ డాక్టర్ రాజా చౌదరి, దర్శకత్వం ఎ. పి త్రిలోక్ చందర్, ఎం ఏ.

నిర్మాత వెలగా రామకోటయ్య చౌదరి, ఎం. ఏ

